కొడవటిగంటి
కుటుంబరావు

# ధనవంతుల రాజకీయాలు

నవభారత్
ప్రచురణ

# ఇందు

# దీపావళి రాజకీయాలు

"కాలిస్తే ఈ యేడే కాల్చాలిరా టపాకాయలూ" అన్నాడు సత్యం.

"అవున్రా! ఎందుకూ?" అన్నాడు శివం, తెలుసుకుని ఉండటం మంచిదని.

"ఎందుకేమిటి? టపాకాయలు కాల్చటం పిల్లల జన్మహక్కు" అన్నాడు సుందరం. ముగ్గురిలోకీ సుందరమే రాజకీయవేత్తా, విప్లవ నాయకుడూనూ.

"హైదరాబాదులో నరకాసురిడి ప్రభుత్వం అయిపోలేదుట్రా? అందుకూ" అన్నాడు సత్యం.

"హైదరాబాదులో రాక్షసప్రభుత్వం అయిపోతే మనకేం వరిగిందోయ్?" అన్నాడు విప్లవ నాయకుడు సుందరం.

టపాకాయలు జారిపోతున్నట్టే అనిపించింది శివానికి.

"అట్లా అనడానికి వీల్లేదు. ఎప్పుడో చచ్చిపోయిన నరకాసురుడికోసం కాల్చుకోగా లేందీ, రజాకార్ల కోసం

కాసిని సీమటపాకాయలూ, మతాబాలూ, పూవొత్తులూ, కడ్డీలూ, జిల్లీలూ, ధరణాలూ, నిప్పుల్లలూ, పాంమందూ, ఎలక్ట్రిక్ తీగె, చిచ్చుబుడ్లూ, విష్ణుచక్రాలూ అవీ క్రొద్దిగా కాల్చుకోరాదేం?" అన్నాడు శివం. అన్నీ వస్తాయని ఆశ ఎట్లాగూ లేదు: అనుకోటానికేం ?

"మనకేం పోరిగిందేమిట్రా ? ఆ దొంగ వెధవలు మూలంగానేగా మామయ్యా, అత్తయ్యా పారిపోయి వచ్చింది ? మామయ్య వంటిమీద కోటుకూడా లేదు జ్ఞాపకం ఉందా? అత్తయ్యకి జ్వరం! అక్కడ ఇల్లూ, వాకిలీ, గుడ్డలూ, కుర్చీలూ, ఏమయ్యాయో తెలీదు! మామయ్య కయితే మనకయినట్టుకాదూ ?" అన్నాడు సత్యం.

"మన కయినట్టు కాదూ?" అని వంతపాడాడు శివం.

"అవుననుకో !" అన్నాడు రాజకీయవేత్త సుందరం.

ఇక్కడికి మీటింగు ఒక మెట్టెక్కింది. పిల్లకాయలు ఈ దీపావళికి టపాకాయలు విరివిగా కాల్చవలసిన ఆవశ్యకతను గురించి, ఎట్లాగైతేనేం సభికులందరూ ఏకాభిప్రాయానికి రాగలిగారు.

సత్యం చల్లగా నాన్నమీద అవిశ్వాస తీర్మానం ప్రవేశపెడుతూ, ఉపోద్ఘాతంగా "నిరుడు కూడా నాన్న టపాకాయలు కొనిపెడతాను, కొనిపెడతాను అంటూనే కలాయించాడు" అన్నాడు.

"ఈ ఏడూ కలాయిస్తాడు!" అన్నాడు శివం బెదురు మొహం పెట్టి. "ఏదీ? ఎల్లుండి పండగ! ఇంతవరకూ ఒక్క

కాకరపువ్వొత్తన్నా కొనలా ! ఈ ఏడుకూడా బండి సున్నాయే."

"ఆ క్రిందటేడు భలే కాల్చాం, చక్రాహా!" అన్నాడు సుందరం. మంచి రోజులు జ్ఞాపకం తెచ్చుకుం టున్నవాడల్లే.

"నీ మొహం! ఆ క్రిందటేడు నువ్వు కప్పగంతులు చూసి దడుచుకుంటున్నావు. అసలు మీలో ఎవరూ నిజ మైన దీపావళీటపాకాయ లెరగరు. శివుడికి పేర్లు తెలుసు గాని వాటిని చూడనన్నా లేదు. టపాకాయలంటే యుద్ధం ముందు కాల్చాం! అవీ టపాకాయలు! ఆ తర్వాత టపా కాయ లున్నాయా ఏమిటి?" అన్నాడు పితామహుడిలాటి పధ్నాలుగేళ్ళ సత్యం.

"నాకు జ్ఞాపకం లేకేమోయ్? నేను బుట్టెడు జిల్లీలు కాల్చా, ఓ, చిన్నప్పుడు" అన్నాడు శివం.

"ఒరే సుందరం, ఓ యేడు మామయ్య శేర్లు తెచ్చాడురా! నిజమైన శేర్లు! బందరువి! అవి కాల్చాను చూడూ! ఎందుకులే?" అన్నాడు సత్యం.

"అవును, నేనూ చూశా!"అన్నాడు శివం. "నేలలో పాతిపెడితేనే మన కొబ్బరిచెట్టెత్తు లేచినై పూలు!"

"ఛీ, అవి చిచ్చుబుడ్లు!" అన్నాడు సత్యం.

నాన్నమీాది అవిశ్వాసతీర్మానం పెడతోవ పడు తోందని శివం గ్రహించి "నాన్న ఈ యేడు టపాకాయలు కొనిపెట్టనంటే?" అన్నాడు.

"నాన్న ఎట్లాగా కొనిపెట్టడు" అన్నాడు సుందరం, వర్గతత్వం ఎరిగినవాడు కనక.

"కొనిపెట్టకపోతే ఊరుకోవద్దు" అన్నాడు శివం మితవాద ధోరణిలో.

"ఊరుకోక ఏంచేదాం?" అన్నాడు విప్లవనాయకుడు సుందరం.

"ఏంచేద్దామా? రేపు తలంటు పోసుకోవద్దు. అమ్మ చేసే అప్పచ్చులు తినొద్దు" అన్నాడు సత్యం సత్యాగ్రహ శంఖం పూరించి.

"ఒకవేళ అమ్మ బొబ్బట్లు చేస్తే అవి తినొద్దా ?" అన్నాడు శివం, ముందుగా తెలుసుకుని ఉండటం మంచిదని.

సత్యం ఒక్క క్షణం ఆలోచించాడు. అతని ముఖం రాయిలా ముడుచుకు పోయింది. సత్యాగ్రహి దుష్టశక్తులతో రాజీపడరాదు !

"బొబ్బట్లు చేసినాసరే మనం తినం !" అన్నాడు సత్యం.

నాన్నమీద అవిశ్వాసతీర్మానమూ, శాసనధిక్కార తీర్మానమూ ఏకగ్రీవంగా ఆమోదించబడ్డాయి. కాని సుందరం మళ్ళీ సందేహం లేవదీశాడు.

"మనం తలంటుకుని, కొత్తబట్టలు వేసుకుని, బొబ్బట్లు తినకపోతే నాన్న కేం ?" అన్నాడు సుందరం విప్లవ దృష్టితో.

దగ్గిరికి వస్తూ వస్తూ ఉన్న టపాకాయలు కాస్తా మళ్లీ

అంతర్హితమై పోయినట్టయింది శివానికి. వాడు దీన మొహం పెట్టి, "అన్నిటికీ వీడేదో అడ్డుచెబుతాడేంరా ?"అన్నాడు.

"నిజమేరా, ఒకవేళ నాన్న ఇస్తానన్నా వీడు టపా కాయలు వద్దంటాడు కూడానూ ! గొప్ప, ముష్టి గొప్ప !" అన్నాడు సత్యం.

పరిస్థితులకు తల వంచి సుందరం తన అనుమానాన్ని ఉపసంహరించుకున్నాడు.

## 2

"ఏమండీ పాపం, వాళ్ళకేమన్నా తీసుకురారూ ? తెగ గోల పెట్టేస్తున్నారు" అన్నది అమ్మ.

"గోలపెట్టరూ దవడపళ్లూడగొట్టేవాళ్ళు లేకా ?" అన్నాడు నాన్న. ఆయనవన్నీ ఫాసిస్టు పద్ధతులే.

"అదేమిటండీ? ఇరుగు పొరుగు పిల్లలంతా అవీ ఇవీ కాలుస్తుంటే వాళ్ళకి మట్టుకు కాల్చాలని ఉండదూ ?"

"ఒహాళ్ళతో మనకు వంతేమిటి ? నిన్ను ఇందుకే పత్రిక చదవ్వే అంటాను. ప్రభుత్వాలుకూడా ఆదాలో పడ్డాయిగదా ! మనం దుబారా ఖర్చు చేస్తూ కూర్చుంటే ఎట్లా ?"

"ఏడాదికొకసారి వచ్చే పండక్కి దుబారా ఖర్చేమిటండీ. మీదంతా చోద్యం ?"

"అట్లాగా ? గుండుసూది దగ్గిర్నుంచీ ఆదా చేసేది చెయ్యవలసిందే .... మన ప్రభుత్వం తీసుకో."

"నా కక్కర్లేదు ప్రభుత్వం మీరే తీసుకోండి !"

"మన ప్రభుత్వానికి—అదేమిటీ ? — ఎన్నో కోట్లు ఖర్చౌందనుకో. అయినా కూడా వాళ్ళు ఆదాచేస్తున్నారు."

"ఎంత ఆదా చేస్తున్నారు ?"

"సరిగ్గా జ్ఞాపకంలేదు. లక్షలకు లక్షలాదా చేస్తున్నారనుకో !"

"లక్షలు కనక ఆదా చేస్తున్నారు. పోనివ్వండి. పిల్లలు గోలపెడుతుంటే రెండు రూపాయలకి టపాకాయలు పట్టుకు రావటానికి సంపాదకీయమల్లే మాట్లాడుతారేమిటీ?"

"నేర్చావులే ! ఇంటికి పత్రిక రావటం పొరపాటయింది."

"పోనీ పత్రిక మానేద్దురుగాన్లెండి."

"బాగా చెప్పావు."

"పోనీ మానకండి. మా ఖర్చు తగ్గించమంటే మీకు నచ్చిందా ? వాళ్ళ ఖర్చు తగ్గిస్తే వాళ్ళ కెట్లా ఉంటుందీ?"

"అవసర ఖర్చూ, అనవసర ఖర్చూ లేదుటే ?"

"వాళ్ళ కిది అవసర ఖర్చే."

"అయితే వాళ్ళని పెట్టుకోమను."

## 3

నాన్న లొంగిరాలేదని పిల్లలకి తెలిసింది. అమ్మ పంచమాంగదళంగానూ విదేశాంగ రాయబారిగానూ కూడా పని చేస్తోంది.

ముగ్గురూ వచ్చి నాన్నని అటకాయించారు.

"మాకు టపాకాయ లెందుకుకొని పెట్టవు, నాన్నా?" అన్నాడు సత్యం.

"వెధవల్లారా, టపాకాయలూ లేదు. గిపాకాయలూ లేదు. ఊరుకోండి."

"ఎందుకు లేదూ?" అన్నాడు సుందరం.

"వొళ్ళు కాలిపోతుంది. గుడ్డలు కాలిపోతాయి. ఏమన్నా తినేటందుకు అమ్మ చేస్తుందిలే," అన్నాడునాన్న.

"మాకోసమని చేస్తుందా ఏమిటీ? నువ్వూ అమ్మా తినటానికి చేసుకుని చిన్న పిల్లలం కనక మాక్కూడా పెడ తారు. అది మాకు చాలదు," అన్నాడు సుందరం.

"మాకు టపాకాయలు కావాలి." అన్నాడు శివం, తమ కనీస కోర్కెలను మరింత స్పష్టంగా ప్రకటిస్తూ.

"వచ్చే ఏడు చూదాంలే. ఈయేడు డబ్బులేదు" అన్నాడు నాన్న, మిగులు బడ్జెటుకోసం తాపత్రయ పడు తున్న ఆర్థిక మంత్రిలాగా.

"టపాకాయలు కొనకపోతే మే మూరుకోం!" అని సత్యం అల్టిమేటమ్ ఇచ్చేశాడు.

కార్మికుల సమ్మెవార్త విన్న డిక్టేటరు మాదిరిగా నాన్న సత్యంకేసి విచిత్రంగా చూసి, "ఊరుకోక?" అన్నాడు.

"టపాకాయలు కొంటే కొను లేకపోతే మాకు రేపూ ఎల్లుండీ పండుగే వద్దు, మేం తలంటు- పోసుకోం, పిండి వంటలు తినం" అన్నాడు సత్యం.

"నువ్వురా?" అన్నాడు నాన్న శివంతో.

"నాకు టపాకాయలు కావాలి" అన్నాడు శివం మితివాద వైఖరిలో.

"నువ్వో?"

"నేను తింటే ఏం, తినకపోతే ఏం?" అన్నాడు సుందరం.

"ఒసే, వీళ్ళు బొబ్బట్లు తినరట, చెయ్యకే." అని కేకేశాడు నాన్న.

శివం సత్యంకేసి దిగులుగా చూశాడు.

"నేను తింటా, నాన్నా. నాకు టపాకాయలసలు అక్కర్లేదు" అన్నాడు విప్లవవీరుడు సుందరం.

"ఇంకెవరన్నా ఉన్నారా బొబ్బట్లు కావలసిన వాళ్ళు?" అన్నాడు నాన్న.

"బొబ్బట్లు నాకూ-డా కావాలి" అని, గట్టిగా అని "టపాకాయలుకూడా కావాలి" అని చేర్చాడు శివం, అనుమానానికి తావు లేకుండా.

"టపాకాయలు లేవని ముందే చెప్పాగా? బొబ్బట్లు

నీక్కావాలన్నమాట! అక్కర్లేంది నీకొక్కడికేనుట్రా సత్యం?"

సత్యం ముఖం ఎర్రబడింది. తన తమ్ముల ఎదుట తనకి తీరని అవమానం జరిగింది. అటువంటివాళ్ళను వెనక వేసుకు రావటంకన్నా చావే మేలనిపించింది సత్యానికి. తన వెనక లేని ప్రజలకు నాయకత్వం వహించిన రాజకీయ వేత్తలాగా బాధపడ్డాడు సత్యం.

"ఇక పదండి" అన్నాడు నాన్న, సమావేశం ముగించే అధ్యక్షుడల్లే.

# 4

నలుగురు మనుషులు గట్టిగా మాట్లాడుతున్న గోలకి పిల్లలు ముగ్గురూ నిద్ర లేచారు. ఇల్లంతా దీపాలు వెలుగు తున్నాయి. వంటింట్లో పొయ్యిలు జంయ్యిమని మండు తున్నాయి.

"మామయ్యా, అత్తయ్యా వచ్చారు లేంవడ్రా" అని అమ్మ కేక లేస్తోంది.

"అంతా ప్రశాంతంగా ఉంది. ఏమీ అల్లర్లు లేవు" అంటున్నాడు మామయ్య.

"ఎంత పెద్ద మీటింగనుకున్నావు వదినా? రామా నంద తీర్థగారు..." అంటోంది అత్తయ్య.

"తెల్లారేలోపుగా తలంట్లయిపోతే బాగుంటుంది. కానివ్వండి, కానివ్వండి" అని అమ్మ నాన్ననీ మామయ్యనీ తొందర చేస్తోంది.

"ముందు పిల్లలసంగతి చూడవే" అన్నాడు నాన్న.

ముగ్గురూ లేచి మారు మాట్లాడకుండా ముఖాలు కడుక్కున్నారు. అమ్మ అందరికీ నూనెరాసి తలంట్లుపోసింది.

మామయ్య వచ్చినందుకు వాళ్ళకు సంబరంగానే ఉందికాని ఆయన రావటంవల్ల సత్యాగ్రహోద్యమానికి పెద్ద విఘాతం కలిగినట్టయింది.

తలంట్లు కాగానే అమ్మ ముగ్గురికీ కొత్త లాగులూ, చొక్కాలూ ఇచ్చింది.

శివం చొక్కానూ, లాగునూ తెగ గుంజుకుంటూ "కొత్తబట్టలు కట్టుకుని టపాకాయలు కాల్చాలి. లేకపోతే పాపం!" అన్నాడు.

"టపాకాయలంటే జ్ఞాపకం వచ్చింది" అంటూ మామయ్య ట్రంకుపెట్టె తెరిచి టపాకాయలు పైకి తీయసాగాడు.

శివం కళ్ళు గుండ్రంగా అయినై. తపస్సు పండి భగవంతుడి దర్శనం అయిన తపస్విలాగా. "సీమటపాకాయలు, తాటాకు టపాకాయలు, మతాబాలు, పూవత్తులు, కడ్డీలు, జిల్లీలు, నిప్పెట్టెలు, చిచ్చుబుడ్లు...!" అని ఏకరువు పెట్టసాగాడు.

"అయ్యయ్యో! అన్నీ తెచ్చావుట్రా? అయిదు రూపాయలు తగలేసి నేనూ తెచ్చా టపాకాయలు, పిల్లలేడుస్తున్నారనీ!" అన్నాడు నాన్న.

"కాల్చనీ బావా! అసలు టపాకాయలు కాల్చాలిసింది ఈ దీపావళికే" అన్నాడు మామయ్య పెట్టె మూసేస్తూ.

# తిండి దొంగ

"తిండిదొంగలంటే జ్ఞాపకం వచ్చింది. మొన్న మా అత్తగారేంచేసిం దనుకున్నారు? ఎవరితోనూ చెప్పకుండా పెద్దగిన్నెలో అన్నమూ, కూరలూ, పిండివంటలూ అవీ పెట్టుకొని కొడుకుదగ్గిరికి వెళ్ళిపోయింది." అన్నాడు డాక్టరు శ్రీహరిరావు క్లబ్బులో.

అందరూ ఆశ్చర్యపడ్డారు.

*　　*　　*　　*

వెంకాయమ్మ అన్నవస్త్రాలకు లోటులోని ఇంటనే పుట్టినా ఒక్క రోజుకూడా మనశ్శాంతి ఎరుగదు. తన తండ్రి, పెత్తండ్రి నిత్యమూ కుక్కలల్లే కాట్లాడుకు నేవాళ్ళు. తన తల్లీ, ఆవిడ వియ్యపురాలూ అస్తమానమూ సాధించుకుంటూ సూటీ పోటీ లాడుకు నేవాళ్లు. ఇల్లు పంచుకున్నా, దొడ్డి పంచుకుని బావి నడిమధ్యానికి దడికట్టుకున్నాకూడా ఈ పోట్లాటలు తప్పలేదు. ఇద్దరికీ కావలసిన ముసలమ్మ ఉండేది. ఒకరిమాటలు ఒకరికి వినపడక తప్పదాయె.

బంధువులు—ఉభయపక్షాలకూ అయినవాళ్ళు—రాకుండా ఉండరాయె. ఇవన్నీ పోట్లాటలు పెరగటానికి ఉపకరించాయిగాని సమాధానం కుదరటానికి తోడ్పడ్డ పాపాన పోలేదు. దొడ్డి దడినుంచి ఏవైపువాళ్ళు నాలుక గీసుకోటాని కింత తాటాకుముక్క లాగినా, రెండో వేపువాళ్ళకి శివమెత్తుకొచ్చేది. అఖరుకు, బావిలోనుంచి ఎవరు ఎక్కువ నీళ్ళు చేదుకుంటున్నారనే దాన్నిగురించికూడా పోట్లాడుకునేవాళ్ళు. పిల్లలకుకూడా పరస్పరం ద్వేషం కలిగేటట్టు చేశారు పెద్దవాళ్ళు. పెద్దవాళ్ళ కావేషాలకన్నా ఈ ద్వేషాలే ఎక్కువ హానికరంగా ఉండేవి. ఎందుకంటే పెద్దవాళ్ళ కావేషాలకు ఏదో ఒక ఆధారం—కుంటిదో, గుడ్డిదో—ఉండేది. చిన్నవాళ్ళ ద్వేషాలకు ఏ ఆధారమూ లేదు. అది మానవ ప్రకృతిమీది ద్వేషంగా పరిణమించక తప్పదు; మానవత్వాన్ని నాశనం చెయ్యకా తప్పదు.

వెంకాయమ్మకు పెళ్ళయి ఆమె కాపరానికి వెళ్ళిన తరవాత కొద్దికాలంపాటు జీవితం శాంతివంతంగా ఉన్నట్టు కనిపించింది. గాని, అది రాజకీయవేత్తలు చెప్పినట్టు స్మశాన శాంతి. వెంకాయమ్మ మామగారు చాలా ఏళ్ళ క్రితమే పోయినాడు. ఆఇంటి ఆవరణలో ఆమె అత్తగారిదే రాజ్యం. ఆవిడతో ఎవరూ వాదించటానికి లేదు. ఎదురుమాట అనటానికి లేదు. ఆవిడకు ఎవరిమీదన్నా ఆగ్రహం వస్తే ఆపూట వాళ్ళు తిండి తినరాదు. ఆవిడ ఏకోడలినన్నా పిలిచి, "వంద బిందెలుతోడమ," అంటే తోడవలసిందే. ఎక్కడా పొయ్యటానికి లేకపోతే పారబోయాలిసిందేగాని తోడటం మాన

రాదు. ఆవిడ ఏ కొడుకునన్నా పిలిచి, "ఈ పిత్యాన్ని పది దెబ్బలు కొట్టు" అంటే వాడు కొట్టాలిసిందే, చావాలిసిందే. "ఎందుకు ?" "ఏం చేసింది ?" అనటానికి ఏల్లేదు.

మొదట్లో వెంకాయమ్మ తన కళ్ళనూ, చెవులనూ నమ్మలేకపోయింది. ఇదంతా ఒక ఆటలాగా, అందులో తన కేమీ భాగం లేనట్టూ, తానుమాత్రం ప్రేక్షకురాలైనట్టూ భావించింది — తనను అత్తగారు నూరు బిందెలు తోడమని, తోడలేనని చేతుల బొబ్బలు చూపుకున్నందుకు తన భర్తచేత పది దెబ్బలు కొట్టించటం జరిగినాక ఈ భావన పోయింది.

యథార్థమైనంత మాత్రంచేత ప్రతిది సహజం కానవసరం లేదు. తన అత్తగారి ప్రవర్తనా, మిగిలినవాళ్ళు ఆవిడ "పైత్యాన్ని" సహించి శిరసావహించటమూ వెంకాయమ్మకు అమిత అసహజంగా తోచింది. చదువుకున్న మగాళ్లుకూడా యీ పిచ్చిముండ మాటలు ఎందుకు వింటారూ ? వాళ్ళకి యావజ్జీవ ఖైదెందుకు ? తల్లి అని భక్తా ? లేక ఆవిడపేర ఆస్తి ఉందని గౌరవమూ ?

ఆ తరంవాళ్ళలో వెంకాయమ్మ బాగా తెలివి గలదనే చెప్పాలి. ఎంత కీచులాడుకున్నా తన పుట్టింటివాళ్ళు మెట్టినింటివాళ్ళకన్న చాలా నాగరికులని వెంకాయమ్మ సులభంగానే గ్రహించింది. తన అత్తగారు కొంత కాలానికి చచ్చిపోయింది. ఇకనైనా పరిస్థితులు మారతాయనుకున్నది. పరిస్థితులు మారాయిగాని వెంకాయమ్మ మొగుడు మానవత్వం సంపాదించలేదు. మానవత్వం తాలూకు

బీజాలు అతనిలో ఏనాడో తల్లి పుణ్యాన నాశనమైపోయాయి. తల్లి ఆత్మకు శాంతి కలగగలందులకు వెంకాయమ్మను అతను రోజూ కారణం లేకుండానే, చావగొట్టేవాడు. అది వరలో మొగుడు అత్తగారి చేతిలో పనిముట్టల్లె కనిపించడం వల్ల ఆమె కెప్పుడూ అతనిమీద అట్టే కోపం రాలేదు. ఇప్పుడు కోపమూ, అసహ్యమూ కూడా కలిగాయి. ఈ దశలోనే, ఇద్దరు పిల్లల తల్లి అయివుండి వెంకాయమ్మ గాడితప్పి, ప్రేమంటే ఎట్లా ఉంటుందో ఇతరత్రా తెలుసుకున్నది. కాని ఈ రహస్యప్రణయం కొద్దికాలమే సాగి వెంకాయమ్మ ప్రతిష్ఠ పాడుకాకుండా అంతమయింది. ఇది ఆమెకు మానసికంగా చాలా మేలుచేసింది. సరిగా ఆ సమయానికి ఎవరో ఒకరు ఆమె హృదయంలో ప్రేమ రగల్చకపోతే ఆమె హృదయం శాశ్వతంగా సుష్కించి పోయి ఉండును. ఈ అనుభవం ఫలితంగా ఆమెకు తన కొడుకుమీదా కూతురిమీదా అనురాగం హెచ్చింది; జీవితంమీద కొంత ఆశకూడా కలిగింది.

... ... ...

వెంకాయమ్మ మొగుడు కష్టజీవి కాడు.

ఎవరో పొలాలు పండించి కుమ్మరిస్తే దానితో కాలక్షేపం చేసినవాడు. అయినప్పటికీ అతను పట్టణవాసాలలోని కష్టజీవుల మాదిరిగానే జీవితాన్ని మరచిపోవటానికి తాగుడు అలవాటు చేసుకున్నాడు. అంతులేని కష్టం పాఠకుల మనస్సులను ఎట్లా సంక్షోభింప చేస్తుందో, లోతులేని అజ్ఞానం

అతని మనస్సును అదేవిధంగా క్షోభింపజేసి పలాయనం కోరింపే. ఆశ శ్రమలేకుండా డబ్బు సంపాదించటానికి అతను చేసిన ప్రయత్నాలు ఏమీ ఫలించలేదు. పైపెచ్చు ఉన్నది కూడా ఊడ్చిపెట్టుకుపోయింది. తల్లి ఆస్తేమో ఆపిల్లలకు పోయింది. ఆవిడ ఆడించినట్టు ఆడిన కొడుకు కోడళ్ళకూ, వాళ్ల పిల్లలకూ పూచికపుల్ల దక్కలేదు.

*     *     *     *

వెంకాయమ్మ మొగుడు పోయేనాటికి ఆమె కొడుకు రమణయ్య పన్నెండేండ్లవాడు, కూతురు సుభద్ర ఎనిమిదేళ్ళది. తను జన్మ ఎత్తిన ముప్పై ఏళ్ళకు వెంకాయమ్మకు మొగుడు పోగానే మనశ్శాంతి లభించినట్టు కనిపించింది. ఇప్పుడు తనకు ఇతరుల మూలంగా ఏ బాధా లేదు. పిల్లలిద్దరూ బుద్ధిమంతులు. ఇద్దరూ చదువుకుంటున్నారు. ఏడెనిమి దెకరాల పొలంవున్నది. రైతు మంచివాడు. కాని ఈ ఉన్నకాస్త మనశ్శాంతినీ బాధ్యతను హరించాయి. చుట్టపక్కాలతో, ముఖ్యంగా మొగుడివైపు వాళ్ళతో, అకారణమైన పేచీలు రాకుండా, మళ్లీ వాళ్లు తనను మోసం చేయకుండా చూచుకోవాలి. ఇంటి పనులు చాలాభాగం రమణయ్య చేస్తాడు. కాని పైవాళ్ళ సహాయం లేకుండా జరగదు. తన మర్యాదకు భంగం రాకుండా మంచి మాటలతో ఇరుగుపొరుగు వాళ్ళచేత పనులు చేయించుకోవాలి. పిల్లలకు కాస్త దగ్గూ పడిసెమూ వస్తే తనకు భగవంతుడు తప్ప మరో దిక్కే లేదనిపించేది. వెంకాయమ్మకు తనకే ఏదన్నా జబ్బుచేస్తే "నేను పోతానేమో ? ఈ పిల్ల

లేమాతారు ? వాళ్ళ మొహం ఎవరుచూస్తారు?" అని పించేది

కాని ఈ విధమైన బాధ్యతలు వెంకాయమ్మను నిజంగా బాధించలేదు. పైనుంచి ఎవరులేకుండాఉంటే స్వతంత్రంగా ఎంత బాధ్యత అయినా భరించవచ్చు. ఇది ప్రత్యేక వ్యక్తులకూ, ప్రజలకూ కూడా వర్తిస్తుంది.

అంతమాత్రానికి మనిషికిమించిన బాధ్యత లుండవని కాదు. సుభద్ర పెళ్ళి ఒకటి వెంకాయమ్మను చాలా బాధించసాగింది. తను న్యాయంగా కోరదగిన కోర్కెలనే అణుచుకునే స్వభావంగల వెంకాయమ్మ కూతురి పెళ్ళి విషయంలో ఎన్నో గొంతెమ్మ కోరికలు కోరసాగింది. సుభద్రకు వచ్చే మొగుడు అందరికీ నచ్చాలి; అందగాడుగా, చదువుకున్నవాడుగా, బుద్ధిమంతుడుగా, డబ్బున్నవాడుగా వుండాలి; సుభద్ర అత్తవారు మంచివారై ఉండాలి; వాళ్ళు పెద్ద కట్నాలడగరాదు; పెళ్ళికి ఏమీ ఖర్చు కారాదు.

ఈ ఆఖరు కోరికతప్ప మిగిలినవన్నీ కలిసివచ్చిన సంబంధం వచ్చింది. వాళ్ళు సుభద్రనుచూసి చేసుకుంటా మన్నారు. వాళ్లంతట వాళ్ళు కట్నం యింత ఇమ్మని అడగ లేదు గాని, అవతల మూడువేలు కట్నమిస్తామంటూ సంబంధా లున్నాయి. కట్నాలకిందనే మూడువేలు పోసి, పెళ్ళి ఖర్చుల కింకొక వెయ్యి పోసి—రమణయ్య అడుక్కు తినాలిసిందే.

సుభద్ర పెళ్ళికి రమణయ్య బొత్తిగా బొట్టికాయ

కాదు; పదిహేనో యేడు వచ్చింది. స్కూలుఫైనలు చదువు తున్నాడు. వెంకాయమ్మ కొడుకును సలహా అడిగింది. "ఖర్చయితే అయిందిలే, మంచి సంబంధం చేద్దాం. మగ వాణ్ణి బతకలేకపోతానా ?" అన్నాడు. వెంకాయమ్మ సంబంధం స్థిరం చేసింది. పెళ్ళివారు వెయ్యినూట పదహార్లు రొక్కంపూ, మిగిలిన లాంఛనాలక్రిందా, వచ్చినవారి బట్టల కిందా మరో వెయ్యీ తీసుకోవటానికి అంగీకరించారు.

ఈ పెళ్ళి నిశ్చయించి వెంకాయమ్మ బంధువుల విమర్శకు గురి అయింది. ముఖ్యంగా ఆమె మొగుడివైపువాళ్ళు, "మా వంశానికి చెందిన పొలం కాస్తా లోకులపాలు చేస్తున్నావు—మా తాత ముత్తాతలు అనుభవించిన ఆస్తి!" అన్నారు. వెంకాయమ్మకు అభిమానం వచ్చింది. సుభద్ర పెళ్ళికి అవసరమైన మూడువేలూ పొలం తాకట్టుపెట్టి రూపాయి వడ్డీకి సంపాదించింది. పొలంమీద వచ్చేదానితో ఏనాటికైనా అసలు ఫాయిదాలు చెల్లుబడవా, రమణయ్య సంపాదించడా ! అని ఆమె ధైర్యం. ఏమైనాసరే పొలంలో ఒక్క సెంటుకూడా అమ్మరాదని ఆమె ప్రతిజ్ఞ.

* * * *

ఈ ప్రతిజ్ఞ చెల్లలేదు. రమణయ్య మేజరు కాగానే నాలుగెకరాలు అమ్మి వడ్డీతోసహా ఈ బాకీ తీర్చేశాడు. అప్పుడే అతని భార్యకూడా కాపరానికి వచ్చేసింది. అతనికి ఉద్యోగంమాత్రం నిలకడగా దొరకలేదు. నెలకు పాతికరూపాయలు సంపాదించటానికి నానాహైరానాపడాల్సివచ్చింది.

అతని దరిద్రం కవులు కీర్తించేది. చిత్రకారులు చిత్రించేది కాదు. అది ఆకర్షరహితమై, గాయం కలగనీకుండా తగిలిన దెబ్బలాటిది. రెండేళ్ళ కొకరు చొప్పున పిల్లలు పుట్టుకు రాసాగారు. ఖర్చు జాస్తి అయింది. దానికి తగ్గ ఆర్జనలేదు. ఇంట్లో సరిగా తిండీ, గుడ్డా లేవు.

మొదట్లో వెంకాయమ్మ ఈ దరిద్రాన్ని లక్ష్యపెట్టలేదు. రమణయ్యను కోడల్ని చూస్తుంటే వెంకాయమ్మకేదో గొప్ప సంతృప్తి కలిగేది. ఈ తరంవాళ్ళు జీవితాన్ని మార్చేశారు. రమణయ్య భార్య జానకి తన కాలంనాటి కోడలు కాదు. తనను రమణయ్య ఎట్లా చూసేవాడో, జానకి అట్లాగే చూసేది. రమణయ్యకూడా తన కాలంనాటి భర్త కాదు. జానకిని బిడియం లేకుండా అపేక్షతో చూసేవాడు. "నీవు ఆడదానివి. నిన్ను మనిషల్లే చూడవలసిన అవసరం లేదు." అన్నట్టు ఎప్పుడూ పెళ్ళాంతో మాట్లాడేవాడు కాడు.

"ఇంకా కొంతకాలానికైనా మొగుళ్ళంతా పెళ్ళాలను ఇట్లాగే చూస్తారుకాబోలు. ఎంత మంచి రోజులు!" అనుకునేది వెంకాయమ్మ. ఏ మనిషిలోగాని అటువంటి ఆశ కలిగించే శక్తులు తప్పక అభ్యుదయ శక్తులే.

కాని ప్రత్యక్ష దారిద్ర్యం ఇటువంటి సంతృప్తిని ఎంతో కాలం దక్కనివ్వదు. ఒక్కొక్క ఏడే, ఒక్కొక్క నెలే, ఒక్కొక్క వారమే ఒక్కొక్క రోజే యుగంగా గడవసాగింది.

దారిద్ర్యం మనుష్యుల మంచితనాన్ని మన్నించదు.

వాటిని మన్నించే మానవులు దారిద్ర్యాన్ని నాశనం చెయ్య టానికి పూనుకోవాలి. మంచితనంమీదా, సంస్కారంమీదా అభిమానం ఉన్నవాళ్ళు దారిద్ర్యంపట్ల ఉపేక్ష వహిస్తే దారిద్ర్యం మంచితనాన్నీ సంస్కారాన్నీ నాశనం చేసి తీరుతుంది.

*   *   *   *

"నాతో ఎందుకమ్మా నువుకూడా ఈ కష్టాలు పడటం? నువు సుభద్ర దగ్గిరికి పోయి ఉండు. శ్రీహరి రావు పని బాగుంది. అతని వైద్యం బాగా సాగుతున్నది. నెల నెలా వెయ్యా, పదిహేనువందలూ బ్యాంకులో వేస్తు న్నాట్ట" అని రమణయ్య తల్లిని ప్రయాణం చేయించాడు.

వెంకాయమ్మ కూతురుదగ్గిరికి వచ్చింది. చాలాసేపు నీటిలో మునిగి ఉండి ఉక్కిరి బిక్కిరి అవుతూవున్న మనిషి బయటికి వచ్చినట్టయింది. ఇక్కడ దరిద్రంలేదు. లక్ష్మి తాండవమాడుతున్నది. సుభద్ర పూర్వజన్మ సుకృతం— ఏ పెట్టెతీసినా పదిరూపాయలనోట్లే, ఇనప్పెట్టెలో వెయ్యి రూపాయలకు తక్కువ ఏనాడూ ఉండవు. బీదవాళ్ళల్లే కనిపించేవాళ్ళుకూడా డాక్టరు దర్శనం చేసుకుని ఆయనచేత కసిరించుకుని అయిదు రూపాయలనోట్లూ, పది రూపాయల నోట్లు చేతిలోపెట్టి పోతుంటారు. రోజూ ఇట్లాగే సాగుతుంది. రేపు పది రూపాయల నోటు రాదేమో అనే భయంలేదు— రాకపోతే ఇబ్బందిలేదు.

సుభద్ర వంటినిండా బంగారు తొడుగు,

సుభద్ర కూతురికి ఉన్నాయి – వెయ్యి రూపాయల నగలూ, బొమ్మలూ, లోపుడుబళ్ళూ, వెండి గిన్నెలూ, బంగారు గిన్నెలూనూ.

ఒక వారంపాటు వెంకాయమ్మకు తనకొడుకు జీవితం జ్ఞాపకమే రాలేదు. కాని ఈ ఇంట్లో తనకున్న స్థానం నౌకర్లకున్నటువంటిదేనని వెంకాయమ్మకు త్వరలోనే తెలిసిపోయింది. ఇంటికి వచ్చే గొప్పవాళ్ళతో తాను మాట్లాడరాదు. ఇంట్లో పనివాళ్లకు తను పనులు చెప్పరాదు. మొగుడూ, పెళ్ళామూ ఎక్కడికి బయలుదేరినా తనను పిలవరు. సుభద్ర తనతో మాట్లాడేటప్పుడు నౌకరతో మాట్లాడిన దానికన్నకూడా అసహ్యంగా మాట్లాడుతుంది. నౌకర్లు కోపంవస్తే పని మానేసి పోవచ్చు...ఎవరో సుభద్రను అడిగారు, "ఆవిడ మీ అత్తగారాండీ?" అని...

ఈ ఇంట్లో జరిగే వృధా ఖర్చుచూసి, కొడుకు పడుతున్న పాట్లు జ్ఞాపకంవచ్చి, వెంకాయమ్మకు కన్నీటి పర్యంతం ఐంది. ఈ దుబారాఖర్చులో సగండంటే–నాలుగోవంతుంటే—రమణయ్య జీవితం హాయిగా వెళ్ళిపోను!... ఎందుకీ వ్యత్యాసం? ఎవరు చెబుతారు? ఎట్లా అర్థమవుతుంది?

నోరు కట్టుకోలేక వెంకాయమ్మ ఒకనాడు కూతుర్ని అడిగింది. "నీదగ్గర ఎప్పుడన్నా కాస్త డబ్బు మిగిత్తే అన్నయ్యకు పంపించరాదుటే?" అని.

"నా కటువంటి పనులు అసహ్యం. మా ఆయనకు తెలియకుండా నే నొక్క కాసీ ఖర్చు చేయను. అన్న

య్యాను కావలిస్తే ఆయన్నడుగరాదు, నామొహిస్తూ ?" అన్నది సుభద్ర. సుభద్ర హృదయంలేని మనిషికాదు. కూతురిమీద ఎంతో ఆపేక్ష, డబ్బుకు దారిద్ర్యంమీద గల నిర్లక్ష్యమే సుభద్రలో కనిపిస్తున్నది.

* * * *

ఆరోజు డాక్టరు శ్రీహరిరావు ఇంట్లో విందు. సుభద్ర పుట్టినరోజు. ఎంతెంత గొప్పవాళ్ళో వస్తున్నారు. పెద్దెత్తున వంట సాగుతున్నది. మణుగులకొద్దీ కూరలు, గుండిగలతో అన్నం.

ఆరోజే వచ్చింది. రమణయ్యదగ్గర్నుంచి ఉత్తరం. "...జానకి మూడురోజులనుంచీ మంచం పట్టింది. డాక్టర్లకు చూపమంటారు. దేనికి? తినడానికి తిండిలేక పాడే మనిషికి మందు లెందుకు? ఇవాళ్లో రేపో అందరము మంచం ఎక్కడానికి సిద్ధంగానే ఉన్నాం..."

ఎంతకష్టమైనా ప్రత్యక్షంగా భరించటంకన్న పరోక్షంగా సహించటం చాలా కష్టం. ఈ ఉత్తరం చూడగానే వెంకాయమ్మ కాళ్లుచేతులూ వణికి శరీరం చల్లబడటయింది. ఇటువంటి పరిస్థితులు అదివరలో వెంకాయమ్మ చూస్తుండగా చాలాసార్లు జరిగాయి. ఈ ఉత్తరం రాసిన మరో గంటకు రమణయ్య ఎవరిదగ్గరన్నా రెండు రూపాయలు బదులు పుచ్చుకొని ఉండవచ్చు. కాని ఆ విషయం వెంకాయమ్మకు ఎట్లా తట్టుతుంది.

ఆమె ఉత్తరం పట్టుకుని సుభద్ర దగ్గిరికి పోయి, "అన్నయ్య ఉత్తరం రాశాడే" అన్నది.

భూభారమంతా మోస్తున్నంత విసుగుతో సుభద్ర, "ఇప్పుడేమిటమ్మా ? తరవాత సావకాశంగా చూడ కూడదూ ?" అంటూ అర్జంటు పనిమీద వెళ్ళిపోయింది.

ఆరాత్రి భోజనాలయాయి. విస్తళ్ళలో ఎవరి చిత్తం వచ్చినంత వారు పారేశారు. కొడుకుదగ్గిర్నుంచి ఉత్తరం వచ్చిన తరవాత వెంకాయమ్మ గుక్కెడు మంచినీళ్ళు తాగ లేదు. అందరు భోజనాలూఅయి పనివాళ్లు వెళ్ళిపోయేసరికి రాత్రి పదకొండయింది. వెంకాయమ్మ ఇంకా భోంచెయ్య లేదు. భోంచేశావా అని అడిగినవారు లేరు.

వెంకాయమ్మ వంటఇంటిలోకి పోయింది. ఇంకో సమారాధనకు సరిపోయే పదార్థాలు మిగిలిపోయాయి. ఒక అరిటాకు వేసుకుని పట్టెడన్నం పెట్టుకొని భోజనానికి కూచుంది. ముద్ద దిగలేదు. "ఏపాటు తప్పినా సాపాటు తప్పదు" అంటూ బలవంతాన రెండు ముద్దలు మింగిందో లేదో వాంతి అయిపోయింది.

వెంకాయమ్మకు ఏదో గొప్ప ఆలోచన తట్టింది. ఒక పెద్ద గిన్నెతీసి దానినిండా అన్నమూ, కూరలూ, పిండి వంటలూ, పచ్చళ్లూ కుక్కి పెట్టింది. దానిపైన ఆకు కప్పి వాసెన కట్టింది.

అది పట్టుకుని అరరాత్రివేళ బయలుదేరింది— కొడుకు ఇంటికి !

# దేవుడింకా ఉన్నాడు!

ఇటీవల నేను మా స్వగ్రామం వెళ్ళాను. నాకు అయినవాళ్ళంతా అక్కడే ఉన్నారు. వాళ్లని చూసి పదేళ్లయింది. నేను జంఝాలు తెంపేసి, తద్దినాలు మానేసి ఏనాడయితే వితంతువును, అందులో మరో శాఖదాన్ని పెళ్లాడానో ఆనాడే నాకూ మా బంధువులకూ ఋణం తీరిపోయింది. నేను మా ఊరు వదిలిపెట్టి వెళ్ళిపోతున్నానన్నప్పుడు అందరూ సంతోషించారు. నా ప్రయాణానికి ముహూర్తాలు పెట్టారు. "ఎప్పుడు వెళ్ళటం?" అని ఒకటికి పదిసార్లు అడిగారు; "ఇంకా పోలేదా?" అని కూడా అడిగారు. అయిపోయింది. నేను ఊరు విడిచి వచ్చేశాను. వాళ్ల కోరిక ఫలించిందని నేనూ సంతోషించాను.

కాని వారికి సంతృప్తి కలిగినట్టు లేదు. నేను వాళ్ళ మొహం చూడకుండా పదేళ్ళు గడపగలగటం వాళ్ళు సహించలేక పోయినారు. నాకు బంధువులమీద ప్రేమే లేదన్నారు. ఎవరు బ్రతికున్నారో, ఎవరు చచ్చారో కూడా నేను పట్టించుకోవటం లేదన్నారు. నాకు నిష్ఠురపు ఉత్త

రాలు రాశారు. చివరకు నేను మోసపోయినానాను. వాళ్లంతా కాలంతోపాటు మారారనుకున్నాను. నిజంగా సంతసిస్తున్నారని నమ్మాను. వెళ్లాను.

అరుగుమీద చాపేసి కూర్చోబెట్టారు నన్ను. ఊళ్లో ఉన్న బంధువులంతా చేరారు. మామూలు కుశలప్రశ్నలు వేశారు. సమాధానం చెప్పాను. సంభాషణ ఆగిపోయింది.

అందరి మొహాలకేసి చూశాను. ఎవరి మొహానా ఒక సంతోషంగాని, విచారంగాని లేదు.

అకస్మాత్తుగా నిశ్శబ్దం భంగమయింది.

"చావు వెధవా!" అని మా పెద్ద వొదినెగారు తన ఆఖరు కొడుకును ఫెడీమని వీపుమీద ఒక్కటి చరిచింది. వాడు బొక్కా పట్టాడు. వాడి మొహ్మో రెండు తాయిత్తులూ, మొలకు మరొక తాయిత్తు కనిపించింది. పిల్లవాడు చాలా ఆరోగ్యంగా ఉన్నాడు. పొట్ట పెరిగింది. రొమ్ము ఎండుకు పోయింది. కాళ్ళు పుడకలల్లే ఉన్నాయి. తల పెద్దదిగా కనిపిస్తుంది.

"పిల్లవాడట్లా ఉన్నాడేం వదినా?" అన్నాను.

"నేను చేసుకున్న రాత!" అన్నదావిడ.

"ఏమన్నా మందిప్పిస్తున్నారా?"

మా చినతాతయ్య దగ్గాడో, లేక నవ్వాడో, ఆ రెండు చప్పుళ్ళు ఆయన ఒకటిగానే చేస్తాడు.

"భైరవశాస్త్రిల్లా... నవగ్రహ జపం చేసి... తాయెత్తు కట్టాళ్ళే" అన్నాడాయన సావధానంగా.

విషయం మార్చటానికని "ఇక్కడ ఈ ఇటికల పోగేమిటి ?" అన్నాను.

"చూడలేదుట్రా ? మేడమీద దక్షిణవేపు గది విప్పించేశాం ?" అన్నాడు మా పెదనాన్న.

"ఏం" అన్నాను ఆశ్చర్యంగా. మా దిక్కుమాలిన మేడకల్లా అదొక్కటే సుఖమైన గది.

"అందులో తాతయ్య ఉన్నాడు కాదుమరీ ?" అన్నాడు పెదనాన్న.

తాతయ్య ఉండటమంటే మీ కర్థంకాదు. మా తాత చచ్చిపోయి దయ్యమై ఆ గదిలో ఉంటున్నాడు. మరేగదిలోకి తాతయ్య రాడు.

"భైరవశాస్త్రుల్లుచేత ముగ్గులూ అవీ వేయించాం. లాభించలేదు. తాతయ్యకు భేతాళమంత్రంవచ్చును కాదు మరీ ? భైరవశాస్త్రుల్లు ముగ్గులు పనిచెయ్యలేదు. మారణ హోమం చేశానన్నాడు భైరవశాస్త్రుల్లు. బ్రహ్మహత్య దేనికని మేమంతా వారించాం" అన్నాడు పెదనాన్న.

చినతాత దగ్గాడో లేక నవ్వాడో.

"ఎందుకూ? గది పడగొట్టేస్తే... ఆయనే వెళ్ళిపోతాడు. ఆ గదిలో అన్నయ్య ఏమన్నా నిక్షేపం దాచాడా— లేకపోతే ఆ గదిని విడిచి ఎందుకు పోడూ ? అని నాకు

సందేహం కలిగింది. సగం అందుకే నేను పట్టుబట్టి గది పడగొట్టించేశా" అన్నాడాయన.

"అన్నీ అనర్థాలుగానే ఉన్నవి కొంపకు. (గొంతు తగ్గించి) సత్యం పెళ్లాం మళ్లీ లేచిపోయింది, గుర్రబ్బండి వాడితో—"

సత్యమంటే మా రెండో అన్న. నేను మావూరు వదిలినాక వాడిభార్య పోయింది. రెండో పెళ్ళి చేసుకున్నాడు. ఈవిడ అదివరకొకసారి లేచిపోయిందని నాకు తెలీదు.

"ఇదంతా సత్యం మొదటి భార్యపనే! బాలింత చావు కూడా చచ్చిందా? నానా ఏడుపులూ ఏడిపిస్తున్నది. సత్యానికి నెలకోసారైనా కనిపించి, నీ కాపరం సాగనిస్తారనుకున్నావా, అని బెదిరిస్తూంటుంది. అది లేచిపోయిందంటే పోదూ? దీనికి నలుగురు పిల్లలు పుట్టారా? మూడో వాడు తప్ప మిగిలినవాళ్ళంతా పోయినారు. అందర్నీ పొట్టన బెట్టుకుంది" అన్నాడు పెదనాన్న.

"మూడోవాణ్ణి వదిలిందేం?" అన్నాను.

"ఏం వదిలింది, వాడికి అన్నీ ఘోరాలే! డాక్టర్ను వద్దు అంటున్నకొద్దీ మీ పెద్దన్నయ్య పిలిచాడు. వాళ్ళ మొహం! డాక్టర్లేం చెబుతారు? తల్లికి సవాయిరోగం ఉందన్నాడు. నిక్షేపమైన బ్రాహ్మణ కుటుంబంలో సవాయి ఏమిటి వాడి శ్రాద్ధం? భైరవ శాస్త్రుల్లును పిలిస్తే అసలు కీలకం ఇట్టే చెప్పాడు. ఇదంతా సత్యం మొదటి పెళ్ళాం పనే!" అన్నాడు పెదనాన్న.

చిన్న తాతయ్య దగ్గాడు.

"అసలు సత్యానికి గురువులో శనీ! శని కోణంలో ఉన్నాడు. సప్తమంలో శుక్రుడూ ఉన్నారు...ఇంకా రెండేళ్ళ మూడునెల్ల పన్నెండు రోజులు అప్పటికి సత్యానికి మారకమన్నా కావలి లేదా మంచి యోగమన్నా పట్టాలి. ఏదో ఒకటి తప్పదు" అన్నాడు చిన తాతయ్య.

నేనీ మాటలు వింటూండగా మా పెద్దన్న రెండో కూతురు ఎప్పుడో వచ్చి నా జేబులో పెన్ను లాగి మోకాలికి పెట్టి రెండుగా విరిచి కాళ్ళమీద సిరా పడ్డందుకు పెద్ద పెట్టున ఏడవసాగింది. మా పెద్దనాన్న చప్పున లేచి నా కండువాతో దాని కళ్ళు రెండూ తుడిచాడు.

మా చినతాత మా సత్యానికి రానున్న మారక యోగం సంగతే ఇంకా ఆలోచిస్తున్నట్టు కనపడ్డాడు. ఆయన నిట్టూర్చి "ఏమో, అన్నింటికీ భగవంతుడున్నాడు" అన్నాడు.



# కార్మిక విజయం

కార్మిక నాయకుడికి స్వాగతం ఇవ్వటానికి వందలాది కార్మికులు ప్లాట్‌ఫారంమీద నిలబడ్డారు.

రైలింకా అంత దూరాన ఉండగానే, "కార్మిక నాయకుడికీ జై" అని స్టేషను కప్పు ఎగిరేట్టు అరిచారు కార్మికులు.

ఆగే రైలు ఒకటో తరగతి పెట్టెలోనుంచి కార్మిక నాయకుడు తొంగి చూశాడు పత్రికా విలేఖరుల కోసం.

కార్మిక నాయకుడి మొహం కనిపించగానే కార్మికులకు పారవశ్యం కలిగింది. గొంతుకులు బొంగురు పొయ్యేటట్టు జయధ్వానాలు చేశారు.

నాయకుడు రైలు దిగుతుండగానే వందలాది ఆయనను చుట్టుముట్టారు. పది పదిహేను సంఘాలవారు అతని మెళ్ళో దండలు వేశారు.

ప్రెస్ కెమెరాలు మెరిశాయి. పత్రికా విలేఖరులు నాయకుణ్ణి చుట్టుముట్టారు.

"ఏం చెప్పమన్నారు" అన్నాడు నాయకుడు.

"కొల్లాయి గుడ్డల పారిశ్రామికులు, పారిశ్రామిక తగాదా పరిష్కార సంఘంవారి నిర్ణయాన్ని తృణీకరించి బోనస్ ఎగగొట్టనున్న సందర్భంలో, మీరు సమ్మె చెయ్యమని కార్మికులకు సలహా ఇస్తారా?" అని ఒక పత్రికాదూత అడిగాడు.

"ఇది చాలా క్లిష్ట సమస్య. సాత్వికంగా అన్ని మార్గాలూ చూసిగాని సమ్మె నిర్ణయం చెయ్యరాదని నా మతం. మనం మహాత్మా గాంధి సత్యాహింసలను జవదాటటమంటే కార్మికోద్యమాన్ని ఉరి తీయటమే" అన్నాడు కార్మిక నాయకుడు.

"ప్రస్తుతం రష్యా వహించే అంతర్జాతీయ పాత్ర ఏమిటి?" అని మరొక పత్రికా సేవకుడడిగాడు.

"అమెరికా తెచ్చిపెట్టడానికి జంకే మూడవ ప్రపంచ యుద్ధాన్ని జూన్ 25–న కొరియాతో రష్యా ప్రారంభించిన సంగతి అందరూ పత్రికలలో చదివికూడా ఒక్కరూ తెలుసుకోవడం లేదు" అన్నాడు కార్మిక నాయకుడు.

"కొరియా వెనక ఒక రష్యాయే ఉన్నదా, చైనా కూడా ఉన్నదా"?

"ఇకముందు ప్రపంచమంతా విస్తరించుకునేది రష్యా చైనా సామ్రాజ్యాలే. ఇవి ఒకసారి ఏర్పడ్డాయో, ఆతర్వాత ప్రజలు వాటిని పడగొట్టలేరు. అందుచేత అవిఏర్పడకముందే జాగ్రత్త పడాలి."

"ఫాసిజమును గురించి కూడా ఈ మాటలే విన్నాం"

"బోల్షెవిజం కంటె ఫాసిజం నయం."

"రష్యాలోనూ, చైనాలోనూ ఉన్నది మార్క్సు చెప్పిన కమ్యూనిజం కాదా?"

"గాంధీజం చూసినతర్వాత నాకు మార్క్సిజంలో విశ్వాసం పోయింది. అయినా మార్క్సు చెప్పిన కమ్యూనిజం కొంతవరకు బ్రిటనులోనూ, అంతకన్నా బాగా అమెరికాలోనూ అమలు జరుగుతున్నది"

"ఇంతకూ కొల్లాయి గుడ్డల కార్మికులు సమ్మె చెయ్యాలని వత్తిడిచేస్తే ఏం చేస్తారు?"

"వద్దని సలహా యిస్తాను. కాదు కూడదంటే సమ్మె నడిపిస్తాను."

* * * *

పత్రికా విలేఖరులతో గోష్ఠి కాగానే కార్మిక నాయకుడు కోసం వేచియున్న యాభైవేల రూపాయల కారులో ఎక్కి ఒక కోటీశ్వరుడి ఇంటికి వెళ్ళాడు. అతని మకాం అక్కడ ఏర్పాటు చేయబడింది.

అక్కడికి కార్మిక ప్రతినిధులు వచ్చి అతన్ని చూసి, యజమానులు తమకు బోనస్ సున్నా చుట్టటం గురించీ, తమ ఇక్కట్లను గురించీ చెప్పుకున్నారు. నాయకుడు అంతా విని కళ్ళు తుడుచుకుని డగ్గుత్తికతో "మనం అడుగుదాం. ఎట్లా బోనస్ ఇవ్వరో, ఎందుకివ్వరో చూస్తాం. మీరేం విచారించకండి. మీ హక్కులు కాపాడటానికి నేనున్నాను.

యజమానులకు ఈరోజే కబురు పెడతాను. వాళ్ళు వచ్చి నన్ను కలుసుకుని మాట్లాడిన తర్వాత అన్నీ తేలిపోతాయి" అన్నాడు.

కార్మిక నాయకుడికి ధనిక వర్గాలలో గల పలుకుబడిని కార్మికులు ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నారు. అతను బస చేసిన యిల్లే ఆ సంగతి ఎలుగెత్తి చాటుచున్నది. వాళ్లు వెళ్ళిపోయారు.

ఆ రాత్రి యజమానుల ప్రనిధులిద్దరు కార్మిక నాయకుణ్ణి చూడవచ్చారు. మేడపైన రహస్య సమావేశం జరిగింది.

సాయంకాలం పత్రికలన్నీ కార్మికనాయకుడు చెప్పిన మాటలనూ, ఫోటోనూ ప్రకటించాయి. "కొల్లాయి కార్మికులు సమ్మె చేయరాదు. కార్మిక నాయకుని సలహా" అని ఒక పత్రికా, "బోల్షెవిజం ఫాసిజంకన్న భయంకరమైనది. కార్మిక నాయకుని ఉద్ఘాటన" "గాంధీజం మార్క్సిజంకంటె పవిత్రమైనది. కార్మిక నాయకుని అభిభాషణ" అని ఇంకొక పత్రిక పెద్ద హెడ్ లైన్సుతో వేశాయి.

"సమ్మె మాటేమిటి?" అన్నారు యజమానుల ప్రతినిధులు.

"ఇదుగో పత్రికలకు చెప్పానే, చూడండి. సమ్మె నాకు యిష్టంలేదు" అన్నాడు కార్మిక నాయకుడు.

"ఆం రోజు! నువ్వు కార్మిక నాయకుడివి, నీ ధర్మం సమ్మెలు సాగించటం!" అన్నారు యజమానుల ప్రతినిధులు చిన్నబుచ్చుకున్న మొహాలతో.

"ఆ సంగతి నాకు మీారు చెప్పనక్కర్లేదు. పరిస్థితులు సమ్మెకనుకూలంగా లేవని నా అనుమానం."

"ఎందుకు లేవూ ?"

"కార్మికుల్లో సమ్మె వద్దనేవా ళ్ళున్నారు."

"అరే పాపం, వాళ్లు బోనస్‌లు ముట్టక అలమటిస్తున్నారు!" అన్నారు యజమానుల మనుషులు.

అదీకాక కొల్లాయి కార్మిక యూనియనుకు సమ్మె సాగించే డబ్బులేదు."

"దాని కెంతకావాలి భాగ్యం ?"

"అచ్చగా దానికే అయితే అంత ఫరవాలేదు. నేను ముందు నిలబడ్డానంటే సర్వవ్యాప్త సమ్మెకు తక్కువ జరగటానికి వీల్లేదు. అన్నీ ఆలోచించే సమ్మె మానేశాను. కార్మిక ప్రతినిధులతో ప్రొద్దున ఆ మాటే చెప్పాను."

"అట్లాకాదు. ఈ సమ్మె జరిగేతీరాలి" అన్నారు యజమానుల ప్రతినిధులు.

"ఎందువల్లా ?"

"కొల్లాయి గుడ్డలుబేళ్ళకు బేళ్లు పడి వున్నాయి. దిక్కుమాలిన ప్రభుత్వం మిల్లులు మూయనివ్వదు. కొల్లాయి గుడ్డల ధరలు ఎంత పడాలో అంతా పడిపోయాయి. అంతర్జాతీయ అశాంతిచేత ఎగుమతులు సన్నగిల్లాయి. యజమానులు తమ రక్తం పిండి, కార్మికులకు జీతా లిస్తున్నారు. కార్మికులకు, యజమానులు గార్డియనులని గాంధీజీ చెప్పారు. కాని యజమానులు నానా అగచాట్లూ పడు

తున్నారు. రెండు నెల్లపాటు సమ్మె నడిస్తిందో యజమానులు బ్రతికి బయటపడతారు."

"రెండు నెలలే? కార్మికులెట్లా తట్టుకుంటారు? మళ్ళీ నెల జీతాలు వచ్చే రోజుదాకా తట్టుకుంటారేమో. వాళ్ళ వేడి చల్లారకుండా ఏమిటి చెయ్యటం?"

"అది నీ చేతుల్లో ఉన్నది. నువ్వు బహిరంగ సభలూ అవీ చేయించు. 144 వ సెక్షను పెట్టటానికి ప్రభుత్వం ఉన్నది. పైపని పోలీసులు చూస్తారు."

"సమ్మెవల్ల యజమానులకు లాభమని పత్రికలవాళ్ళు బయటపెడితే?"

"పత్రికలను మేం చూసుకుంటాం."

"సమ్మె ఖర్చులు?"

చెక్ పుస్తకం బయటికొచ్చింది. అయిదంకెల మొత్తం పడింది. కార్మిక నాయకుడు నిర్లక్ష్యంగా చెక్కు మడిచి జేబులో పెట్టుకుంటూ పార్టీ నిధికి?" అన్నాడు. ఇంకొక చెక్కు చేతులు మారింది.

"నా సొంత ఖర్చులకు?"

నోట్లకట్ట ఒకటి చేతులుమారింది.

యజమానుల మనుషుల మొహాలు వికసించాయి. వాళ్లు కార్మిక నాయకుణ్ని అభినందించి, ఆతని దేశభక్తిని కొనియాడి, శలవు పుచ్చుకున్నారు.

కొల్లాయి కార్మికుల యూనియన్ భవనంలో సభ జరిగింది. ప్రధాన కార్మిక ప్రతినిధులు ముగ్గురే ఉన్నారు.

కార్మిక నాయకుడు సభ చెప్పాడు.

యజమానుల మనుష్యులతో మాట్లాడాను. వాళ్లు నయాన బోనస్ ఇవ్వరు. సేట్ మకీచూస్ అంటే నాకు ఆతిథ్య మిస్తున్న దేశభక్తుడు - కూడా చెప్పి చూశాడు. కార్మికులు సమ్మెచేసే స్థితిలో లేరనీ, వాళ్లకు సమ్మె సాగించే దీక్షా, ఐకమత్యమూ లేవనీ యజమానులు బహిరంగంగా అంటున్నారు. కార్మికుల తడాఖా యజమానులకు చూపవలసిన సమయం వచ్చిందని నా అనుమానం. అయినా సమ్మె నిర్ణయం చేయవలసినవారు మీరు. మీ నిర్ణయాన్ని నేను అమలు జరపగలవాణ్ణి మాత్రమే."

కార్మిక ప్రతినిధు లన్నారు :

"యజమానులు బోనస్ ఎగగొట్టే పక్షాన సమ్మె జరగవలసిందే."

"ముందే చెబుతున్నాను. నేను సమ్మె నడిపితే అది సమగ్రంగా చివరల్లా జరగాలి. కార్మికులలో ఐకమత్యం ఉండేటట్టు చూసే బాధ్యత మీది. వారు కష్టాలకూ, పోలీసుల దెబ్బలకూ తట్టుకునేటట్లు చూసేబాధ్యతకూడా మీదే. ఇది చాలా పెద్ద విషయం. కార్మిక ప్రతిఘటన చరిత్రలో శిలాక్షరాలతో లిఖించబడే సమ్మె. కనీసం మూడు నెలలైనా సమ్మె జరపటానికి మీరు సిద్ధంగా ఉండాలి మరి."

కార్మిక ప్రతినిధులకు వేడెక్కింది. వాళ్ళడిగారు.—

"మా యూనియనులు సిద్ధమే. మీ నాయకత్వంకింద ఉన్న ఇతర యూనియనులు సానుభూతి సమ్మెలు జరిపేలా చూస్తారా ?"

"అదంతా నాకు వదలండి."

"కొల్లాయి కార్మికులలో కొందరు మన విరోధుల నాయకత్వంకింద వున్నారు. వాళ్ళు సమ్మెలో చేరక సమ్మె భగ్నం చేస్తారేమో?"

"వాళ్ళెంతమందిలే, మనం సర్వవ్యాప్త సమ్మె ప్రారంభించగానే వాళ్ళు తప్పక సమ్మె చేస్తారు. సందేహం లేదు."

కార్మికుల జీతాలు ముట్టిన మర్నాడే సమ్మె ప్రారంభమైంది. మర్నాటికల్లా సమ్మెలో చేరినవారి సంఖ్య మూడింతలయింది. సమ్మె జరిగిన నాలుగోరోజు కొల్లాయిగుడ్డల మిల్లులన్నీ దాదాపు మూలబడ్డాయి. నగరమంతటా సానుభూతి సమ్మెలు జరిగాయి. పత్రికలు సమ్మెకు ప్రాముఖ్యం ఇచ్చాయి. సమ్మెవల్ల రోజుకు ఎన్నివందల కొల్లాయి గుడ్డల ఉత్పత్తి నిలిచి పోతున్నదీ, ఫ్యాక్టరీలకు రోజూ ఎన్ని వేలు నష్టం వస్తున్నదీ అంచనా లివ్వబడ్డాయి.

నగరంలో 144 వ సెక్షను అమలు జరిగింది. కార్మిక నాయకుడు బ్రహ్మాండమైన ఊరేగింపులూ, బహిరంగ సభలూ జరిపాడు. కార్మికులు ప్రశాంతంగా ఉన్నంతవరకూ 144 వ సెక్షను నిద్రపోయింది. కార్మిక నాయకుణ్ణి ఎవరూ అరెస్టు చేయలేదు.

రానురాను కార్మికులకు వేడెక్కింది. కొందరు ఊరేగింపులతోబాటు విధ్వంసక చర్యలు ప్రారంభించారు.

సమ్మె ప్రారంభమై ఇరవైరోజులై, పత్రికల్లో ప్రకటిస్తున్నంత నష్టం వస్తునప్పటికీ, యజమానులు రాజీ బేరాలకు ఎందుకు రాలేదో కార్మిక ప్రతినిధులకు అర్థంకాలేదు.

కార్మికులు విధ్వంసక చర్యలు చేస్తున్నారని ప్రభుత్వం పోలీసులను ప్రయోగించారు. పోలీసులు తుపాకులు పేల్చారు. తుపాకులు కార్మికులను పేల్చాయి. కొందరు కార్మికులు చచ్చారు.

"సమ్మెకు కొత్త బలం వచ్చింది" అన్నాడు కార్మిక నాయకుడు.

* * * *

యజమానుల పరిస్థితి చక్కబడింది. సమ్మె మూలంగా కార్మికుల కివ్వవలసిన జీతాలు అనేక లక్షలు ఆదా అయింది. నిలవవున్న సరుకు మంచి ధరలకు చేయి వదిలింది.

సేట్ మకీ చూస్ భవనంలో కార్మిక ప్రతినిధులూ, యజమానుల ప్రతినిధులూ కూడా కార్మిక నాయకుణ్ణి కలుసుకున్నారు.

"ఎందుకొచ్చిన సమ్మె? ఇప్పటికైనా కార్మికులు పనిలోకి వస్తే తీసుకుంటాం. పరిష్కార సంఘంవాళ్ళు సిఫార్సు చేసిన బోనసు ఇవ్వలేం. ఇస్తామన్న నెల రోజుల జీతం ఎట్లాగూ ఇస్తాం. ఎవరిమీదా ఎట్టిచర్యా తీసుకోం. చచ్చిన కార్మికుల్ని బ్రతికించలేంగాని, అరెస్టయిన కార్మి

కుల్ని విడిపించమని ప్రభుత్వాన్ని వేడుకుంటాం" అన్నారు యజమానుల ప్రతినిధులు.

"సమ్మె చేసిన రోజుల్లో మా జీతాలమాటేమిటి ?" అన్నారు కార్మిక ప్రతినిధులు.

"అది మా వల్లకాదు."

కార్మిక ప్రతినిధులు కార్మిక నాయకుడివంక చూశారు.

ప్రస్తుత అంతర్జాతీయ దుస్థితినిబట్టి సమ్మె ఆపటం మంచిదని నాకు గాంధీజం చెబుతోంది. కార్మికులు నష్టపడ్డారు. నే నెరుగుదును. కాని యజమానులకు అంతులేని నష్టం కలిగింది. సమ్మె విజయవంత మయింది. కార్మిక నాయకులు రాజీకి వస్తున్నారు. కార్మికులు నైతిక విజయంతో తృప్తి చెందటం ధర్మం. లొంగినవాళ్ళను కుంగదీయటం అహింసా విధానం కాదు.

కార్మిక ప్రతినిధులు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. తమ నాయకుడి సలహా శిరసావహించారు.

"సరి అయిన తరుణంలో కార్మికులకు సరిఅయిన సలహా" ఇచ్చినందుకు పత్రికలు కార్మిక నాయకుణ్ణి ప్రశంసించాయి.

తరువాత రెండు మూడు రోజులకు కార్మిక నాయకుడు మరో నగరం వెళ్ళినట్టు పత్రికల్లో పడింది. కాని ఆయనకు స్టేషనువద్ద కార్మికులు వీడ్కోలిచ్చినట్టు పడలేదు.

# కొత్త జీవితం

అది ఫాక్టరీ కూలీలకోసం పెట్టిన హోటలు. అక్కడ అర్ధణాకు "చా" దొరుకుతుంది అణా పెడితే కాసిని "భజ్యా" తిని "చా" తాగవచ్చు. సాహసించి ఇంకో అర్ధణా ఖర్చుపెట్టదలచినవాడు "పావ్-ఉసల్"తో పొట్ట నింపుకుని, "చా" తాగిపోవచ్చు. "భజ్యా" అంటే శనగ పిండితో చేసిన పకోడీలు. "పావ్" అంటే నాలుగౌన్సుల రొట్టె. "ఉసల్" అంటే శనగలుగాని, అల్చందలుగాని వేసి నీటితో మరగబెట్టిన కూర. అందులో రొట్టె ముంచుకు తినవచ్చు.

ఉదయం ఏడున్నరకల్లా ఫ్యాక్టరీపనివాళ్లు ఒక్కొక్కరే వచ్చి కూచుని హిందీలోనూ, మహారాష్ట్రంలోనూ తమకు కావలసిన ఆహారపదార్థాలు అతి తొందరగా ఆర్డరివ్వ సాగారు. పదార్థాలందించే వాడేకాక, గల్లాదగర కూర్చున్న వాడుకూడా, "ఏక్ గ్లాస్ పానీ దే' ఏక్ లెమన్ దో!" అని కేకలు పెడుతూ, తినేవాళ్ళ అవసరాలు కనుక్కుంటున్నాడు.

ఈ హోటల్లోకి ఒక కుర్రాడు వచ్చాడు. అందరి

కళ్ళు వాడు తొడుక్కున్న కొత్తచొక్కామీద, కొత్త ధోవతిమీద పడ్డాయి. కాని వాడి పల్లెటూరి మొహం తెలిసిపోతూనే ఉంది. కుర్రాణ్ణి ఒక గుండ్రని బల్లదగ్గర కూర్చోబెట్టి వస్తువులందించేవాడు, "కాయ్ పాహిజే మలా?" అని అడిగాడు.

కుర్రాడికి ప్రశ్న అర్థమయిందిగాని వాడు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. వాడి మొహానికి అడుగున్నర దూరంలో పెద్ద గాజుజాడీనిండా తెల్లటి మజ్జిగపోసి పెట్టి వుంది. బల్లమీద పరచిన చలవరాతి పలకలూ, నేలమీద పరచిన నున్నటి కృత్రిమ చలవరాతి పలకలూ వాడికి అత్యాశ్చర్యం కలిగించాయి. ఈ హోటలుకు జమీందార్లు కూడా వస్తారని వాడికి దృఢవిశ్వాసం కలిగింది. బల్లలదగ్గర కూర్చున్న వాళ్ళల్లో జమీందార్లెవరన్నా వున్నారేమో చూతామంటే మజ్జిగ జాడీమూలంగా సాధ్యపడలేదు.

"ఏం కావాలి?" అని మళ్లీ అడిగాడు వస్తువు లందించేవాడు.

"ఏమున్నయ్?" అన్నాడు కుర్రాడు. హోటలు వాడు అన్నీ ఏకరువుపెట్టాడు. "పూరీ, శిరా, బటాటా, పావ్, ఉసల్, భజ్యా, చా, లెమన్, తాక్, షర్బత్...."

కుర్రాడు జాగ్రత్తగలవాడు. అన్నిటి ధరలూ కనుక్కుని రెండణాలన్నర దాటకుండా ఆర్డరిచ్చాడు.

హోటలునుంచి ఫాక్టరీకి ఎంతో దూరంలేదు. కొండ పక్కగా వెళ్ళే అందమైన రోడ్డు నేరుగా ఫ్యాక్టరీల దగ్గరికి తీసుకుపోతుంది. రోడ్డుపక్క ఎడసగా ఇరవై ఇళ్లున్నాయి.

కొత్తగా కట్టినవి, చాలా అందమైనవి. వాటినిదాటి ఒక ఫర్లాంగు పోతే రెండు ఫాక్టరీలు ఒకదాన్నానుకుని మరొకటి వున్నాయి. ఒక అరఫర్లాంగు అవతల మూడో ఫ్యాక్టరీ వుంది. ఆ రోడ్డువెంబడి వచ్చాడు కుర్రాడు. వాడి కేదన్నా కూలిపని కావాలి.

మొదటి ఫ్యాక్టరీ నిర్జీవంగా కనిపించింది. రెండో ఫ్యాక్టరీ గేటుకెదురుగా రోడ్డు ఆవలివేపున నలుగురైదుగురు మనుషులు నిలబడి వున్నారు. వాళ్లూ పనికోసమే నిలబడి వున్నారని మన కుర్రాడికి తెలీదు. వాడు గేటుదగ్గర నిలబడి వున్న పఠానువాణ్ణి గమనించకుండా గేటుదగ్గరకి పోయి లోపలికి తొంగిచూశాడు. లోపల చాలా అందంగావున్నది. ఒక పక్కగా చిన్న కంచెమీద అందమైన లత ఒకటి పాకుతున్నది. దాని వెనక కొన్ని తొట్ల మొక్కలు చక్కగా పెట్టారు. ఫ్యాక్టరీ చాలా లోపలిగా వున్నది.

"పనిచేస్తే ఇటువంటి ఫాక్టరీలో పనిచెయ్యాలి" అనుకున్నాడు వాడు. పెట్టి పుట్టిన పనివాళ్ళు అటువంటిచోట పనికి కుదురుతా రనుకున్నాడు.

ఇంతలో – పఠాన్ గొంతు వినిపించింది.

"ఏయ్, ఏంకావాలి ?"

కుర్రాడికి హిందీ ఏమీ రాదు. కాని ప్రశ్న అర్థమయింది.

"పని" అన్నాడు వాడు.

"పోయి వాళ్ళదగ్గర నిలబడు... అదుగో యజమాని కారు. వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు."

కంగారుతో కుర్రాడు రోడ్డుదాటి అవతలపడ్డాడు. వాడవతలికి వెళ్ళిన తక్షణంలోనే నల్లని కారొకటి అతి వేగంగా వచ్చి గేటులోకి తిరిగి లోపలికి వెళ్ళిపోయింది.

ఆ కారులోవున్న "మాలిక్" తనను గేటుదగ్గరచూసి కోపం తెచ్చుకున్నారేమో. తనకు పని యివ్వడేమోనని కుర్రాడికి బాధ కలిగింది. ఆ నల్లకారుకింద పడ్డా వాడికంత బాధ కలిగివుండదు.

## 2

ఫాక్టరీలముందు నిత్యమూ పనికోసం నుంచునే వాళ్ళను చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఆ ఫాక్టరీలలో ఏం చేస్తారో వారికి అవసరం లేదు. అది వనస్పతి ఫాక్టరీగానీ, లోహపు ఫాక్టరీగానీ, బట్టల మిల్లుగానీ వాళ్ళకు ఒకటే. చదువు వెంటపెట్టుకు పొయ్యేవాడికి ఉద్యోగం దొరకదగిన స్థలాలూ, దొరకదగని స్థలాలు అంటూ వుంటాయి. వాడు తనవెంట ఏదో తెచ్చుకుంటాడు. పారిశ్రామిక కూలీ తన కండలూ, ఎముకలూ తప్ప యింకేమీ తీసుకురాడు. గొట్టంలోంచి పొగవచ్చే ఏచోటైనా వాడికి పోదగిన చోటే. ఏ చోటు అచ్చివచ్చేదీ, ఏది అచ్చిరానిదీ దైవాధీనం. ఒక ఫాక్టరీలో నాలుగు రోజులే వుండవచ్చు. మరో ఫాక్టరీలో నాలుగు నెల లుండవచ్చు కాని కాల క్రమాన ఏదీ అచ్చిరాని చోటే. ఎందుచేతనంటే నాలుగేళ్ళు ఏ ఫాకరీలోనూ వుండడు. ఆ తరువాత మళ్ళీ జీవితం ఎప్పటి

చోటికి రావటమంటే పనివాడు తన కండలన్నీ వున్నవి వున్నట్టు వెనక్కి తెచ్చుకుంటాడనికాదు. అది ఎన్నటికీ జరగదు. అంతో యింతో రక్తమూ, కండలూ ఫాక్టరీకి ముట్టవలసిందే. ఫాక్టరీలనుంచి బయటికివచ్చే సమయానికి పొరపాటున నాలుగు డబ్బులు జేబులో మిగిలినా అవి పూర్తిగా అయిపోతేగాని మళ్లీ యింకోచోట పని కుదరదు. ఒక్కొక్కసారి డబ్బు లయిపోయినాక కూడా చాలాకాలం పని కుదరదు. ఇది కూలివాళ్ళకు అమ్మవారి శాపం. సులభంగా పని దొరికే యుద్ధకాలంలోనే ఈ విధంగా వుంటే యితర సమయాల సంగతి వేరే చెప్పాలా ?

ఆ ఫాక్టరీ బయట పనికోసం నిలబడ్డవారిలో ఒకరిద్దరు చాలారోజులనుంచీ పని దొరకనివా రున్నారు. ఫాక్టరీ ప్రారంభమైన అరగంటలోగా పని దొరికేదీ లేనిదీ తెలిసిపోతుంది. ఆ తరవాత యింకోచోటికి వెళ్ళి లాభంవుండదు. అంతా లాటరీ.

ఈ లాటరీలో మన కుర్రాడి అదృష్టం బాగున్నది. యజమాని కారు లోపలికి వెళ్ళిన కొద్దిసేపట్లో లోపలినుంచి ఎవరో వచ్చి నిలబడి వున్నవాళ్ళకేసి ఒక్కసారి చూసి "తుమ్ ఆవ్, తుమ్ ఆవ్" అని మన కుర్రవాణ్ణి, మరొక యువకుణ్ణీ లోపలికి పిలుచుకు వెళ్లాడు. ఇది బొత్తిగా లాటరీ అనటానికి కూడా వీలులేదు. ఇది ఫాక్టరీ స్వయంవరం ఇందులో కండపుష్టీ,యవ్వనమూ చప్పున ఆకర్షిస్తాయి. లోపలికి పోయిన తరవాత ఆ మనిషి మన కుర్రవాడివంక

తిరిగి చాలా తొందర పనిమీదవున్న వాడల్లే మాట్లాడుతూ, "నీ పేరేమిటి?" అన్నాడు.

"విఠల్ పాండురంగ్"

"ఎప్పుడన్నా ఫ్యాక్టరీ పనిచేశా?"

"లేదు."

"రోజుకు మూడు పావలాలు మజూరీ, మూడు పావలాలు మాంగాయీ. ఈ ఖాతాలో పనిచెయ్యి.

తనకు నిజంగా యెంతో గొప్ప గౌరవం జరిగినట్టు భావించుకున్నాడు విఠల్. రోజుకు రూపాయిన్నర చొప్పున నెలకు? కనీసం 25 రోజులు పనిచేసినా ముప్పైఏడున్నర అయింది! ఏడాదికి? 450 రూపాయలు! తమఊళ్లో ఆడా, మగా, పిల్లా, మేకా కలిసి ఏడాది పొడుగునా, వాళ్లునిరుచుకున్నా పొలంపనిలో అంతగాదే! ఎంత అదృష్టం!...అదీ కాక ఎటువంటిపని! ఎంత తెలివైన పని! ఎంత శుభ్రమైన చోటు! మట్టిలేదు. బురదలేదు. ఫ్యాక్టరీ వొదిలిన మరుక్షణం చీకూ చింతా లేదు. రోజుకు ఎనిమిదిగంటలు! తమ పల్లెటూళ్ళో పనికి అంతూ పొంతూ వుందా? ఎంతచేసినా తరగదు. ఈ పట్టణంలో ఎన్ని బస్సులు, ఎన్ని ట్రాములు, ఎన్ని సినిమాలు! ఎంత బస్తీ!......

ఒక మూల ఆవరణలోనే ఒక లారీ నిలబడి వున్నది. ఆ లారీనిండా లోహపు అచ్చులున్నాయి. నలుగురు పనివాళ్ళు లారీలోకి ఎక్కి ఆ అచ్చులను కిందవున్న కూలీలకు

అందిస్తున్నారు. కిందవున్న పనివాళ్ళు వాటిని లోపలికి తీసుకుపోయి పేరుస్తున్నారు. అవి రాగిదిమ్మలు. ఎర్రగా వున్నాయి. లోపలికి చేరవెయ్యమని విఠల్‌ను నియోగించారు. ప్రతి కూలివాడూ ఒకొక్క చేత్తో ఒకొక్క దిమ్మ పట్టుకుని వగర్చుకుంటూ పోతున్నాడు. రెండు మూడుసార్లు విఠల్ కూడా రెండేసి చొప్పునే పట్టుకు పోయినాడు, కాని ఆ దిమ్మలను రెండుచేతులకూ అడ్డంగా పెట్టేవాళ్ళుంటే మూడేసికూడా మొయ్యవచ్చు ననిపించింది. ఈసారి లారీదగ్గరికి వచ్చినప్పుడు విఠల్ చేతులు రెండూ ముందుకు పెట్టి వాటిమీద దిమ్మలు పెట్టమని లారీలో నిలబడ్డ కూలీకి సూచించాడు.

"చాల్లే, గొప్ప పనివాడివి! అందుకో" అన్నాడు లారీలోవాడు.

"మూడేసి పట్టుకుపోతా" అన్నాడు విఠల్.

"అందరూ చేసినట్టు చెయ్యిఅన్నాడు లారీలోవాడు. తానే విఠల్ యజమానిలాగా, విఠల్ నిరుత్సాహ పడ్డాడు.

## 3

విఠల్ పనిలో ప్రవేశించి నాలుగురోజు లయింది. అప్పటికి వాడికి ఫ్యాక్టరీ కొత్త తీరింది. మనుష్యుల కొత్తా తీరింది. కాని ఫ్యాక్టరీ పనిమైనం వాడి కర్థంకాలేదు. ఇది మనిషి చెయ్యగల పనేగాని మనుషులు చేసినట్లు చేసేపని కాదు. ఈ పని ఎవరో తరుముకొస్తున్నట్టుగా చెయ్యాలిసిన

పని. పాటలు పాడుతూ, మాట్లాడుతూ చేసేపనికాదు. ఇష్టమై చేస్తున్నట్టుగా చేసేపని కాదు. అందుచేతగావాలు ఈ ఫ్యాక్టరీ కూలీలు తాము చేసిన పనిమీద ఏదో పగ వున్నట్టు చేస్తారుగాని ఆప్యాయంగా చెయ్యరు. చేసే పని గురించి మాట్లాడరు. మాట్లాడినా గునుస్తూ మాట్లాడతారు.

మిగిలిన పనివాళ్ళు మొట్టమొదటిరోజు తనను చాలా వేళాకోళం పట్టించారు. మొదటికారణం తన దుస్తులు.

"నీవు కూలీవా, ముకద్దమువా?" అని అడిగారు వాళ్ళు నవ్వుతూ. ఒక పెద్దవాడు "రేపణ్ణుంచి పనిచేసేగుడ్డలు వేరే తెచ్చుకో — ఇక్కడ నిజంగా పనివుంటుంది" అన్నాడు చాలా మంచిగా. నిజానికి వాళ్ళందరూ కుళ్ళుగుడ్డలే వేసుకున్నారు. వాళ్ళేకాదు, "సాబ్"లుకూడా కుళ్ళుగుడ్డలే వేసుకున్నారు.

మిగిలిన పనివాళ్ళు ఏ తరగతినుంచి వచ్చిందీ విఠల్ గ్రహించలేక పోయినాడు. కాని వాళ్ళెవ్వరికీ తనకున్న హోదా ఇంటిదగర లేదేమో అనిపించింది. ఇంటిదగ్గర తనవాళ్లు గౌరవ కుటుంబీకులు. కాకపోతే కొద్ది పొలంమీద చాలామంది పడి తినటంచేత కొంత అప్పయింది. తన ఉత్సాహంకొద్దీ తాను పట్నం వచ్చాడుగాని తన నెవరూ పొమ్మనలేదు. ఏరోజు తన కిష్టం లేకపోతే ఆరోజు తాసీ పని మానేసి ఇంటికి పోతాడు. కాని పాపం, వీళ్ళ గతేమిటి? వీళ్ళలో చాలామంది ఎన్నో ఏళ్లుగా ఈ చాకిరీ చేస్తున్నారు. ఈపని లేకపోతే వీళ్ళు వీధిలో నిలబడి అడుక్కు తినాలి.

మచ్చకు "భయ్యా" ఉన్నాడు. వాడు వెయ్యిమైళ్ళ దూరంనుంచి వచ్చి ఇక్కడ పడ్డాడు. వాడు వేలిముద్రగాడు. చదువు రాకపోవడమేగాక వొట్టి మట్టిబుర్ర. అందరూ ఏడిపిస్తారు. బండపని వాడికి చెబుతారు. వాడికి అలుసంటే ఏంటో తెలీదు. వాడు వచ్చి ఎన్నోరోజులు కాలేదు. పనిలో చేరింది లగాయతు వాడు అర్ధణాపెట్టి టీ తాగిన పాపాన పోలేదు. ఇన్నాళ్ళూ వాడు తిండికూడ తినటం లేదుట. తన గదిలో – ఇంకా ఆరుగురుకూడా ఆ గదిలోనే ఉంటున్నారు–వాడు శనగలు నానేసుకుని అవే తింటున్నాట్ట. వెధవకు తెగులు పుట్టుకొచ్చి, మొహమంతా ఉబ్బింది. కళ్ళవెంట పుసులు కారసాగాయి.

"నీకేం బుద్ధిలేదా? శనగలుతింటే చచ్చిపోతావు. నీకు పెళ్ళామూ, పిల్లలా? సంపాదించిందంతా హాయిగా తినలేవూ? రాయంటి వొళ్ళు మట్టిచేసుకుంటావు. జాగ్రత్త" అని "చాచా" వాణ్ణి గట్టిగా కోప్పడ్డాడు.

"చాచా" పఠాన్. పేరు రహమాన్. అందరూ "చాచా" అని పిలుస్తారు. వయస్సు 62. 1914 యుద్ధంలో యుద్ధరంగాన రైళ్ళు నడిపాడు. ఇప్పటికీ పుష్టిగా, బలంగా ఉన్నాడు. ఒకనాడు "చాచా" విఠల్‌కు తనకథ చెప్పాడు. యుద్ధంనుంచి తిరిగి వెళ్ళిన తరవాత "చాచా" తాను మిగుల్చుకున్నడబ్బుతో సరిహద్దున కొంతపొలం కొన్నాడు. పత్రాలూ, సాక్ష్యాలూ లేవు. అక్కడివాళ్ళకి కచేరీలలో నమ్మకం లేదల్లే ఉంది. పొలం అమ్మినవాడు ఏదో పేచీపెట్టి "చాచా"ను పొలంమీదినుంచి పంపించాలని చూశాడు.

"పొలంలోకి అడుగుపెడితే చంపుతా" అన్నాడు "చా చా". పొలం అమ్మినవాడి మనిషి వచ్చి "చా చా" చెయ్యి పట్టుకుని, "ఒకసారి అవతలికి రా. ఒక్కమాట వినిపోదూగాని" అన్నాడు.

"చెయ్యి వదులు" అన్నాడు "చా చా."

వాడు వదల్లేదు. రెండో చేతిలో ఉన్న కర్రతో "చా చా" వాడి మనికట్టుకు ఎగువగా ఒక్కటే దెబ్బ పెట్టాడు. వాడి చెయ్యి విరిగింది. "చా చా"ను మూడేళ్ళు ఖైదులో ఉంచారు.

ఖైదులోనుంచి వస్తూనే "చా చా" కొత్త ఉద్యోగం చూసుకున్నాడు—"డాకూ" ఉద్యోగం.

"డాకూ అంటే దొంగకాదు" అన్నాడు "చా చా" గర్వంగా, అదొక ఉద్యోగం. చాలా కష్టమైన ఉద్యోగం. నీ భార్యాబిడ్డల్ని నువ్వు రహస్యంగా పోయి చూడాలిసిందే గాని, వాళ్ళకు నువ్వుండే చోటు చెప్పటానికి వీల్లేదు."

"డాకూలు ఎక్కడుంటారు ?"

"ఎక్కడుంటారు ? ఎవరికీ తెలీకుండా ఏ కొండల్లోనో, అడవుల్లోనో ఉండాలి."

"ఎవరూ చూడరారూ ?"

"రావచ్చు. కాని నాకు అంత దూరంలో నిలబడాలి

సిందే. నా సరసన నిలబడటానికి వీల్లేదు—తమ్ముడవేది తండ్రి అయేది.”

“ఏమల్లా ?”

“డాకూ ఎవర్నీ నమ్మడు. డాకూను పట్టిస్తే సర్కారు డబ్బిస్తుంది. దగ్గరవాళ్ళే కక్కుర్తి పడవచ్చు. అందుచేత, ఎదురుగా నిలబడు ! అంతే ! పక్కకి రాకు ! భుజంమీద చెయ్యి వేశావా ?—”

“చా చా” తన భుజంమీద ఎవరో వేసిన చేతిని ఒక్కసారిగా తోసేసి వాడిమీద తుపాకీబారు చేసినట్టు అభినయించాడు. ఒక్క క్షణంపాటు “చా చా” కళ్ళల్లో డాకూచూపు కనిపించినట్టే తోచింది విఠల్‌కు.

## 4

అవకాశం దొరికినప్పుడల్లా విఠల్ లెఖ్ఖవేస్తుండేవాడు. తాను నెలకు హీనంగా పది రూపాయలు మిగల్చవచ్చు. కొంచెం కష్టపడితే పదమూడు, పధ్నాలుగు కూడా మిగల్చ వచ్చు. ఇంటిదగ్గర రొండొందలయాభై బాకీ ఉంది. మిగిలిన డబ్బంతా ఇంటికి పంపివేస్తే రెండేళ్ళలో బాకీ తీరిపోతుంది.

మొదటినెల పన్నెండు రూపాయ లింటికి పంపించి నప్పుడు విఠల్ ఆనందానికి మేరలేదు. తనగురించి తన తల్లీ, అన్నలూ ఎంత సంతోషిస్తారో వాడు ఊహించుకున్నాడు. ఆ మనియార్డరుతోబాటే తానుకూడా వెళ్ళి మొహాలు

చూడాలనిపించింది. ఇల్లూ, గొడ్లూ, పొలమూ జ్ఞాపకం రాగానే కడుపులో ఏదో ఆవేదనకలిగింది. కాని అభిమానం అడ్డొచ్చింది. అప్పు తీర్చిగాని ఇంటికి తిరిగిపోరాదు. కనీసం సగం అప్పన్నా, అధమం యాభై రూపాయలన్నా చెల్లు వేసి మరీ వెళ్ళాలి. ఏంలేదు. తనకు శలవెవరిస్తారు? ఒకవేళ ఇచ్చినా ఇంటికి వెళ్ళిరావాలంటే ఒకనెల మిగిల్చే దంతా ఖర్చన్నమాటే. నెలల్లాచేసిన శ్రమంతా వృథా!

రెండోనెలగడిచింది. మూడోనెలా నాలుగోనెలాకూడా గడిచాయి. యిప్పుడు విఠల్‌కు ఒంట్లోవున్న జవసత్వాలు లేవు. ఆ "చా" దుకాణంలో తినేది తనకు పడటంలేదు. ఒక్కసారి యింటితిండి తినటానికైనా వెళ్ళిరావా లనిపించింది. కాని ఎట్లా? మొదట్లో ఫాక్టరీనుంచి ఇంటికి వెళ్ళే టప్పుడే నీరసంగా ఉండేదిగాని, తెల్లవారి నిద్ర లేచిన తరవాత ఉత్సాహంగానే ఉండేది. యిప్పుడిప్పుడు వాడికి నిద్రవల్ల శరీరం బడలిక తీరటంలేదు.

"వెధవతిండి, వెధవపని, వెధవబతుకు!" అనుకునే వాడు విఠల్. తిండికన్నా, పనికన్నా ఈ బతుకే వింతగా ఉండేది వాడికి. తాను యిక్కడ ఎట్లా బతుకుతున్నదీ చెబితే యింటిదగ్గర ఎవరూ నమ్మరు. ఈ జీవితం శుద్ధ అబద్ధమనీ, ఇట్లా జీవిస్తూ తాను మారువేషం వేస్తున్నారనీ విఠల్ భావించాడు. ఆ శాకీ తీరిన మరుక్షణం తాను ఫాక్టరీకి చిన్న సలాంకొట్టి యింటికి తిరిగిపోతాడని తనతోటి

పనివాళ్ళెరగరు. తాను ఇక్కడ ఏ విధంగా జీవిస్తున్నదీ యింటిదగ్గర తనవాళ్ళకు తెలీదు.

యిప్పటికి తాను 30 రూపాయల బాకీ తీర్చేశాడు. యిక ఇంటికి పోతేనేం ? ఆ బాకీ అంతా తీర్చాలని తనలో తాను శపథం చేసుకున్నాడేగాని ఎవరూ తనచేత చేయించ లేదు. అదంతా తాను తీర్చెయ్యవలసిన అగత్యం కూడా లేదు. కాని ఇంటికి పోదామని నిశ్చయం చేసుకున్నప్పుడల్లా విఠల్ అంతరాత్మ "నువు మనిషివికావా ? అని అడిగేది.

విఠల్ ఈ సందిగ్ధంలో ఉండగా సమ్మె వచ్చింది. ఆరోజుల్లో సమ్మెలు చీటికీ మాటికీ జరగటంలేదు. యిది కార్మిక నాయకత్వంతో కూడిన అధికార సమ్మె కూడా కాదు. డిసూజా అను ఫోర్మనుకూ ఒక పనివాడికీ కొద్ది రోజులుగా ముసుగులో గుద్దులాట జరుగుతూ అది ఒకనాడు "నువ్వెంతే నువ్వు" అనుకునేదాకా వచ్చింది. ఫాక్టరీ యజమాని డిసూజా పక్షమై ఆ పనివాణ్ణి తొలగించాడు—నోటీసైనా లేకుండా. అప్పటి కప్పుడు పనివాళ్ళంతా సమ్మె నిర్ణయించారు. ఎక్కడివాళ్ళక్కడ పని వదిలేసి ఆవరణలోకి వచ్చారు. అందరూ తలా ఒక్కమాటా మాట్లాడుతున్నారు. యిద్దరేసి, ముగ్గురేసి, నలుగురేసి ముఠాలుగాచేరి, అవుననీ కాదని ఘర్షణ పడసాగారు.

ఫాక్టరీ మేనేజరు బయటికివచ్చి, "ఒక్క నిమిషంలో లోపలికివచ్చి పని చెయ్యనివాళ్ళందర్నీ బయటికి పంపించేస్తాను" అన్నాడు. కొంతమంది లోపలికి వెళ్ళారు. విఠల్

కూడా వాళ్ళతోబాటు లోపలికి వెళ్ళాడు. మిగిలినవాళ్ళను బయటికి పొమ్మన్నాడు.

తీరా లోపలికివచ్చినతరువాత విఠల్ ఆశ్చర్యపడ్డాడు. లోపలికి వచ్చినవాళ్ళు యిరవైమంది కూడా లేరు. దాదాపు యాభైమంది వెళ్ళిపోయారు. అందరూ లోపలికి వస్తారను కున్నాడు విఠల్. "సాబ్" మాటకు కూలీలు ఎదురుచెప్పట మంటూ ఉండదని విఠల్‌కు సందేహంకూడా కలగలేదు. ఈ సంగతి ముందు తెలిస్తే తానుకూడా బయటికే వెళ్లేవా ణ్ణనుకున్నాడు విఠల్.

రెండు గంటలపాటు ఫాక్టరీలో ఏ పనీ లేదు. ఫాక్టరీ కేదో పెద్ద సుస్తీ చేసినట్లయింది. లోపల్నుంచి బయటికీ, బయటినుంచి లోపలికీ ఏం రాయబారాలు జరిగాయో విఠల్ ఎరగడు. రెండు గంటలు దాటిన తగవాత ఫాక్టరీ బయట పెద్ద పెడబొబ్బ వినిపించింది. బయటికి పోయినవా ళ్లంతా పరిగెత్తుకుంటూ లోపలికి వచ్చారు. "జీత్ గయా, సాలా!" అనే ముక్కే ప్రతి నోటా వినిపించింది. పనివా ళ్ళలో అంత ఉత్సాహం విఠల్ ఎన్నడూ చూడలేదు... సమ్మె అయిపోయింది తీసిన మనిషిని మళ్లీ పనిలోకి రానిచ్చారు...

ఒక మహారాష్ట్రి పనివాడు నేరుగా విఠల్ దగ్గరకు వచ్చి ఎందుకో చెప్పకుండా మహాష్ట్రి భాషలో తిట్టిపొయ్య సాగాడు. నాకేమీ తెలియదుబాబో, అని విఠల్ ఎంత చెప్పినా వాడి ధోరణి ఆగలేదు. అందరూ సమ్మెచేస్తే తాను చెయ్యనందుకు యజమాని తనకు మెచ్చి మేకతోలు

కప్పకపోయినా, పనివాళ్ళకు చాలా కోపం తెప్పించినట్లు విఠల్ గ్రహించేడు. ఇదొక పీడగా తోచింది వాడికి. వీళ్ళంతా ఎందుకు పనిమానాలో విఠల్‌కు నిజంగా అర్థం కాలేదు. కాని పైకి ఆమాట అనలేదు. ఫాక్టరీ పనిలో పనివాళ్ల జులుం ఒకటి విధిగా ఉంటుందని మాత్రం వాడు గ్రహించాడు.

యింకో రెండు నెల్లు గడిచింది. విఠల్ తల్లికి సుస్తీగా ఉందని ఉత్తరం వచ్చింది. అసలే పెద్దది. విఠల్ ఆఖరుబిడ్డ. వాడికి తల్లిని చూస్తే పంచప్రాణాలు.

"చా చా, మా అమ్మకు జబ్బుగావుంది. నేను వెళ్ళాలి. ఎట్లా?" అన్నాడు విఠల్.

"శలవు పెట్టిపో, ఫోర్మన్‌తో చెప్పు. జీతంమట్టుకు రాదు" అన్నాడు చా చా.

"వెధవ జీవితం!" అన్నాడు విఠల్.

వాడికి వారం రోజులు శలవు దొరికింది. ఆ రోజు సాయంకాలమే స్వగ్రామానికి బయలుదేరాడు.

## 5

తిరిగి స్వగ్రామం కంట పడగానే విఠల్ గుండెకేదో అయింది. అంతా నిన్న చూసినట్టే ఉంది. ఒక్కరవ్వయినా మార్పులేదు. ఎంతోమంది ఎరిగినవాళ్ళు కనిపించారు. నిన్నకూడా తనను చూసినట్టే మాట్లాడారుగాని తనను

కొత్తగా చూడలేదు. "ఎల్లావుంది పట్నం?" ఈ ఒక్క ప్రశ్నే వాళ్ళు వేసింది. కొద్దిమందిమాత్రం, "ఎందుకెళ్ళావురా పట్నం?" అని అడిగారు. విఠల్‌కు ఏమీ ఉత్సాహకరంగా లేదు. ఇంటికెళ్ళాడు.

నడవలో తల్లి తన రెండోకూతురి పిల్లని ఒళ్ళో పెట్టుకుని ఏదో తినిపిస్తున్నది. మనిషి మామూలుగానే ఉంది. జబ్బేమీ ఉన్నట్టు కనపడలేదు.

"అమ్మా, నీ జబ్బెట్లా ఉంది?" అని తల్లినడిగాడు విఠల్.

"ఏంజబ్బురా?... అదప్పుడే పోయింది. వచ్చావేం?" అన్నది తల్లి.

విఠల్‌కు ఏదో అర్థంగాని బాధ కలిగింది.

"వారంరోజులే శలవు తీసుకున్నా" అన్నాడు విఠల్, యింతేనా, అని తల్లి అంటుందేమోనని.

"అట్లాగా?" అన్నది తల్లి. "అట్లా అయితే నీకు కావలసినవన్నీ చేయించుకు తిను. అక్కడి తిండి ఎట్లా ఉంటుందో!"

"తిండిమాట అడక్కు! చాలా అసహ్యం," అన్నాడు విఠల్.

తల్లి కొడుకేసి జాలిగా చూసింది. కొడుక్కు కొంత ఉపశాంతి కలిగింది.

యింతలో పెద్దన్న వచ్చాడు. తమ్ముణ్ణి చూడగానే,

"అయిపోయింది నౌకరీ ?" అన్నాడు, చాలా నిరాశ కన బరుస్తూ, "నేనసలు వెళ్ళొద్దనే అన్నాను."

"శలవు తీసుకొచ్చా. వెళ్ళితే ఏం నష్టమయిందీ ? దాదాపు మొనభైరూపాయ లప్పుతీరిందా, లేదా?"అన్నాడు విఠల్. తాను డబ్బు పంపిన సంగతి వాళ్ళెవ్వరూ స్మరించే టట్టు లేరు.

"ఇట్లా తీరే అప్పు అదీ ?" అంటూ అన్న లోపలికి వెళ్ళాడు.

"ఏమిటమ్మా ?" నే పంపిన డబ్బుతో బాకీ తీర్చ లేదా ?" అన్నాడు విఠల్ తల్లితో.

తల్లి పెద్దగా నవ్వి, "తీరుద్దామనే అనుకున్నాంగాని, ఏదో ఓ ఖర్చు వచ్చింది. నువు పెద్దవాడివై సంపాదిస్తు న్నావుగా ? తీరకేంజేస్తుందిలే?" అన్నది, చాలాధైర్యంగా.

"ఒక్క రూపాయికూడా బాకీకింద చెల్లుపెట్టలేదా?" అన్నాడు విఠల్ ఆశ్చర్యంతో.

"యింకా లేదు," అన్నది తల్లి నిబ్బరంగా.

"నే పంపినదంతా ఏమయినట్టు ?" అన్నాడు విఠల్ చిరాకుతో.

"నేను పారేశానుట్రా ? నువు మొదటిసారి పంపించి నప్పుడు మీ మామావాళ్ళిక్కడే ఉన్నారు. దాని కూతురు చేతులు బోత్తిగా బోసిగా ఉంటే, ఇంకా రెండు రూపా యలు వేసి చేతుల కేవో చేయించా. పెద్దకూతురంటే పడి

చస్తుంటారని గౌరి కూతురికూడా రెండో నెల్లో ఏదో చేయించా. ఆడపిల్లలకే పెడుతుంటారని ఇంటో పిల్లలకి అవీ ఇవీ కొన్నా. పైకం నాపేర పంపించావు కనక కాస్త నా పెద్దరికానికి తగట్టు చేశామరి. బాకీ తీర్చమని నువ్వేమన్నా రాశావా?" అన్నది తల్లి కొంచెం దెప్పుగా.

విఠల్‌కు చాలా ఆశాభంగం కలిగింది. చూస్తున్నకొద్దీ తనవాళ్ళంతా వొట్టి ఆశపాతకులుగాను, దోపిడిగాళ్ళుగానూ, ఇతరుల కష్టసుఖాలు తెలుసుకోలేని వాళ్ళుగానూ కనిపించారు. తనను ఆరునెల్ల తరవాత చూసి ఒక్క ప్రాణి అయినా నిజంగా సంతోషించలేదు. అందరూ కలిసి సంపాదించినంత తాను ఒక్కడూ సంపాదిస్తే ఒక్కరు మెచ్చుకోలేదు. తాను చమటోడ్చి, గడ్డితిని సంపాదించిన డబ్బు వెనకా ముందూ చూడకుండా అలాములు, పలాములు చేశారు.

విఠల్ తన ఫాక్టరీని జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఒక్క కూలివాణ్ణి తీసినందుకు ఫాక్టరీలోవున్న కూలీలంతా బయటికి నడిచారే! వాళ్లా మనుషులు వీళ్లా? తనమీద 'చా చా' కున్న అభిమానంలో నూరోవంతు ఇంటోవాళ్ళందరికీ కలిపినా ఉన్నదా?

"వీళ్ళనని లాభం లేదు. ఇక్కడ జీవితమే ఇంత. నేనూ ఇటువంటివాణ్ణేగా — ఆరు నెల్ల కిందటిదాకా! ఇక్కడ ఉండే లాభం లేదు."

మర్నాడే విఠల్ పట్టణానికి ప్రయాణమైనాడు.

"అప్పుడేనా?"అన్నారందరూ. కాని వాళ్ళకు తాను నిజంగా ఉండిపోవాలని ఉన్నట్టు విఠల్‌కు తోచలేదు.

"కాదు. వెళ్ళాలి! రోజుకు రూపాయిన్నర నిష్కారణంగా పోతుంది...అమ్మకు జబ్బంటే వచ్చాగాని రాకనే పోదును" అన్నాడు.

"అట్లా అయితే వెళ్ళు, పాపం!" అన్నా రందరూ.

విఠల్ ఈసారి నిజమైన పారిశ్రామిక కార్మికుడుగా పట్నం ప్రవేశించాడు. పట్నం అతన్ని తన గర్భంలో దాచుకున్నది. అతని దగ్గర్నుంచి తల్లికి మళ్ళీ ఒక్క ఎర్ర ఏగానీకూడా మనియార్డరుద్వారా చేరలేదు.



# ముక్కిటెద్దు

"వద్దు, వద్దు! నాకు డాక్టరొద్దు! రెండు రోజులుంటే అదే నిమ్మళిస్తుంది." అన్నాడు కిష్టయ్య, ఆయాసంగా.

"అదేమిటి, నాన్నగారూ? అదే నయంకావటమేమిటి. అసలు జబ్బేమిటో తెలుసుకోనివ్వండి. ముందుగా జాగ్రత్త పడాలి గాని, రోగం ముదరబెట్టుకుంటారా?" అన్నది అనసూయ. ఆమె పిల్లలు నలుగురూ ఆమె చుట్టూ నిలుచున్నారు.

"పిల్లలకోడి" అని కిష్టయ్య తన కూతురికి ఏనాడో పేరుపెట్టుకున్నాడు. కాని ఆయన ఆ మాట ఎప్పుడూ పైకి అనలేదు. ఆయన పెళ్ళాంతోగాని, పిల్లలతోగాని అనని విషయాలు, ఇటువంటివి ఇంకా బోలెడున్నై... అనసూయకు పిల్లలకోడి అని పేరుపెట్టుకున్నాక, ఆవిడ పిల్లల్ని వెంటేసుకొని ఇంట్లో కనిపించినప్పుడల్లా కిష్టయ్యకు నవ్వొచ్చేది. ఒకసారి అనసూయ గమనించి, "ఏమిటి నాన్నా! నవ్వుకున్నావు" అని అడిగింది.

"ఏం లేదు, ఏం లేదు! ఏదో జ్ఞాపకం వచ్చింది" అన్నాడు కిష్టయ్య.

అనసూయ నమ్మలేదు. ఆమెది అసలే అనుమానం మనసు. పిల్లలతల్లి అయికూడా పుట్టింటిని విడవకుండా ఉండటమే కాదు, తనకు తల్లిదండ్రులుగాని, అన్నదమ్ములుగాని ఏ లోపం చేసిపోతారో అని వెయ్యి కళ్ళతో కనిపెట్టిఉండేది. అనుమానించటానికి ఏమాత్రం అవకాశం దొరికినా సూటీ పోటీ మాటలని సాధించేది. ఎన్నో ప్రమాణాలూ, క్షమాపణలూ అయినదాకా వొదిలేదికాదు. తన నోటికి ఇంటిల్లపాదీ వెరుస్తారన్న నమ్మకం ఒకటి ఆమెకు గొప్ప అండగాఉంటూ వస్తున్నది...

తండ్రి తనను చూసే నవ్వాడన్న అనుమానంపోలేదు కాని ఏం చెయ్యలేక, కుడిచేతికి అందిన కొడుకుని ఒక్కటి పెట్టి, "పదా!" అన్నది. నోట్లోనుంచి తాపీగా వేలు తీసేసి, నింపాదిగా కళ్ళుమూసి, నోరు భార్లా తెరచి బావురుమన్నాడు నలుగురు పిల్లల్ని వెంటబెట్టుకుని అనసూయ అవతలికి వెళ్ళిపోయింది.

"ఉపగ్రిహాలు!" అనుకున్నాడు కిష్టయ్య. అనసూయ పిల్లలకు కొత్త నామకరణం చేసుకుంటూ.

ఒకప్పుడు కిష్టయ్య తన భార్యను గురించీ, పిల్లల్ని గురించీ మురిసినవాడే. ఆయన చిన్నతనంలో కష్టాలుపడ్డాడు. ఆయన తన తల్లి నెరగడు. తండ్రి రెండో పెళ్ళి చేసుకున్నాడు. మారుతల్లి కిష్టయ్యని చాలా హీనంగా చూసేది. వాళ్ళపల్లెటూళ్లో ఇంగ్లీషుబడిలేదు. బస్తీ చదువు డబ్బు దండగన్నది మారుతల్లి. తండ్రి కాదనలేదు. కిష్టయ్య పదేళ్ళవాడు. ఇంట్లో చెప్పకుండా బస్తీకివెళ్ళి వారాలు చేసుకుని, పుస్తకాలు, జీతం

డబ్బులు, ఇతరులు పారేసిన బట్టలు ముట్టెత్తి చదువుకున్నాడు. తాను మేజరై తండ్రితో ఆస్తి పంపకం చేసుకునేసరికి కిష్టయ్య చదువు అయిపోయింది.

ఇతరుల్ని మంచిచేసుకునే విద్య కిష్టయ్య చిన్నతనం నుంచీ విధిగా అలవరించుకున్నాడు. "మంచివాడు" అనిపించుకోవటం, ఇతరులను ఏ మాత్రమూ నొప్పించకుండా వారి పూర్తి సహకారం పొందటం, పొందిన సహాయానికి రెట్టింపు కృతజ్ఞత చూపటం ఆయనకు బాగా అలవాటైపోయింది. ఇదే ఆయనకు ఉద్యోగంలో పైకి రావటానికి కూడా ఎంతో ఉపకరించింది. చదివినది స్కూలుఫైనలే అయినా పెళ్ళి అయే నాటికి అప్పుడే నూరు రూపాయలు- ఆ రోజుల్లో బియ్యేలు కూడా చెయ్యలేని సంపాదన- సంపాదిస్తున్నాడు.

భార్య కాపరానికి వచ్చాక కిష్టయ్య ఆనందానికి మితి లేదు. "తన" అన్న మనిషంటూ కిష్టయ్య ఎరగడు. ఇప్పుడాయనకు ఒక భార్య, సహజీవనమూ, తన యిష్టప్రకారం ఇల్లు అమర్చుకోవటం, వంట చేయించుకు తినడం ఏర్పాటయింది. పిల్లలు పుట్టుకొచ్చారు- 'ఇద్దరు కొడుకులూ, ఒక కూతురూ, మళ్ళీ ముగ్గురు కొడుకులునూ. తన భార్యనూ, ఆరుగురు పిల్లల్నీ తనకు సాధ్యమైనంతగా సుఖపెడతానని కిష్టయ్య శపథం చేసుకున్నాడు. వాళ్ళకే లోటూ రాకూడదని రెండు చేతులా సంపాదించాడు. అదనంగా రెండు రూపాయలు సంపాదించటానికి రెండు పూటలు తిండి లేకుండా తిరగవలసివస్తే తిరిగాడు.

కిష్టయ్య ఏళ్ళ తరబడి దుక్కిటెద్దులాగా పనిచేసాడు,

ఎన్ని వ్యాపారాలలోనో భాగం తీసుకున్నాడు. ఆ వ్యాపారాలు దండగపాలు కాకుండా తానే స్వయంగా పైపెట్టున ఉండి నడిపాడు. దీని ఫలితం, కిష్టయ్యతప్ప,అందరూ అనుభవించారు. కిష్టయ్య కొడుకులకు చదువు సంధ్యలు అబ్బినా అబ్బకపోయినా సరికొత్త ఫాషన్‌లో దుస్తులు ధరించటం, మోటారు సైకిళ్ళెక్కి తిరగటం, టెన్నిస్ ఆడటం మొదలైనవన్నీ అబ్బినై.

పెద్దవాడు చిన్న టెన్నిస్ ఛాంపియన్. వాడికిస్పోర్ట్స ప్రపంచం తప్ప ఇంకేమీ తెలీదు. తాను ఉద్యోగం చెయ్యబోవటంలేదని వాడు చదువుతూండగానే ప్రకటించాడు. రెండోవాడు ఇంజనీరు చదివి, జంషెడ్పూరులో ఉద్యోగం సంపాదించాడు. వాడి భార్య లక్షాధికార్ల బిడ్డ.ఆవిడతాహతుకు తగినట్టుగా బతకటానికి తండ్రిదగ్గరనుంచి ప్రతి నెలా వందా, రెండు వందలు తెప్పించుకుంటాడు. మూడోవాడికి చీట్లాట పిచ్చి, అందులో వాడు సంపాదిస్తాడని ప్రతీతి. కాని వాడికింద కిష్టయ్య ఏటా నాలుగైదు వేలు ఖర్చు చేస్తూనే ఉన్నాడు. నాలుగోవాడికి సినిమా స్టారు కావాలని. వాడు స్కూలుఫైనలుతో చదువు ఆపేశాడు.చదవరా అని కిష్టయ్య అంటే– "నీవు చదివినంత నేనూ చదివాను. సినిమా స్టారు ఛాన్సు రానీ నీకన్న ఎక్కువే సంపాదిస్తాను" అనేవాడు. అయిదోవాడు మటుకు చదువుతున్నాడింకా.

అనసూయకు పదో ఏటనే పెళ్ళి చేశారు శారదా చట్టాన్ని ధిక్కరించి. బాగా ఉన్నవాళ్ళ పిల్లవాణ్నే చూసి చేశారు. అనసూయను మొగుడిదగ్గరికి పంపిన కొద్దిరోజులకే

ఆమె అత్తవారి ఆస్తంతా అప్పులవాళ్ల పాలయింది. డిప్రెషన్ వాళ్లమీద పెద్ద దెబ్బ తీసింది "మహాతల్లి మెట్టిన వేళావిశేషం ఎటువంటిదో, లక్షరూపాయల ఆస్తి సోదిలోకిరాకుండా పోయింది!" అని అనసూయ వింటుండగా అత్తవారుఅన్నారు. అనసూయ అప్పటికప్పుడే పెట్టె బేడా సర్దుకుని పుట్టింటికి బయలుదేరి వచ్చేసింది. మళ్లా అత్తవారింటి మొహం చూడలేదు. ఒక వారం రోజులు వెనకగా అనసూయ భర్త కామేశ్వరరావు కూడా వచ్చేశాడు.

"కాపరానికివచ్చాడు అల్లుడు!" అనుకున్నాడు కిష్టయ్య తనలో తాను ఆనందపడుతూ.

కామేశ్వర్రావంటే ఎందుకో కిష్టయ్యకు మొదటినుంచీకూడా మంటే! ఈ మంటకు పెద్దకారణాల్లేవు. ఉన్నవన్నీ అతిచిన్న కారణాలు. గొప్పచెప్పుకుంటాడు. అబద్ధాలాడుతాడు. పెళ్లామంటేనూటుకు అంతులేని ఆపేక్ష అభినయిస్తాడు. ఈ అభినయాన్ని కిష్టయ్య ఏనాడూ నమ్మలేదు. మరి మిగిలిన వాళ్ళంతా నమ్మారు.

అనసూయకు చాలా రోజులు పిల్లలులేక వరసగా నలుగురు పుట్టుకొచ్చారు కిష్టయ్య వాళ్ళందర్నీ పగవాడల్లే చూసేవాడు. కొడుకుల పిల్లలూ, కూతురి పిల్లలూ డజనునుంచి దాకా ఉన్నారు. వాళ్ళల్లో ఎవరు కనిపించినా కిష్టయ్యకు జెర్రిలు ప్రాకినట్లుండేది. "లంకంత ఇల్లున్నది. వీళ్ళు నేనున్న చోటికే ఎందుకు వస్తారో?" అనుకునేవాడు.

కిష్టయ్యకు మనుషులంటే అసహ్యం. మనవలతో మనవరాళ్ళతో ఆరంభంకాలేదు పెళ్ళాంపిల్లలతో ఆరంభమయింది. వాళ్లు

ఆయనను డబ్బు సంపాదించే యంత్రంగా చూడసాగారు. డబ్బు కావలసివస్తేనే తన దగ్గరికి వచ్చేవాళ్లు. డబ్బు దేనికో తెలుసుకుందామని తాను ఎప్పుడన్నా విచారిస్తే చెప్పటానికి విసుక్కునేవాళ్ళు. ఒక్క కామేశ్వర్రావే తన దగ్గిరికి వచ్చి కూచుని ఏవేవో వ్యాపారాలనుగురించి గంటలతరబడి మాట్లాడేవాడు. చివరకు, రెండు వేలు మూడు వేలు పెట్టుబడి కావాలని బయట పెట్టేవాడు.

తాను ఏ పూటా సరిగా వేళకు భోంచేసేవాడుకాడు కిష్టయ్య. కాని దానికి అందరూ అలవాటు పడిపోయారు. ఒక రాత్రి పన్నెండు గంటలకు ఇంటికి వస్తే అందరూ నిద్రలు పోతున్నారు. "భోజనం చేస్తావా ?" అని అడిగిన వాళ్ళు లేరు. అన్నం పెట్టమని అడిగితే పెట్టేవాళ్లే. ఎందుకో కిష్టయ్యకు అడగబుద్ధి కాలేదు. భోజనం చెయ్యకుండానే పడుకున్నాడు.

ఇంట్లో కిష్టయ్య తప్ప మిగిలిన వాళ్లందరిమధ్యా ఏవో బంధాలున్నాయి. వాళ్ళు ఆప్యాయంగా మాట్లాడుకునేవాళ్ళు అంతలో చెడా మడా తిట్టుకునేవాళ్ళు. కాని వాళ్ల మధ్య కిష్టయ్యకు ఏమీ స్థానం లేదు.

"వీళ్లందరికోసం నే నెందుకు హూనం కావాలి. నా తిండికీ బట్టకు మూడొందలు చాలు. నాకు నస్యం కూడా అలవాటు లేదు." అని కిష్టయ్య చాలాసార్లు అనుకున్నాడు. కాని దొర్లేరాయి దొర్లుతూనేఉంది. సగం ఈ మూకను మరిచిపోవ టానికే పైపనులు పెట్టుకున్నాడు. ఎప్పుడైనా పెందలాడి ఇంటికి వచ్చినా, ఇల్లుదాటి పోకపోయినా ఏదో ఆత్మద్రోహం చేసినట్టుగా తోచేది,

"ఈవాళ తాత ఇంట్లోనే వున్నాడే!" అనేవాళ్ళు కుర్రాళ్ళు. అందులో కిష్టయ్యకి ఏదో వెటకారం వినిపించేది. తరవాత కాస్సేపటికి ఇంకెవరో వచ్చి గోడల్ని అడిగినట్టుగా, 'ఈవేళ నాన్న ఎక్కడికీ పోలేదల్లే ఉందే!' అనేవాళ్ళు. ఆఖరుకు అసలావిడ, 'వెళ్లారనుకున్నా, ఉన్నారా'? అనేది.

ఇంట్లో ఎవరికి తను అవసరం లేదని తెలుసుకోవడానికి కిష్టయ్యకు చాలాకాలం పట్టింది. తాను ఏదైనా మాట్లాడినప్పుడు ఎవరూ సాంతం వినేవారుకారు. ఇది గమనించినాక కిష్టయ్య అనేక డజన్లసార్లు రుజువు చేసుకున్నాడు. కాని ఎవరితోనూ ఈ మాట అనలేదు.

కిష్టయ్యకి మరీ మంటఎత్తింది దేనికంటే, తాను అనేకమంది సహాయం పొందాడు. కాని వారందరికీ తన కృతజ్ఞత చూపాడు. ఈ మూాక తనవల్ల ఇంత సహాయం పొందుతూకూడా తన కష్టసుఖాలు ఎందుకు విచారించరు? తనకు యాభై ఎనిమిదో ఏడు. ప్రభుత్వోద్యోగం చేసినట్టయితే పించను పుచ్చుకొని సుఖపడవలసిన వయసు. అదంతా లేకపోగా ఎంతతెచ్చినా చాలదు. ఎంత యిచ్చినా ఇంకా ఇమ్మనేమాటే. డబ్బు ఇవ్వటానికితప్ప మిగిలిన అన్ని విషయాలకూ తాను పరాయివాడే!

కిష్టయ్యకు జబ్బుచేసింది. ఆరోగ్యం చెడింది. చెడదూ? విధీవిశ్రామం లేకుండా పనిచేస్తుంటే యెంతకాలం ఆరోగ్యం ఉంటుంది? అందులోనూ ఈ వయసులో!

"ఈసారి నేను చచ్చిపోతాను!" అనుకున్నాడు కిష్టయ్య. ఈ జబ్బునుంచి ఆయనకు కోలుకోవాలని లేదు. ఈ అవతారం ఇక చాలించవచ్చు ననిపించింది.

కాని మిగిలినవాళ్ళకు ఆయనను చావనివ్వాలని యే కోశానా లేదు. డాక్టరును పిలవపంపారు. తనకు డాక్టరు అవసరంలేదన్నాడు కిష్టయ్య.

డాక్టరు రానేవచ్చాడు, పరీక్షచేశాడు. విశ్రాంతి తీసుకోమన్నాడు. ఏవో ఇంజెక్షన్లూ, టానిక్కులూ రాసి ఇచ్చాడు.

"డబ్బు దండగ. నా బతుకు ఎట్లా ఆరంభమయిందో అట్లాగే ముగుస్తుంది. నా అనేవాళ్ళు లేకుండా, నా బతుకు నేను బతికినప్పుడు ఏ డాక్టరూ నాకు ఇంజక్షన్లిస్తాననలేదు. యెందుకంటే అప్పుడు డబ్బులేదు. యిప్పుడు డబ్బుందిగనక డాక్టర్లు చేతికొచ్చిన మందులల్లా రాసిస్తారు. అవి ఏమీ చెయ్యలేవు" అనుకున్నాడు కిష్టయ్య.

కాని ఇంజెక్షన్లు పనిచేశాయి. విశ్రాంతికూడా కొంత పనిచేసిందేమో? కిష్టయ్య మంచంలో లేచి కూచుంటే అందరిముఖాలూ విప్పారినై.

"బంగారుగుడ్లు పెట్టేకోడి చావలేదని యెంత సంతోషం!" అనుకున్నాడు కిష్టయ్య.

లేడికి లేచిందే ప్రయాణం. కాస్త ఆరోగ్యం కుదటపడగానే కిష్టయ్యకు ఏమీ చెయ్యకుండా ఉండటం దుర్భరమనిపించింది. అథమం ఏదన్నా చదువుదా మనుకున్నాడు.

అనసూయ ఆఖరు కొడుకు కనిపిస్తే వాణ్ణి పిలిచి, "చదువు కునేందుకు ఏదన్నా పత్రికలు తెచ్చిపెట్టరా!" అని అడిగాడు.

వాడు వెళ్ళి ఏదో పత్రిక తెచ్చి యిచ్చాడు. కిష్టయ్య పేజీలు తిరగేస్తూ, "వట్టి చెత్త! ఇహమూ, పరమూ లేని రాతలు" అనుకున్నాడు. అకస్మాత్తుగా ఆయన దృష్టి కొన్ని పద్యాలుమీద పడింది. పద్యాలకు "దుక్కిటెద్దు" అని శీర్షిక వుంది. దానికింద తన ఆఖరుకొడుకు పేరుంది.

"వీడు తిక్కన సోమయాజి అని నేను ఎరగనే!" అనుకుంటూ కిష్టయ్య పద్యాలు చదవసాగాడు. పొలాలమొహం ఎరగని తన ఆఖరు కొడుకు దుక్కిటెద్దు గురించి పద్యాలు రాయటమేమిటి?

కాని కుర్రాడు, కిష్టయ్య అనుకున్నంత తెలివితక్కువ వాడుకాడు. వాడు తానెరిగిన దుక్కిటెద్దు గురించే రాశాడు. ఆ దుక్కిటెద్దుకు జీవించటం చేతకాదు. తన కష్టసుఖాలను ఇంకొకరితో పంచుకోదు. ఇతరులకోసం అస్తమానం శ్రమ పడి వాళ్ళను సోమరిపోతులనుగా చేసి, వాళ్ళంతా తనకు ఋణ పడి వున్నారని సంతోషిస్తుంది. వాళ్ళు తనకు కృతజ్ఞత చూపటం లేదని మనసులో బాధపడుతుంది. క్రమంగా దాని హృదయంలో ఉపేక్ష, అంతఃకరణాలకు చోటుండదు. ఆఖరుకు కోపంవచ్చికొమ్ము విసరటంకూడా చాతగాని స్థితిలో పడి చావుకోసం ఎదురుచూడ సాగుతుంది.

కిష్టయ్య ఆఖరు కొడుకు కొద్దిపాటి హాస్యధోరణిలో రాసిన ఆయిదు పద్యాల సారాంశమూ యింతే.

"ఓరి పిడుగా!" అనుకున్నాడు కిష్టయ్య. కిష్టయ్యలో కొద్దిపాటి హాస్యంఉంది. అది ఎవరికీ వశపడ నిచ్చేవాడు కాడు. అదే తన కొడుక్కు కూడా సంక్రమించింది. వాడు కూడా పైకి హాస్యం వున్నట్టు కనిపించడు.

అనసూయ గ్లాసులో పళ్ళరసం తెచ్చింది.

"ప్రతిపూటా నాకు పంచదార తక్కువవుతున్నది" అంటూ గొణిగాడు కిష్టయ్య.

"తక్కువైతే అడిగి వేయించుకోరాదూ?" అన్నది అనసూయ ఆశ్చర్యంగా.

"అదే దుక్కిటెద్దు లక్షణం!" అన్నాడు కిష్టయ్య.

"ఏమిటీ?" అన్నది అనసూయ, అయోమయంగా.

"యేం లేదులే!" పిల్లల్నందర్నీ ఒకసారి పంపించు."

"దేనికి?"

"దేనికేమిటి? పంపించమంటుంటే!"

అనసూయ తల అడ్డంగా ఆడించి వెళ్ళిపోయింది.

కాస్సేపటికి ఏడెనిమిదిమంది పిల్లలు కిష్టయ్య గదిలోకి వచ్చి కుక్కిన పేలల్లే నిలబడ్డారు.

"చదవండి, నా వెంట!" అంటూ "దుక్కిటెద్దు" పద్యాలు వాళ్ళచేత చదివించాడు. వాళ్లు మొదట బెరుకు బెరుకుగా చదివారు గాని రాను రాను గొంతులు హెచ్చినై.

తండ్రి పంచదార కావాలని అడిగినమాట మరచి పోయిన అనసూయ తిరిగి జ్ఞాపకం తెచ్చుకుని పంచదార

సీసా, చంచా పట్టుకొని వచ్చేసరికి కిష్టయ్య గది, వీధి బడి లాగా వుంది. పిల్లలంతా కప్పెగిరిపొయేట్టు తాతవోంటి పద్యాలు చదువుతున్నారు. పళ్ళరసం గ్లాసు పక్కనే బల్ల మీద ఖాళీగా పెట్టి వుంది. దాని అడుగున చూచాడు. పంచదార కరిగీ కరగకుండా మిగిలి వున్నది.

"పంచదార చాలా ఎక్కువేశావ్!" అన్నాడు కిష్టయ్య అనసూయకేసి చూడకుండానే.

పిల్లలు "దుక్కిటెద్దు" గోలగా చదువుతూనే ఉన్నారు. అవి వాళ్ళకు అప్పుడే కంఠతా వచ్చేశాయి.

***

# కలిసిరావాలి

డబ్బు చెయ్యటం కూడా ఒక రొమాన్సే. ప్రణయ కథలు ఆకర్షించటం మానేశాక ప్రతివాళ్లు డబ్బుకథలు చదవాలి.

ఇది డబ్బుకథ. రొమాన్సు—అంటే నూటికీ కోటికీ తప్ప జరిగే కథ కాదు. ఇందులో నీతికూడా వుంది. ప్రపంచానికి డబ్బుతో అవసరం హెచ్చుతున్నకొద్ది ప్రజలకు డబ్బు మీద అదోవిధమైన ఏవగింపు కలుగుతున్నది. ఇదీ పెద్ద పొరపాటు. డబ్బు ఆరోగ్యకారి. ఉల్లాసం యిస్తుంది. కీర్తి, ఘనతా ఇవ్వటంమాట చెప్పనే అక్కర్లేదు. డబ్బు విజ్ఞానం కూడా ఇస్తుంది. అనేక పుస్తకాలు చదివినవాళ్ళూ, ఎంతో అనుభవం ఉన్నవాళ్ళూ తెలుసుకోలేని సంగతులు డబ్బున్న వాడికి ఇట్టే తెలిసిపోతాయి. డబ్బున్నవాళ్లు కవులకు ఎట్లా కవిత్వం రాయాలో, చిత్రకారులకు బొమ్మలెట్లా గీయాలో, గాయకులకు పాటలెట్లా పాడాలో, నటులకు నాటకం ఎట్లా ఉండాలో చెప్పటం నేను స్వయంగా చూశాను. ఇంతేకాదు వాళ్లు డబ్బున్నవాళ్లు చెప్పినట్లు చెయ్యటం చూశాను. దాంతో నా సందేహాలు రహితమైనాయి.

దురదృష్టవశాత్తూ నేను కథానాయకుడి నిజమైన ఊరూ పేరూ బయటపెట్టటానికిలేదు. సహజ వినయసంప న్నుడైన రంగయ్యగారు ప్రచారమంటే హడలిపోతారు. గబ్బిలానికి చీకట్లో యెంత సుఖంగా వుంటుందో అజ్ఞాతంగా ఉండటం రంగయ్యగారి కంత సుఖంగా ఉంటుంది. అందు చేత రంగయ్యగారి పేరు బయటపెట్టను.

అసలు రంగయ్యగారిది కుగ్రామం. ఆయన కడు బీద కుటుంబంలో జన్మించాడు. ఆయన చిన్నతనంలో ఏపూటా పొట్టనిండా తిని ఎరగడు. ఆయనను వాళ్ళవాళ్లు అక్షరా భ్యాసంకూడా చెయ్యలేదు. ఇప్పటికీ ఆయన నిరక్షరుడనే చెప్పాలి.

"చదువు రాకపోవటం నాకు చాలా లాభించింది. మన దేశానికి పాఠశాలలే అనర్థంగా ఉన్నాయని నా గట్టి నమ్మకం" అంటాడాయన.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. అతి బాల్యంనించీ కూడా రంగయ్యగారిలో డబ్బు కూడబెట్టే లక్షణమూ పొదంచేసే లక్షణమూకూడా కనిపిస్తాయి. వాళ్ళింట్లో పోపులపెట్టెలోగాని, తండ్రి పడుకునే మంచంమీద దిండు కిందగాని కాసీ, అర్ధణా, బేడా, పావలా దొరికితే రంగయ్య గారు దాన్ని భద్రంగాతీసి, ఎవరికంటా పడకుండా దాచే వాడు. ఆయన తండ్రిగారి పాతికేళ్ళ హయాములోనూ దొరికి నంత అప్పు చేశాడుగాని ఎర్రపగానీ కూడబెట్టిన పాపాన పోయి ఎరగడు.రంగయ్యా, పదేళ్ళు దాటకముందే దాదాపు

పదిరూపాయలు పోగుచేసి దాచాడు. రంగయ్య తండ్రి ఉత్తరక్రియలకుకూడా మిగుల్చుకోకుండా చచ్చిననాటికి రంగయ్యదగ్గిర పాతికరూపాయలకు తక్కువలేవు. అయినా డబ్బు దుర్వ్యయంచేసే అభ్యాసం లేనివాడు కావటంచేత తండ్రి దినవారాదికాలకు లోకుల్ని చందా వేసుకోనిచ్చాడు.

ఆ రోజుల్లోనే రంగయ్యకు పోటీపద్ధతిలో విశ్వాసం ఉండేది. ప్రపంచం యావత్తూ పోటీమీదే ఆధారపడిఉంది. పాము కందకుండా తప్పించుకున్న కప్పలు పిల్లల్ని పెట్టి తమ వంశాలను వృద్ధిచేసుకుంటాయి. యుద్ధాలు జరిగితే చచ్చినవాళ్ళు కీర్తి సంపాదిస్తే, బతికినవాళ్లు రాజ్యాలేలారు. వ్యాపారంలో అవతలవాణ్ణి చంపగలవాడే నెగ్గుతాడుఅంటాడాయన.

ఈ పోటీపద్ధతి ననుసరించి రంగయ్య తనకంటె చిన్న పిల్లలచేతిలో కాసీ, అర్థణా కనిపిస్తే వెంటనే పుచ్చేసుకునేవాడు. మనకంటె బలహీనుణ్ణి చెయ్యిదాటిపోకుండా ఉండటమూ, మనకంటె బలవంతుడికి చిక్కకుండా ఉండటమూ పోటీలో ప్రధానాంశాలు.

"బలంతో గెలవదగినవాడిని బలంతో గెలు. బలంతో గెలవలేనివాడిని యుక్తితో గెలు" అంటాడు రంగయ్యగారు.

తాను జయించలేనివాళ్ళంటూ ఉంటారనిరంగయ్య ప్రాణం పోయినా ఒప్పుకోడు. అపజయమనేమాట ఆయన

నిఘంటువులో లేదు. తనకంటె ధనికులను చూస్తే ఏదో చెప్ప రాని దాహంమూ ఆకలి పుట్టుకొచ్చేవి. వాళ్ళ చేతిలో డబ్బు ఎంత, ఎట్లా, ఎప్పుడు తనచేతిలోకి వస్తుందా అని నిద్రాహారాలు లేకుండా ఆలోచించేవాడు. కాని ధనికులమీద ఆయన ఎప్పుడూ కోపంగాని అసూయగానిచూపేవాడుకాదు. చెట్టునున్న వంకాయమీద మనకోపమూ, అసూయ చూపు తాము. తరుణంకోసం వేచిఉండి, తప్పనిసరెఅయితే చాటుగా కోసేసుకుంటాం. బస్!

"నీళ్ళతో పనిఉంటే చెరువుదగ్గిరికిపోవాలి. డబ్బుతో పనిఉంటే డబ్బున్నవాళ్ళదగ్గిరికి పోవాలి" అంటారురంగయ్య గారు.

ఆయన ఎప్పుడూ డబ్బున్న వాళ్ళవెంటే ఉండేవాడు. వాళ్లు తనను హీనంగా చూస్తారని ఆయనకు విచారంలేదు. వాళ్లుతిట్టినా, కొట్టినా, మీద ఉమ్మేసినా ఏమీ అనుకునే వాడుకాదు. కాళ్లు బురదకాకుండా వ్యవసాయం ఎట్లాచేస్తావు?

"దురభిమానం డబ్బువిలువ తెలియనివాళ్ళ వినోదం ఖర్చుతో కూడుకున్నది" అంటాడు రంగయ్యగారు.

రంగయ్య చిన్నతనంలోనే మనుషులను అర్థంచేసు కోవటానికి ప్రయత్నించేవాడు. "సకర్థంగానిదాన్ని నీకు కావలసినవిధంగా మార్చలేవు" అని మార్క్సిస్టుసూత్రాన్ని రంగయ్య పసితనంలోనే అర్థంచేసుకున్నాడు.

వాళ్ళ ఊళ్లో నెలకు ఇరవైరోజులు జూదం నడిచేది. రంగయ్య అక్కడచేరి జూదం ఆడేవాళ్ళకు రకరకాల

సహాయపడి రోజుకు అయిదారు రూపాయలుకూడా చేసుకునే వాడు. గెలుపుచేతులను ఉబ్బెయ్యటం రంగయ్యకు లాభించేది.

తండ్రిచచ్చిపోయిన పదేళ్ళకల్లా రంగయ్య ఏడెనిమిది వందలు కూడబెట్టాడు. మరొకడికయితే ఆడబ్బు ఏనాడో ఖర్చయేది. కొందరికి డబ్బు ఖర్చుచెయ్యటం ఒకవినోదం. రంగయ్యకు ప్రాణకంటకం. డబ్బుఖర్చుచెయ్యటంలోఆనందం అనుభవించేవాడు కూడబెట్టలేడు అదీసిద్ధాంతం. కూడబెట్టే డబ్బు ఎంతా అనే విచక్షణలేదు. దమ్మిడీలూ, దమ్మిడీల్లో దశాంశాలుకూడా డబ్బే. డబ్బు కూడబెట్టటం ఒకతపస్సు. దానికి నియమాలున్నాయి. నీ అవసరాలు ఎంతవరకు కొనకుండా గడుస్తాయోచూడు. ఏది అవసరం అనేదాన్ని గురించికూడ ఇతరులుచెప్పేది నమ్మకు. రోజుకు రెండుసార్లు తినడం అవసరమని నమ్మేవాళ్లున్నారు. అదిమూఢవిశ్వాసం. ఇటువంటి మూఢవిశ్వాసాలు చాలఉన్నాయి. అనేకజబ్బులు మందులు వెయ్యకుండానే పోతాయి. మందులతో రోగాలు పోతే డాక్టర్లు మట్టికొట్టుకుపోతారు. చాకలికీ మంగలికీ ఇచ్చినడబ్బు వట్టిదండగ. రంగయ్యగారు పుట్టుగడ్డం గొరిగించనేలేదు.

“నేను ప్రపంచంలో ఉండే బిచ్చగాళ్ళనూ, దరిద్రులనూ ఇప్పటికీ మరచిపోలేను, ఒకవేళ ఒకకాసీ వృధాచేద్దామనుకుంటే ఆ కాసీతో అవసరం ఉన్న అనాథలందరూ జ్ఞాపకంవస్తారు” అంటాడు రంగయ్యగారు.

రంగయ్యగారు జీవితంలో ఎన్నడూ కాయకష్టం చెయ్యలేరు. "కాయకష్టం చేసేవాడు తనకుతానే సేవచేసుకుంటాడు. నేను మొదటినుంచీ ఒకరికింత ఉపకారంచేసి ధనం సంపాదించిన ప్రతి దమ్మిడీకూడా నేను లోకానికి చేసిన ఉపకారం చాటుతుంది"

ఇది నిజం. రంగయ్యగారు ఆ రోజుల్లో వడ్డీవ్యాపారం చేసేవాడు. రాత్రికి బియ్యానికి లేనివాళ్ళూ, అవసరంగా పదిరూపాయలు కావలసినవాళ్ళూ పాతికా పరకా పట్టుకెళ్ళేవాళ్ళే. వడ్డీ యిచ్చేవాళ్ళు మంచివడ్డీయే ఇచ్చేవాళ్ళు. కాని నిర్బంధంలేదు. వాళ్ళంతటవాళ్ళు ఇష్టపడే ఆ వడ్డీకి ఒప్పుకునేవారు. కొందరు కొందరు పదిరూపాయలు పట్టుకెళ్ళి నెలాఖరుకు ఇరవై చేత పెట్టేవాళ్ళు. రేపటిసంగతి ఆలోచించకుండా డబ్బు దొరుకుతున్నది గదా అని పట్టుకుపోయ్యేవాళ్ళే. తరువాత పశ్చాత్తాపపడి రంగయ్యను తిట్టేవాళ్ళు. డబ్బు తిరిగి ఇవ్వలేక పొయ్యేవాళ్ళు. కోర్టుకుఎక్కి అవసరమైన దానికంటే ఎక్కువఖర్చు చేసుకునేవాళ్ళు.

ఈ విధంగా రంగయ్య అనేకకుటుంబాలను తన పొట్ట పెట్టుకున్నాడని వాళ్ళ ఊళ్ళోవాళ్ళకు గురుతిగా ఉండేది. కాని ఆ కుటుంబాలన్నీ చితికి పోయినవే. అవి ఎట్లాగూ దక్కేవికావు. రంగయ్య తెలివిగలవాడు గనక వాటిని తన పొట్ట పెట్టుకున్నాడు. అంతే.

రంగయ్య ఎన్నడూ చట్టాన్ని వ్యతిరేకించ లేదు. చట్టాన్ని వ్యతిరేకించకుండా బాగుపడేహాక్కు ప్రతిమనిషికీ

ఉంది. కొందరు అది చాతకాక చట్టంలోని నీతులు చెబుతారు. వాళ్ళనుచూస్తే రంగయ్యగారికి తగనిమంట. కాని, ఏమాట కామూటే చెప్పాలి. లోకులు తనకు శాపనార్థాలు పెట్టారనీ, తనవాకిట్లో పేడా పెంటా వేశారనీ, తనమీద చాతబడులు కూడా చేయించారనీ ఆయనకు కోపం లేదు.

ఒకడిబాగు పదిమంది సహించరు. అది సిద్ధాంతం. అందరిచేతా మెప్పులు సంపాదించుకునే వాళ్ళు సర్వనాశమై పోతారు. సర్వనాశనమై పొయ్యేవాళ్ళనే ప్రపంచం మెచ్చుకుంటుంది.

జీవితం అరాచకమైనది. చట్టం ఒప్పుకున్నా ప్రజలు ఒప్పుకోరు, రంగయ్య పాతికేళ్ళు దాటకమునుపే ఉన్నఊరు వదలి పెట్టేశాడు.

పట్నానికి వచ్చినాక రంగయ్యకు అవకాశాలు హెచ్చాయి. ఇక్కడ మునిసిపాలిటీలున్నాయి. కక్షలున్నాయి. విభేధాలున్నాయి. వ్యాజ్యాలూ ఉన్నాయి. ఇవన్నీ డబ్బు సంపాదించటానికి సాధనాలే. ఇద్దరు తగాదాపడి కోర్టుకెక్కితే ప్రైవేటుకూ, ప్లీడరుకూ, ప్లీడరుగుమాస్తాకూ, స్టాంపు వెండరుకూ, ప్రభుత్వానికీ, కోర్టు అమీనాలకూ, కాఫీహోటళ్ళకూ, జట్కాబళ్ళకూ లాభం. మునిసిపాలిటీలలో రెండేసి పక్షాలు తగాదా పడితే ఇంకా ఎంతమందికి ఎంతేసి లాభాలుండొచ్చు?

బస్తీజీవితంలో చాలా కళ్లున్నది. డబ్బు పండించే వాడికిదంతా ఎరువు. రంగయ్యగారు మునిసిపలు వ్యవహా

రాలలోనూ, కంట్రాక్టులు వగైరాలల్లోనూ తలదూర్చి ఉట్టుడి
యంగా డబ్బు చేసుకోసాగాడు. చాలామంది పలుకుబడిగల
స్నేహం సంపాదించాడు. డబ్బు ఖర్చు చేసేవాడికి దొంగ
స్నేహితులు చుట్టూ చేరుతారు. డబ్బు చేసేవాడికి నిజమైన
నమ్మకస్తులు తటస్థపడతారు. డబ్బిస్తేనే ఎవరైనా పలుకుతా
రనేది భ్రమ. మనుషులు డబ్బునుచూసి ఎక్కువ భ్రమ పడ
తారు. చేతిలోకి వచ్చినడబ్బు మట్టితో సమానం. అందు
బాటులోకిరాని ఆడదాని వల్లేనే అందుబాటులోకిరానిడబ్బే
మనిషిని ప్రబలంగా భ్రమపెడుతుంది. ఇది రంగయ్యస్వాను
భవం. ఆడదాని మాటకాదు-డబ్బుమాట. రంగయ్య నిఘం
టువులో ఆడవాళ్ళు లేరు.

ఇంతలో యుద్ధంవచ్చింది. రంగయ్య పంట పూర్తిగా
పండింది. యుద్ధంజరిగితే వస్తువులు దొరకవనేది చాలామందికి
తెలుసు. దాన్ని సరిగా వినియోగపరచుకున్నవాడు రంగయ్య.
అందిన వస్తువులల్లా చాలాకొనేశాడు. అన్నిటికన్నా బంగా
రం విరివిగా కొన్నాడు. అనేక కంట్రాక్టులు సంపాదించాడు.
రెండుచేతులా డబ్బు గడించాడు.

రంగయ్యకు చదువు రాకపోవటం ఏమీ అడ్డం
రాలేదు. పెద్దపెద్ద చదువులు చదువుకున్నవాళ్ళు నెలకు
యాభైరూపాయలు పుచ్చుకుని తనకు అవసరమైనంత సహా
యం చేస్తారని రంగయ్య తెలుసుకున్నాడు. చదువుకున్న
వాళ్ళు నమ్మకస్తులుగా వుంటారు. ఇంకొకరి డబ్బుమీద
వారికి ఆశవుండదు. వాళ్ళకి డబ్బు చెయ్యలేని లక్షణాలన్నీ
ఉంటాయి. నీతివుంటుంది. ఇతరులలో ఈ లక్షణాలుండటం

తనకు మంచిదని రంగయ్య తెలుసుకుని చదువుమీదా నీతి మీదా గౌరవం చూపసాగాడు. ఇతరులందరికీ చదువుండడం తనకెంత లాభమో, ఇతరులు నీతిగా ఉండడం తనకు లాభమని రంగయ్య గ్రహించాడు.

యుద్ధసహాయం చేసాడని రంగయ్యను దేశద్రోహి అనేవాళ్లు మూర్ఖులు, రంగయ్య దేశభక్తికీ, దేశద్రోహానికీ కూడా అతీతుడు.

ఆయనకి రాజకీయాలతో ప్రసక్తిలేదు. అయినా యుద్ధాన్ని బలపరిచినవాళ్లను రంగయ్య బలపరిచాడు.

యుద్ధకాలంలో అనేకమందికి పరిశ్రమలమీద ఆసక్తి పుట్టటం కనిపెట్టాడు రంగయ్య. అనేకమందికన్న రంగయ్య అధికంగా డబ్బు చేశాడు గనక వాళ్ళు ఆయన సహాయంతో వ్యాపారాలు ఆరంభించటానికి సిద్ధపడ్డారు. ఇది తనకెట్లా లాభిస్తుందని రంగయ్య ఆలోచించాడు. వ్యాపారంలో ఉత్సాహం ఎంత సులభంగా పుడుతుందో నిరుత్సాహంకూడా అంత సులభంగానే పుడుతుంది. వ్యాపారంలో డబ్బు పెట్టిన వాళ్ళకు నిరుత్సాహం పుట్టిస్తే, వాళ్ళు తమ వాటాలు సగానికి సగం నష్టపడి అమ్ముకుపోతారు. కంపెనీలు పెట్టి రంగయ్య పాతికవేలు చేసుకున్నాడు. ఆ వ్యాపారాలు సాగనేలేదు. నష్టపడ్డవాళ్ళు రంగయ్యతో కలిసి పెట్టుబడి చేసినవాళ్ళే.

యుద్ధం మూలంగా రంగయ్య ఎంత డబ్బు చేసినా రంగయ్యకు యుద్ధంకంటె అంతకు పూర్వం వచ్చిన ఆర్థిక

కాటకమే బాగుంది. "కాటకంలో ప్రతి రూపాయి విలవా మూడు రూపాయలకు హెచ్చింది. నేను చౌక రూపాయ లిచ్చి వడ్డీతోసహా ఖరీదైన రూపాయలు పుచ్చుకున్నాను. ఈ యుద్ధంలో రూపాయిధర అయిదణాలకు దిగిపోయింది. రూపాయ రాధగినచోట మువ్వావలాకూడా రావటంలేదు, ధరలు ఎంత పెరిగినాను !" అన్నాడు రంగయ్య. ఆయనకి ఆర్థిక పరిజ్ఞానం లేదని ఎవరనగలరు ?

రంగయ్యనుంచి ఏదైనా నీతి నేర్చుకోవాలని ప్రయ త్నించాను. కాని సాధ్యంకావటంలేదు. కారణమేమంటే, ఆయన డబ్బు అపరిమితంగా గడించుతున్నకొద్దీ ఆయన తాత్వికంగా క్షీణిస్తున్నట్టు కనిపిస్తున్నాడు. ఆయన సిద్ధాం తాలు ఏ కారణంచేతో ఇప్పుడు సూటిగా పనిచెయ్యకుండా వున్నాయి. ఒకప్పుడు చట్టాన్ని అతిక్రమించకుండా మహా రాజులాగా డబ్బు కూడబెట్టిన రంగయ్యకు రానురాను అడు గడుగునా చట్టం అడ్డువస్తున్నది. గడచిన పదిహేను నెలల కాలంలోనూ ఆయన రెండుసార్లు వెండుకవాసిలో జైలు తప్పించుకున్నాడు.

ఆయన్నడిగితే చట్టాన్ని తిడతాడు. కాని నా అను మానం ఏమిటంటే, ఆయన సిద్ధాంతాలను అతిక్రమించి ఆయన ఏదో ఒకటి చేస్తేనేగాని ఇంకమీదట డబ్బు చేయ డం సాధ్యంకాదు. కొత్త సిద్ధాంతాలు ఆయన అందుబాటు లోకి రాకుండా వున్నాయి. ఆయన మనస్సు ఏ విధంగా పనిచేస్తున్నదీ నేను పరిశీలనగా చూస్తూ వస్తున్నాను.

దేశానికి స్వాతంత్ర్యం రావటం అనర్థమయింది. ఈ కాంగ్రెసువాళ్ళే అన్నిటికీ అడ్డంగావున్నారు. ఒక్క అర డజనుమంది దొంగవెధవల్ని చంపిపారేస్తేగాని పరిస్థితులు బాగుపడవు అన్న అభిప్రాయాలు ఆయననోట విన్నాను.

ఈ అభిప్రాయాలు సరిఅయినవి కావని నేను నొక్కి వక్కాణించగలను. స్వరాజ్యం రావటంవల్ల ధనికుల చిక్కులు హెచ్చలేదు. కాంగ్రెసువాళ్ళు ధనికవర్గానికి ద్రోహం చేస్తున్నారనటానికి ఏమీ ఆధారంలేదు. ఇక హత్యలంటారా, రంగయ్యకు సంబంధించినంతవరకూ అవి గొంతెమ్మ కోరికలే.

ఏమీ సందేహంలేదు. డబ్బు రంగయ్యను ఓడగొట్టుతున్నది. ఈనాటి స్వాతంత్ర్య వాతావరణంలో చల్లని కాంగ్రెసు పరిపాలనకిందా, లేదా, హత్యలుచేసే లక్షలూ కోట్లూ చేసుకోగలవారి జాబితాలో రంగయ్య పేరుచేసే అవకాశాలు కనిపించటంలేదు. రంగయ్య మెడతాడు బిగలాగుకుంటున్నది. ఇక ముందరికి పోవటానికి ఎంత ప్రయత్నంచేస్తే అంతగా మెడ బిగుసుకుంటుంది. నలభై దాటినై. ఇక రంగయ్య మారలేడు. తన మనస్తత్వాన్ని సిద్ధాంతాలనూ మార్చుకోలేడు. సాంఘికంగా ఆయనకు తోడ్పడదగిన వాళ్ళుకూడా దగ్గరలేరు. రాబందులు మూగుతున్నాయి. ఇద్దరు టోపీదాసులు ఎగుమతి పర్మిట్లు సంపాదించి పెడతామని రంగయ్యచేత పదేసివేలు ఖర్చుపెట్టించి దాటిపోయారు. ఈ భాగ్యంతో రంగయ్య చితికిపోవుగాని, ఇంకా మిగిలి

వున్న రంగయ్య సొమ్ము ఎలా హరించిపోతుందో చూడవలసి వుంది. రంగయ్య డబ్బులో కనీసం ఒక వెయ్యి అయినా నా చేతిమీదగా హరించేటట్టు చేసుకునే తాహతు నాకు లేనందుకు నాకే ఎంతో విచారంగా వుంది.

## నువ్వయితే ఏంజేస్తావు?

చేసిన పాపం చెపితే పోతుందంటారు. నేను కాంగ్రెసు వ్యతిరేకినని గాంధీ పటం నెత్తిన పెట్టుకు ప్రమాణం చేసిన మాట నిజమే. పీకెమీాది కొచ్చినాక చావనా ? అటువంటి అగత్యం నా జీవితంలో కలుగుతుందని నేను కలగన్నానా? పోలీసు వగైరా అపాయకర శక్తులు సుస్థిరంగా కాంగ్రెసు పక్షాన ఉంటాయని తెలిసేగదా నేను ఖచ్చితంగా కాంగ్రెసు పక్షాన నిలబడి వున్నది ? నాకేం రాజకీయాలు తెలిసేడుసునని ? స్వరాజ్యం రాకమునుపు దైవంమీాదే భారంవేసి కాంగ్రెసు ఉద్యమాలన్నిటినీ తిట్టినవాణ్ణేగా? అటువంటప్పుడు నన్ను మీారు అపార్థంచేసుకుంటే ఎట్లా? నే నెప్పుడూ గెలిచే పక్షమే ఉంటాను. నావల్ల బలవంతుల కెప్పుడూ అపాయం వుండదు. మామూలు పోట్లాటల్లోకూడా నేను నాలుగు తినేవాణ్ణే. రెండు వేస్తానుగాని, వేసేవాడి జోలికి పోనే.

అటువంటివాడికి నాకే ఎందుకు జరగాలి ఈ పాడు పరీక్ష? ఆ లోకోత్తర పురుషులు నాదగ్గిరకే ఎందుకురావాలి? వారి ప్రశ్నలకు నే నెందుకు సమాధానం చెప్పాలి—ఏమో నాకు తెలీదంటే పొయ్యేదాన్ని!వాళ్లుకూడా కాంగ్రెసు పక్షపాతుల్లాగే కనపడేసరికి నేను గోతిలోపడ్డాను. ముఖ్యంగా ఆంజనేయస్వామి వారి వాలకం చూసేసరికి—

ఇట్లా చెప్పకపోతే జరిగిన విషయం మీకేమీ బోధ పడదు. అందుకని జరిగిన విషయం జరిగినట్టు మీకు మనవి చేస్తాను. నా వల్ల ఎట్టి దోషమైనా ఉంటే దండించండి.

ఆ రోజు రాత్రి నా కెంతసేపటికీ నిద్ర పట్టలేదు. అసలే ఇల్లు బిక్కు బిక్కు మంటోంది. మా ఆవిడ పిల్లలతో సహా ఆ సాయంకాలమే బయలుదేరి పుట్టింటికి వెళ్ళింది, చెల్లెలికి పురుడు వస్తోందని, "రేపు ఉదయం వెళ్ళవే" అంటే వింటా? అంత ఇంటికీ బిక్కు బిక్కు మంటూ నేనొక్కణ్ణే. అసలే నాకు చీకటంటే భయం. దొంగాళ్ళ మాట జ్ఞాపకం వచ్చినా కమ్యూనిస్టుల మాట జ్ఞాపకం వచ్చినా ఇక రాత్రికి జాగారమే అనుకోండి. అందుచేత ఎంతకీ నిద్ర పట్టలేదు. నిమిషాలు లెక్కపెట్టాను. నేను లెక్కపెడుతున్నవి సెకండ్లా అనిపించింది. ఎన్ని వేల నిమిషాలు లెక్కపెట్టినా ఒక గంట కాదాయె!

పన్నెండు గంటలు కూడా విన్నాను. మా గడియారం పన్నెండు గంటలూ తీరా కొట్టిందో లేదో దభీమని చప్పుడయింది. నా గుండె కాస్తా ఆగిపోయింది. వొణుకుతూ కళ్ళు గట్టిగా మూశాను.

"అబ్బాయ్ ! చూడు బాబు !

ఆ గొంతు వినగానే భయం పోయినట్టయింది. కళ్ళు తెరచి చూద్దును గదా నాటకంలో వేషం లాగా ఎదుట నిలబడి ఉన్నాడు - చెమ్కీ కోటు, చమ్కీ లాగూ, మెడలో నాకరకం పూసల దండలూ, మొహానికి అరడజం - ఎప్పుడో నేను నా పసితనంలో చూసిన హరిశ్చంద్రుడి వేషంలా

వున్నాడు. ఈ పాత్రధారి ఎవడు ? ఈవేళ నా యింట్లోకి ఎట్లా వచ్చాడు? ఎక్కణ్ణుంచి వచ్చాడు ? ఎందుకు వచ్చాడు? ఇలాటి సందేహాలెన్నో నాకు కలిగాయి.

"ఎవరు మీరు?" అన్నాను.

"నేను హరిశ్చంద్రుణ్ణి నాయనా? నీవల్ల ఒక ఉపకారం కావాలి".

నన్ను వెర్రిబాగులవాడికింద కట్టిన ఆమనిషినిచూస్తే నాకు నవ్వూ, కోపమూ కూడా వచ్చింది.

"అట్లాగండీ, హరిశ్చంద్రుడుగారూ! మీరు రావటం ఎక్కడినుంచి?"

"దేవేంద్రుడి సభనుండి బాబూ. ఒక చిన్న అన్వేషణమీద దేవేంద్రుడి కోరికపై వచ్చాను. ఇంతకాలానికి ఈ పుణ్యభూమిలో సత్యమే ప్రాతిపదికగా రాజ్యం ఏర్పడిందట. ఈ రాజ్యం తాలూకు వివరాలు కనుక్కొని వచ్చి చిన్న రిపోర్టు తయారు చెయ్యమనీ, మరొకర్ని మరొకర్ని పంపితే తనకంత నమ్మకం ఉండదనీ దేవేంద్రుడు నన్ను కోరాడు. నేను కాదనలేకపోయాను" అన్నాడాయన. "ఏం వివరాలు కావాలి మీకు?" అన్నాను.

"మీరు నిజంగా సత్య రాజ్యంలోనే ఉన్నారా?

"మీకా సందేహం దేనికి? మా జాతీయ మాటో_ క్షమించండి మాటో అనే యింగ్లీషు మాటలకు సరిఅయిన తర్జుమా తెలియదు – "సత్యమేవజయతే అని?"

"నిజమా! అహా ఎంత అదృష్టవంతులు నాయనా మీరు. నే నారోజుల్లో సత్యసంధత మీద నిలబడ్డానంటే

బొత్తిగా ఒంటరిగాణ్ణి. నాకొక్క పురుగు తోడు లేదు. మీ ప్రభుత్వమే 'సత్యమేవ జయతే' అంటున్నదా? కొంపతీసి 'సత్యమేవజయితే' అనడంలేదుగదా. ఎందుకంటే" అని అన్నాడాయన.

"లేదులెండి. ఎక్కడన్నా అచ్చు తప్పులు రావల సిందేగాని 'జయతే' అనే అంటున్నాం. కష్టపడిసాధించిన స్వాతంత్ర్యాన్నా వదలుతారుగాని కాంగ్రెసువారు సత్యాన్ని మట్టుకు వదిలిపెట్టరు.

"అట్లాగే ఉండాలి నాయనా. నేను సత్యంకోసం రాజ్యాన్ని, భార్యాబిడ్డలనూ వదలిపెట్టెయ్యలా?"

"నిజమేనండి, మీనాటకం చాలాసార్లుచూశా చిన్న తనంలో, అందులో మా మేనమామగారు వీరబాహుడివేషం వేసి జనాన్ని భలే నవ్వించేవాడు."

"వీరబాహుణ్ణిచూసి జనం నవ్వేవాళ్లా? ఏంచిత్రం? అయితే, బాబూ మీరు స్వాతంత్ర్యంకోసం చాలా కష్ట పడ్డారా నాయనా?"

"అయ్యో అంతులేని కష్టాలు పడ్డామండీ"

"పోనీ, పాపం. సుఖించాలంటే కష్టపడాలి, నాయనా ఏమేం కష్టాలు పడ్డారో కొంచెం టూకీగా చెబుతావూ, రాసుకుంటాను!

ఆ మానవుడు జేబులోంచి పుస్తకం తియ్యసాగాడు.

"ఆ రాజకీయాలు నాకంత బాగా తెలీవండీ. మీరు మా కాంగ్రెసు నాయకులను కలుసుకుంటే అవన్నీ వారు వివరంగా చెప్పగలుగుతారు."

"అట్లాగా? సరేలే! నేను వెళ్ళి అక్కడక్కడా నాకు కావలసిన విషయాలు సేకరించి మళ్ళీపోయేటప్పుడు కనిపించి మరీపోతాను;" అన్నాడు సత్యహరిశ్చంద్రుడు. మాటలోనే అంతర్హితుడౌతూ.

ఆయన మాయమైన మరోక్షణం ఏదో భ్రమపడ్డాననుకున్నాను. హరిశ్చంద్రుడేమిటి? నాదగ్గిరికి రావడమేమిటి? తెలుగు – అందులోనూ మాజిల్లాభాష, మీదుమిక్కిలి వ్యావహారికం – మాట్లాడట మేమిటి?

ఈ మాట అనుకుంటూ కన్ను మూశానో లేదో గదిలోకి వందగ్యాసులైట్లు వచ్చినట్టయింది. బలవంతాన కళ్ళు తెరచి చికిలించి చూద్దునుగదా, ఒకదివ్యపురుషుడు నా ఎదుట నిలబడి ఉన్నాడు. ఆయనను "మీరెవరు? అని అడగవలసిన అవసరం కలగలేదు. నాగదిలో వున్న బుద్ధుడి బొమ్మకు అచ్చమైన నకలు.

"ఏం స్వామీ ఇట్లా దయచేశారు" అన్నాను.

బుద్ధుడికి తెలుగువచ్చు.

"ఇంద్రలోకంనుంచి వస్తున్నాను నాయనా. మీ రాజ్యంలో అహింస నూటికి నూరుపాళ్లూ అమలుజరుగుతుందట. ఇంద్రుడు నన్ను ఆ విషయం చిన్నరిపోర్టు రాయమని పంపాడు."

"అట్లాగాండీ? అందులో సందేహమేమీలేదు. హింసలో విశ్వాసంలేని ప్రభుత్వమంటూఉంటే ఈప్రపంచంలో మాదే. రష్యా–చైనాలపట్ల మాకెంతో స్నేహభావముండి కూడా, వాళ్ళు హింసాయుత విప్లవాలు జరిపారన్న కారణం

చేతనే మా ప్రభుత్వం ఆ దేశాల సాహిత్యాన్ని బహిష్క రిస్తున్నది. హింసను తగ్గించాలనేఉద్దేశంతోనే మాప్రభుత్వం హింసావాదులను అంటే కమ్యూనిస్టులేండి – ఏమీ తప్పు చెయ్యకుండానే బొక్కలోకి–అంటే జైల్లో అన్నమాట – తోస్తున్నది. మేం ఒక్క ఇంగ్లీషువాడి రక్తబిందువు చింద కుండా వాళ్ళదగ్గరనుంచి స్వరాజ్యం పుచ్చుకున్నాం. అటు వంటి స్వరాజ్యాన్నయినా వొదులుతాంగాని అహింసను మాత్రం వదలం.

"చాలా సంతోషం నాయనా! రాజ్యమెందుకు బాబూజీ? నేను రాజ్యాన్ని అవలీలగా తృణీకరించి ప్రేమ మార్గం కనుక్కున్నాను."

"మీరు మా కాంగ్రెసు నాయకులను కలిసి మాట్లా డితే అంతా బోధపడుతుంది."

"అట్లాగే, నాయనా. నువ్వుచెప్పిన ఈ రెండు ముక్కలూ నాకెంతో సంతోషం కలిగించాయి. అయితే, చూడు, బాబూ! అహింసా చిహ్నం ఏదైనా మీదేశంలో ఉందా?"

"లేకేమండీ? మా జెండామీద ధర్మచక్రం ఉంది."

"అశోకుడిదేనా, బాబూ?"

"అవునండీ, అవును!"

"మంచిది, నాయనా! అశోకుడుందే హింసద్వారా అహింసను చేరుకున్నాడు."

"మా కాంగ్రెసు వారు ముందే అహింసను అవలం బించారు."

"భేష్! బాగుంది! వస్తా నాయనా! మళ్ళీ తిరిగి వచ్చేటప్పుడు నిన్ను చూసి మరీ దేవేంద్రలోకం పోతా!"

ఒక్కసారిగా కాంతి మాయమైంది. కళ్ళు చీకట్లు కమ్మాయి. మళ్ళీ నాకళ్ళు గుడ్డిదీపపు వెలుతురుకు అలవాటు పడ్డ తరువాత ధైర్యంగా కళ్ళుమూశాను. కన్ను ఇట్లా మూశానోలేదో – కప్పువిరిగి మీాద పడిందనుకున్నాను – అంతభయంకరమైన చప్పుడై, భూమి కంపించింది. కళ్ళు తెరచి చూద్దునుగదా ఆంజనేయులవారు ఎదుట ప్రత్యక్షం. మూడు మూర్తులా రవివర్మ గీసిన ఆంజనేయుడే.

"ఏంస్వామీా, ఇట్లాదయచేశావు?"

నామాట వినిపించుకోలేదు. అటూ ఇటూ ఊగుతూ "రామ రామ రామ సీతా" అని పాడుతున్నాడు. నేను నోరుతెరిచి అతనికేసి చూస్తున్నాను. చిన్నప్పుడు చూసిన సి. యస్. నటేశం హనుమంతుడికీ, ఈ అబ్బికీ చాల పోలిక లున్నాయి. అంతేఎత్తుకూడా ఉన్నాడు. పాడుతూ పాడుతూ నా మీాదకురికి గొంతు పిసగపోయినాడు.

"ఆగు, ఆగు ఏమిటీ దౌర్జన్యం?" అన్నాను.

"ఇది రామరాజ్యంకాదూ?"

"అవును అయితే?"

నేను రాంభజన చేస్తూంటే నువ్వుకూడా చెయ్యవేం? నువ్వుచూస్తే దేశద్రోహిలా ఉన్నావు! చంపేస్తా? ఎవడను కున్నావో? రామబంటును!"

"ఎట్లా! ఏం వచ్చారు తమరు?"

"ఇక్కడ రామరాజ్యం ఎట్లా అమలు జరుగుతుందో

చూసిరమ్మని దేవేంద్రుడు నన్ను పంపాడు. రాముడి తర్వాత ఇంతకాలానికి మళ్లీరామరాజ్యం ప్రపంచంలో ఏర్పడిదంటే నాకు పరమానందంగా ఉంది. రామ రామ రామ సీతా!

మళ్ళీ పాటలో పడ్డాను.

"అవును రామభక్తాగ్రేసరులైన అనేకమంది అయ్యంగార్లు ప్రభుత్వంలో ఉన్నారు – అంటే వైష్ణవస్వాములన్న మాట."

"రామ రామ రామ సీతా! ఈదేశానికి రాజెవరు?"

"రాజులుండరు. ఇది రిపబ్లిక్ అంటే ప్రజారాజ్యమన్నమాట. అంటే ప్రజలే రాజులు!"

"హా రామా! నీ ఆశయం నెరవేరిందయ్యా, నువ్వు రాజువై ఉండి ప్రజాభిప్రాయాన్ని పాటించావు! ఇంతకాలానికి ప్రజలే రాజులై పోయినారు. రామ రామ రామ సీతా!

"ఈమధ్యనే ఎన్నికలైనాయి. ప్రజలు కాంగ్రెసు మంత్రులనే ఎన్నుకున్నారు. కాంగ్రెసు మంత్రులను ఎన్నుకోకపోతే రామరాజ్యం పోయే ఉండును. అదృష్టవశాత్తు అట్లా జరుగలేదు."

"రామ రామ రామ సీతా! నేను అట్లావెళ్ళి నీ రామరాజ్యాన్ని స్వయంగా చూసి వస్తా. తిరిగి వెళ్లేటప్పుడు మళ్ళీ కనిపిస్తాలే! రామ రామ రామ సీతా! రామ రామ రామ సీతా!"

ఆంజనేయుడి పాట క్రమంగా ఫేడవుట్ అయింది. నేనుకూడా కళ్లుమూశాను. కాని ఇంకెవరు వస్తారో అని

నాకు అనుమానంగానే ఉంది. అయితే ఇది వొట్టి అనుమానమే అయింది. ఎందుచేతనంటే ఇంకెవరూ రాలేదు. నేను నిద్రకూడా పోయిఉండాలి.

ఎందుచేతనంటే నాకు ఈసారి నిద్రా భంగమయినట్టయింది. ఈసారి నేను లేచింది చప్పుళ్ళకుకాదు. ఆకస్మికంగా వాళ్ళంతా దగ్ధమై పోతున్నట్లనిపించింది. ఏదో పీడకల వచ్చినట్లుగా వంటిమీద రోమాలన్నీ నిక్కపొడుచుకున్నాయి. శరీరమంతా కంపిస్తున్నది. నాలుక ఎండుకుపోయి పిడచ గట్టింది.

నేను కంగారుగా పక్కలో లేచి కూచునేసరికి ఆ ముగ్గురూ నా ఎదుట వున్నారు. నాకేసి రౌద్రంగా చూస్తున్నారు. వాళ్ళనుచూస్తేనే పైప్రాణాలు పైన పోసాగాయి.

"నాతో అబద్దాలాడావుట్రా? పాపి!" అన్నాడు. హరిశ్చంద్రుడు, పళ్లుపటపటాకొరుకుతూ హరిశ్చంద్రుడేమో నోట్లో నాలుక లేని సత్తెకాలపు మనిషనుకున్నాను. బుద్ధుడు ఏమీఅనలేదు. కాని ఆయననాకేసిచూసేచూపు దుర్భరంగా ఉంది. ఇక ఆంజనేయుల వారి సంగతి చెప్పనే అక్కర్లేదు. నిప్పులు తొక్కిన కోతిలాగ, ఇంకోమాటు అనటానికి లేదు— చిందులు తొక్కుతున్నాడు. అతని తోక భయంకరమైన కొండశిలలాగా నామీదికి దూకుతోంది.

"క్షమించండి! నేను అల్పుణ్ణి మీ ఆగ్రహం తప్పు చేసిన వారిమీద చూపండి."

"మాతో అన్ని పచ్చిఅబద్ధాలెందుకు చెప్పావు? అన్నాడు హరిశ్చంద్రుడు. నేనేం అబద్ధాలుచెప్పానో నాకు

తెలీదు. కాని చెప్పక చెప్పక నే హరిశ్చంద్రుడికే అబద్ధాలు చెప్పటం ఏమిటి? నా ప్రారబ్ధం కాకపోతే అబద్ధాలను ఎవరైనా సహిస్తారుగాని హరిశ్చంద్రుడు సహిస్తాడా!

"సత్యమేవజయతే. హాహాహాహా హాహాహా" అన్నాడు హరిశ్చంద్రుడు.

"అహింసస్తేనర్మచక్రం! హాహాహాహా హాహాహా!" బుద్ధుడు.

"రామరాజ్యం! గుర్ర్ర్" అన్నాడు ఆంజనేయులు.

నేనేం చెయ్యాలి? నాకు మతిపోయింది! వాళ్ళఎదుట సాష్టాంగపడ్డాను. నా సుకుమారమైన చర్మాన్ని రక్షించుకునేందుకు నోటికి వచ్చినమాట అనేశాను.

"అయ్యా మీ ఎడల నేను అపచారం చేసి వుండి వుండవచ్చు నాకు నిజంగా రాజకీయాలు తెలియవు. కాకపోయినా నేను కాంగ్రెసు వ్యతిరేకిని, మీరు సి. ఐ. డి. లేమోనని భయపడి అట్లా అన్నాను.

వీళ్ళు ఏ రాజకీయ దృక్పథం గలవారో నాకు తెలిసి చావకపోయె. ఏ రష్యా ఏజంట్లయినా అయితే కమ్యూనిస్టనని చెబుదామనికూడా తెగబడ్డాను, చెప్పొద్దూ? కాని ఆ ఇంద్రలోకంలో ఏ రాజకీయాలు తెలిసి ఏడవలేదు. అందుచేత కాంగ్రెసు వ్యతిరేకినని మాత్రం ఊరుకున్నాను. అదే నా ప్రాణాన్ని కాపాడింది. హనుమంతుడి తోక నామీద ఆడటం మానేసింది. బుద్ధుడు నాకేసి తీవ్రంగా చూడటం మానేశాడు. హరిశ్చంద్రుడు కూడా కొంత సౌమ్యంగా మారాడు.

"నువు వెధవ్వి! మీ బతుకు బండారమంతా ఇప్పుడే వెళ్ళి ఇంద్రుడికి చెప్పేస్తాం. ఇకముందైనా బుద్ధికలిగి మసలుకో. తెలీని విషయాలు మాట్లాడకు" అన్నారు వాళ్లు.

"పోనీ, ఒక్క సలహా ఇవ్వండి. ఈ మునిసిపల్ ఎన్నికల్లో వోటు ఎటు వెయ్యమన్నారు. ఇప్పుడు కొత్త వార్డులు! మీకు తెలుసుననుకుంటా !"

"నీ వెధవ రాజకీయాలతో మాకు ప్రసక్తి లేదు. మేం మీ సమాజధర్మం తెలుసుకోవటానికి వచ్చాం. అటువంటిదేమీ కనిపించలేదు. పోతున్నాం. మీ జీవితం నరకకూపమల్లే చేసుకున్నారు. అందులోనే పొర్లండి!" అంటూ ఆ త్రిమూర్తులు అంతర్హితులైనారు. ఇదీ జరిగిన సంగతి. ఈ నా రహస్యం ఎట్లా బయటపడిందో నాకు తెలీదు. దేశభక్తులైన నా స్నేహితులు నన్ను పురుగును చూసినట్టు చూస్తున్నారు. నేను కాంగ్రెసు విరోధినని ఆ దేవతామూర్తుల ఎదట ప్రమాణం చేసినట్టు ఎట్లా బయటపడిందో నాకే తెలియటంలేదు. ఎంతో గండకత్తెర అయితేనే తప్ప నేనంత మహాపాతకం చేస్తానా ? ఇంతమాత్రంచేత నన్ను కాంగ్రెసు నుంచి బహిష్కరిస్తారా ? నా వంటి వాళ్ళకు స్థానంలేకుండా చేస్తే కాంగ్రెసు ఏమయేటట్టు ? మీరే ఆలోచించండి, న్యాయం చెప్పండి ? నా స్థానంలో ఉంటే మీరేం చేస్తారు?

# రెండో పాదం

ఏమన్నా అడిగితే కాస్త విమర్శగా చెబుతానని నన్ను చూస్తే మా రాఘవుడికి గురి. వాడోరోజున నన్ను బీచికి తీసుకుపోయి, కొంతకాలంగా వాణ్ణి బాధిస్తున్న సమస్య గురించి నా దగ్గిర ప్రస్తావన తెచ్చాడు.

"ఒరే అబ్బాయి, నాకు పెళ్ళికాదని ఒక బెంగ పట్టుకుందిరా !" అన్నాడు రాఘవుడు. కారణ మడిగాను.

"నా కిప్పుడు ఇరవై నాలుగో ఏడు. పదహారో ఏటే పెళ్ళి చెయ్యాలని మావాళ్ళు సంబంధాలూ అవీ ఆట్టే చూశారు. కాని నేను చేసుకోనంటే చేసుకోనన్నాను. పెళ్ళయితే చదువుసాగదనీ సంసారభారం మీద పడ్డనాడు చిత్తేననీ మనవాళ్ళంటూ ఉంటారు చూశావూ, ఆ మాటలన్నీ విని నాకు పెళ్ళంటే భయమేసింది. చెప్పొద్దూ! అందుకు అప్పట్లో పెళ్ళి ఎగ్గొట్టాను. బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా ఎందుకూ పనికిరాదని మా అమ్మ అప్పుడే అంటూ వచ్చింది. అది మటుకు నిజమైనట్టు కనిపిస్తున్నది." అన్నాడు రాఘవుడు.

"నీకేమీ భయమక్కర్లేదు. నీకేమీ వయసు మించి

పోలేదు. ఇప్పుడు యీడేరిన పిల్లలు ... కాలేజీల్లో చదువు కుంటున్నవాళ్ళు. బోలెడుమంది దొరుకుతారు'' అన్నాను.

"అక్కడే వచ్చింది చిక్కు!" "ఎందువల్ల ?"

ఇప్పుడు నాకు దొరికే మచ్చువాళ్ళని రోజూ బస్సుల్లోనూ, ట్రాముల్లోనూ, వీధివెంటా, బీచిలోనూ చూస్తున్నాను. కాని వాళ్ళల్లో నాకు భార్య కాదగినదీ, నా భార్య అయి నన్ను సుఖపెట్టగలుగుతుందనిపించేదీ ... ఒక్కతెకూడా కనబడదు. కొందరు చాలా అందంగాకూడా ఉంటారు, కాని వాళ్ళు నన్ను గురించి ఆలోచించేటందుకన్నా సిద్ధంగా ఉన్నట్లుండరు. నువ్వే ప్రపంచం అనుకోని ఆడది నీకు భార్యఅయి నిన్నేం సుఖపెడుతుంది చెప్పు !"

నేను రాఘవుడి రోగ నిర్ణయం చెయ్యకమునుపు మరొక ప్రశ్న వేశాను. నీకు చిన్నప్పుడే వివాహం అయి వుంటే ఈ ఇబ్బంది లేకపొయ్యేదనిపిస్తున్నదా ?"

"అనిపించడంలేదు. అటువంటి పెళ్ళి చేతికి సంకెళ్ళేగా. అది అనుకూల దాంపత్యం అయినా కాకపోయినా సహించవలసిందేగా ?"

"అయితే, అబ్బీ,నువ్వు రెండో పాదంలో వున్నావు" అన్నాను.

రాఘవుడు నావంక వింతగా చూసి "రెండోపాదం" అన్నాడు.

"కాస్త శ్రద్ధగా విను చెబుతాను. సంస్కారానికి చెందిన ప్రతి పరిణామానికి నాలుగు దశలు. సదుద్దేశాలూ,

విచిత్రిభావమూ, ఉన్నతాదర్శాలూనూ. రెండో దశలో, కళ్ళారా ధనా సౌందర్యపిపాసా, శిల్పమూ, వ్యక్తిత్వమూనూ; మూడో దశలో ప్రయోజనము, ప్రచారమూ, ఆర్థికదృష్టినీ; నాలుగో దశలో నిర్లిప్తతా, విమర్శనా దృష్టీ, వేదాంత వైఖరీ, విప్లవమూనూ, ఏ విషయంగాని నీకో సమస్య తగిలితే ఆ విషయంలో నీ సంస్కారం ఏ పాదంలో నడుస్తున్నదో తెలుసుకోవాలి. మాటవరసకు సాహిత్యం తీసుకో. ఇప్పటి భావ కవులను తీసుకో—"

"అబ్బ ! భావకవులను పోనిస్తూ !"

"అమ్మా! భావకవులంత సులభంగా పోరు, వాళ్లూ రెండో పాదం వాళ్లే. ఇప్పటి కుర్రకారు సాహిత్యాన్ని మూడో పాదానికి చేరబట్టటానికి చూస్తున్నారు. దీని రహస్యం రెండో పాదం వాళ్ళకు వచ్చినా అర్థంకాదు. సినిమా తీసుకో—"

"పోనీరా ! దాందుంప తెగిరి సినిమా;"

"సరే, నీ యిష్టం...నీ పెళ్ళి విషయమే తీసుకో.మా వంటి వాళ్ళు పెళ్ళి విషయంలో మొదటిపాదం వాళ్ళం. మాకు పెళ్ళి ఒక పవిత్రమైన విషయంగా వెళ్ళిపోయింది. అక్కడ మా వ్యక్తిత్వం అట్టే ప్రధానం కాలేదు. దాంపత్యములో ఒక శిల్పమూ, ఒక సౌందర్యమూ ఉండాలనే విశ్వాసం మాకు కలగలేదు. మొదటిపాదపు సంస్కారంలో స్వీకరించిన భార్యలతో మేమేదోవిధంగా కాలక్షేపం జేస్తున్నాం నువ్విప్పుడు రెండో పాదంలో పడ్డావు. అదే నీ సమస్య" అన్నాను.

"నాకేమీ అర్థంకావటంలేదు. నాకెందుకు సమస్య కలగాలి! మీకెందుకు కలగలేదు?"

"సంఘం స్థూలంగా మొదటి పాదానికి సంబంధించిన సంస్కారం పెళ్ళినిగురించి ఆలోచిస్తున్నది. కాని ఇప్పుడిప్పుడే నీ రకం రెండో పాదపు సంస్కారం కూడా ఇటువంటి పట్టణాల్లో తల ఎత్తుతున్నది."

"నన్నింతకూ ఏంచెయ్యమన్నావు? త్వరలో నాకు పెళ్ళవుతుందని నమ్మకం చిక్కకపోతే నేనే పిచ్చెత్తిపోతాను" అని రాఘవుడు నన్ను బెదిరించాడు.

"నువ్వు చెయ్యగలిగింది ఒక్కటే వుంది. నీకువివాహ యోగ్యమైన అమ్మాయిలు తటస్థపడినప్పుడు వాళ్ళ పరిచయం కష్టపడి సంపాదించి తద్వారా వాళ్లల్లో ఎవరన్నా నీకు సరిపడే మనిషి ఉందేమో చూసుకో. నీ గురికి కాస్త బెత్తెడు లోకి వచ్చేదాన్ని చూసుకుని దానిమీద నీ శక్తి యావత్తూ కేంద్రీకరించి అది నీ భార్య కావటానికి వీలయే మార్గం చూసుకో."

రాఘవుడు తల అడ్డంగా ఆడించి, "సలహా అయితే బాగానే ఉంది. గాని ఆచరణలో పెట్టటం అంత సులభంగా కనపట్టంలేదు" అన్నాడు.

"నీకు పెళ్ళి దిగులు తగుమాత్రం ఉంటే అదే సాధ్యమవుతుంది" అని సలహా చెప్పాను.

తరవాత నెల్లాళ్ళకేమో రాఘవుడు కనిపించి మంచి సలహా చెప్పినందుకు నన్నభినందించాడు.

"ఏమిటి కథ ? ఎవత్తె అయినా కనిపించిందా ?" అన్నాడు.

"కనిపించింది. నే నీ మధ్య ఇల్లు మార్చాలే. ఆ మార్చటంలో ఇప్పుడు ప్రవేశించిన ఇంట్లో మా పక్క భాగంలో ఒక కుటుంబం అద్దెకుంటున్నారు. ఆయన కూతురు—పాపం చిన్నప్పుడే భర్త పోయినాట్ట!— సేవా సదనంలో చదువుతున్నది. పేరు విశాలాక్షి. కాస్త చిన్న కళ్లయినా మనిషి అందంగానూ, ఆరోగ్యంగానూ ఉంటుంది. చాలా మంచిది కూడానూ. మొదట్లో పలకరించటానికి భయపడ్డాను గాని తీరా పలకరిస్తే బాగానే మాట్లాడింది. తల్లి తాలూకు ఆస్థి చాలా ఉందిట."

"ఇంకేం ? మరీ మంచిదీ !" అన్నాను.

రాఘవుడి కీ మాట కష్టం కలిగించినట్లు కనపడ్డది.

"నువ్వట్లా అంటున్నావు గాని ఆ దిక్కుమాలిన ఆస్థి నాకెంత ప్రతిబంధకంగా ఉందో నీకేం తెలుసు ? అంత ఆస్థి ఉన్నదాన్ని పెళ్లిచేసుకోమని ఎట్లా అడగను ? అడిగితే నాకు తనమీదే ప్రేమ ఉన్నదని ఎట్లా నమ్ముతుంది ? ఇంకెంత చిక్కో ఆలోచించు" అన్నాడు వాడు.

"నీ బుర్రతో ఆలోచిస్తే పెద్ద చిక్కే"

"కాని నేను విశాలక్షిని నమ్మిస్తానని నాకు ధైర్యం ఉన్నది."

"అబ్బా! నన్నడిగితే నువ్వా విషయం అట్టే విచారించవలసిన పనే లేదంటాను. రేపా పిల్ల ఇంకో భర్తకోసం

వెతికేటప్పుడు కూడా తన ఆస్తి ఆశపెట్టి కాస్త మంచివాణ్ణి తెచ్చుకోవాలని చూడదంటావా ?"

"నేనదే కూడదని గట్టిగా చెబుతున్నాను."

"ఆ పిల్లతోనే ?"

"కాదు పిల్ల తండ్రితో, ఆయన అప్పుడప్పుడూ నాతో, 'మా పిల్లకు మంచి సంబంధం ఉంటే చూడు పంతులూ,' అంటాడు. 'ఇంత ఈడు వచ్చి, ఇప్పటికాలపు చదువు చదివే పిల్లను ఎరగనివాణ్ణి తెచ్చి కడతారుటండీ ? ఎరిగిన వాళ్ళలోనే విశాలాక్షికి మంచి మొగుడయ్యేవాణ్ణిగా చూచి చేసేయ్యండి,' అని సలహా ఇస్తాను."

"ఆయన నీ సలహా వినే ధోరణిలో ఉన్నాడా ?"

"ఆయన దేముందిలే ! అంతా విశాలాక్షి మీద ఉంది."

"నాకాడ వాళ్ళ సంగతి చెప్పకు. ఆడవాళ్లు సంస్కారం విషయంలో ఏ పాదంలో ఉన్నదీ మనకు చచ్చినా తెలీదు."

"విశాలాక్షి అటువంటిది కాదు. చదువుకుంటున్నది. అనేక విషయాలను గురించి నీవూ నేనూ ఆలోచించినట్టు ఆలోచించగలదు."

"అదేమో నీకే తెలియాలి."

"ఇంకా విశాలక్షి తండ్రే ఏ పాదంలోనూ లేనివాడు"

"అట్లా అనకు. ఆయన మూడో పాదంలో ఉన్నట్టు నాకు సందేహంగా ఉంది."

"అంటే ?"

"అంటే ఏమిటో నువ్వే ఆలోచించు"

మళ్ళా రెండు మూడు నెల్లదాకా నాకు రాఘవుడు తటస్థపళ్ళేదు. కేవలమూ ప్రమాణవశాన వాడూ నేనూ బస్సులో కలుసుకున్నప్పుడు "ఏంరా, రాఘవా, ఏమిటి కబుర్లు?" అన్నాను. రాఘవుడు మొహం చిట్లించి "ఏమీ లేవు" అన్నాడు.

ఏదో వుందని నాకు వెంటనే అర్థమయింది. వాణ్ణి అటునించి అటే బీచిదాకీ పట్టించి ఇసకలో కూచోబెట్టి విషయం బయటికి లాగాను.

వాడికీ విశాలాక్షికీ చెడింది. ఎబ్బే, పోట్లాట ఏమీ లేదు. వాడే ఆ పిల్లతో మాట్లాట్టం మానేశాడు. కారణమా? ఓరోజు, రాఘవుడు ఇంట్లో వుండగానే ఎవరో విశాలాక్షిని చేసుకుంటామని వచ్చాడు.

ముప్పై దాటినవాడు. చూడటానికి దిష్టిపిడతల్లే వున్నాడని మా రాఘవుడు వర్ణించాడు. అయితే అట్టహాసంగా సిల్కు సూటూ అదీ వేసుకున్నాడు. నూరు రూపాయల ఉద్యోగం చేస్తున్నాడు. ఎక్కడో చీరాలలో ఒక ఇల్లున్నదిట గాని ఆస్తి ఏమీ లేదు.

"ఆ సంబంధాన్ని విశాలాక్షి తిప్పేసింది. ఎందుకో తెలుసా?" అన్నాడు రాఘవుడు తన ఆగ్రహమంతా ప్రశ్నార్థకంతో చూపిస్తూ.

"ఎందుకు?"

"వాడికి ఆస్తిలేదని !...ఆస్తిలేదని ! ఇంకెందుకూ కాదు ! మనిషి అసహ్యంగా వున్నాడని కాదు ! రెండో పెళ్ళివాడనికాదు ! వయస్సెక్కువనీ కాదు ! ఆస్తిలేదని.ఆస్తి వుంటే తను ఎరగని వాణ్ణి పెళ్ళి చేసుకోవటానికి సిద్ధంగా వుందన్నమాట !"

"అట్లా అనకులే అప్పుడింకే అభ్యంతరం చెప్పేదో!"

"నువ్వట్లా విశాలాక్షిని వెనకేసుకురాకు. ఆమాటలు చెవులారా విన్నవాణ్ణి నేను. ఇటువంటి దానిమీద నిష్కారణంగా ఎంత అభిమానం వృథా చేశానూ!"

"నిన్ను పెళ్ళి చేసుకుంటుందేమో అడిగిచూడూ!"

"నాకా మనిషితో మాట్లాడ్డమే అసహ్యంగా ఉంటే పెళ్ళి చేసుకోమని అడిగేదీ ? నీపుణ్యమాయిరి. నాకటువంటి పెళ్లాం అక్కర్లేదు. అటువంటి దాన్ని చేసుకునేకన్న బతికున్నన్నాళ్లు బ్రహ్మచారిగానన్నా వుంటాను"

"ఆ మాటమీద వుండలేవు. బలవంతాన ఉంటే పశ్చాత్తాప పడతావు. నీకు పెళ్ళి చాలా అవసరమల్లేనే కనుపిస్తుంది"

"అంతగా అయితే ఓపని చేస్తాను.ఎట్లాగో పెళ్ళంటే లాటరీ అని పెద్దలు చెప్పనే చెబుతున్నారు. పత్రికల్లో వరుడు కావాలని చేసే ప్రకటనల్లో ఏదో ఒకటి వీలయినదిగా చూసి అప్లయి చేసేస్తాను. పీడ వదిలిపోతుంది"

"అది మూడో పాదపద్ధతి"

"నీ పాదాలూ హస్తాలూ అవతలపెట్టు.నాకు వాటిల్లో విశ్వాసం పోయింది"

"అవి ఒక చెంప రుజువవుతుంటేనే?" అన్నాను. కాని రాఘవుడు నామాట వినేఏత్తులో లేడు.

ఇది జరిగిన వారం రోజులకే వాడు నాతో శుభవార్త చెప్పేశాడు. వరుడు కావాలని పత్రికలో కనిపించిన ప్రకటన చూసి దానికా్కాస్తా దరఖాస్తు పెట్టి ఊరుకున్నాడు. ఆ ప్రకటన కూడా నాకు చూపించాడు.

"ఈ ప్రకటన సరిగా మా .విశాలాక్షి వంటి దాని కోసమే పెట్టినట్టున్నది గమనించావా?" అన్నాను.

వాడు గమనించలేదు గాని "మరీ మంచిది. చెప్పు తీసుకొ్కట్టి నట్టవుతుంది. ఈ సంబంధం నేను చేసుకుంటే!" అన్నాడు.

అంతే! వాడు నాకు మళ్ళా మొన్నటివరకు కనిపించలేదు.

మొన్న కనిపించినప్పుడు "ఏంరా, రాఘవా? ఏమయింది నీపెళ్ళి దరఖాస్తు?" అన్నాను.

రాఘవుడు పెదిమ కొరుక్కుని "అది విశాలాక్షి తండ్రి చేసిన ప్రకటనే!" అన్నాడు.



## + [redacted] మిత్రద్రోహం

నాకేదో యింత భగవంతుడిచ్చాడు. నేను జైలుకి వెళ్ళినవాణ్ణి కాకపోయినా నా కొడుకులిద్దరూ ప్రభుత్వోద్యోగాలు చేసుకుంటున్నారు. వెనక దొరల ప్రభుత్వంలో ఎంత శ్రద్ధగా తమపని చేసుకొనిపోయినారో ఇప్పుడు మన కాంగ్రెసువాళ్ళ కిందకూడా అంత శ్రద్ధగానూ ఉంటున్నారు. ఇళ్ళ అద్దెలమీద, పొలంమీద నాకేదో ఏటా రెండు మూడువేలు వస్తుంది. అందుచేత నాకు ఇహ చింత లేదు. నేనేమో నా భగవధ్యానమేమో !

అందుచేత నాకు సీతారామస్వామి ఎక్కువాలేదు. రఘుపతి తక్కువాలేదు. ఇద్దరూ నాకు కావలసినవాళ్ళే. వాళ్ళిద్దరికీ చెడ్డదంటే, మీరు నమ్మరుగానీ నేనెంతో ఖేదించానన్నమాట.

మేము ముగ్గురమూ విడవకుండా తిరిగేవాళ్ళం. అదేం చిత్రమో, ప్రపంచం మంచి ఎక్కడవున్నా సహించలేదుగద. మేము ముగ్గురమూ కలిసి తిరిగితేనే మా సహాధ్యాయులు సహించలేకపోయారు. మమ్మల్ని విడగొట్టటానికి ఎన్ని ప్రయత్నాలు చేశారు. రఘుపతితో అనేవాళ్లుగదా "ఒరే,

నీతో కలిసి చదవకపోతే స్వామికి ఇంగ్లీషులోనూ, లెక్క ల్లోనూ సున్నాయే. అటువంటి వాడితోకన్నా మరెవరైనా ఇంకా తెలివిగలవాడితో కలిస్తే ఇంకా మార్కులు ఎక్కువ వస్తాయిరా !" అనేవాళ్ళు. రఘుపతి తండ్రి తద్దినాలు పెట్ట డనీ, వితంతు వివాహాలు జరిగితే వెళతాడనీ నాతో చెప్పే వాళ్ళు. నేనూ, రఘుపతీ వెళ్ళి రాత్రిపూట స్వామి ఇంట్లో చదువుకుని కిరసనాయిలు ఆదా చేస్తున్నామనికూడా అన్నా రనుకోండి.

అయినా మేం చీలిపోలేదు. మాది అంత మంచి స్నేహం. నేను చదువు మానేసినాకకూడా వాళ్ళిద్దరూ బి.ఎ. దాకా కలిసి నెట్టారు. వాళ్ళిద్దరూ పాసయితే నేనుకూడా బియ్యే పాసయినట్టే సంతోషించాననుకోండి. మాది అటు వంటి స్నేహం.

కావటానికి మాలో స్వామి కాస్త ధనికుడే. రఘుపతి కూడా నాకంటె యింత కలవాడే. అయితే మాలోమేం అటువంటి పట్టింపులెప్పుడూ కలవాళ్ళంకాం. ఇంత కాలానికి రఘుపతి,స్వామి కలిమిచూచి అసూయ పడుతున్నాడనుకోవ డానికి నాకేమాత్రమూ మనస్కరించలేదు. కాని స్వామి మీద రఘుపతిచేసే దుష్ప్రచారానికి మరే ఆధారం ఉండ దనుకోవాలి.

స్వామి దాదాపు రెండులక్షలు చేసుకున్నాడంటే నిజంగా సంతోషించవలసిన వాళ్ళలో నేనూ రఘుపతి మొదటివాళ్ళం. నేను సంతోషించాను. రఘుపతి మరొక లాగా మాట్లాడ నవసరమేముందీ ?

పోనీ స్వామి కూడనిపని ఏమన్నా చేశాడు గనకనా? చేనేత గుడ్డల వ్యాపారం చేసుకున్నాడు. అతను చేసిన పెట్టుబడి పదివేలే అయినా రోజులు కలిసిరావటంవల్ల అంతకు ఏడింతలు లాభించింది. ఏ రకమన్న తరవాత లాభాలే ఉంటాయనేమిటి ? రఘుపతికూడా చేనేత గుడ్డల వ్యాపారం చేసినవాడేగా. ఎందుకు నష్టపడ్డాడూ ? తనకు నష్టం వచ్చిందిగనక లాభం వచ్చినందుకు స్వామిని ఆడిపొయ్యటం ఏం సబబుగా వుందీ ?

నన్నడిగితే డబ్బుకన్న పాపిష్టిదిలేదు. దరిద్రులే సంఘానికి శత్రువులు. పాకీవాళ్ళు చూడండి. కార్మికులు చూడండి. రైతుకూలీలు చూడండి. వీళ్ళు మనకు తెచ్చే అగచాట్లకు అంతంటూవుందా ? హత్యలూ, దొంగతనాలూ, దోపిడీలూ చేసేది ఎవరు ? రఘుపతి యివ్వాళ దరిద్రుల జాబితాలో చేరాడు. అందుచేత అతను ఏమన్నా నా కాశ్చర్యంలేదు. డబ్బు పాపిష్టిది !

ఇద్దరూ ఒకే వ్యాపారం చేస్తే చేశారు. కలిసి చెయ్యకుండా ఎవరి దారిని వాళ్ళు చేసుకుంటే అదెట్లావుండేదో, రఘుపతివెళ్ళి స్వామితో ఎందుకు కలవటం ? తన గుడ్డల కొట్టేమో, తానేమో అన్నట్టుంటే ఏ పేచీ లేకపొయ్యేదిగా ? స్వామికి పెట్టుబడి చాలనిమాట నిజమేననుకొందాము. అంత చాలకపోతే వున్నదానివిూద రాబడితో తృప్తిపడేవాడో, ఎక్కడైనా తల తాకట్టుపెట్టి తెచ్చుకునే వాడో, రఘుపతికెందుకూ ? డబ్బు దగ్గిరనా స్నేహితాలు?

తనుకూడా స్వామికి పదివేలిచ్చాడు. స్వామి తయారుచేయించే బట్టలు జిల్లా అంతటా తానే అమ్మి లాభాలు తీద్దామని ఆశ పడ్డాడు. రఘుపతి యిచ్చిన డబ్బు స్వామి తన వ్యాపారంలో పెట్టుబడి చేసుకున్నాడు. దానివల్ల వ్యాపారం బాగా సాగిందికూడాను. సాగినంత కాలమూ రఘుపతి వ్యాపారం కూడా బాగానే సాగింది. స్వామి రఘుపతికి ఒక్కడికే రెండు మూడు లక్షల రూపాయలగుడ్డ అందించాడు. రఘుపతి ఆ డబ్బంతా ఎప్పటికప్పుడు స్వామికి పంపుతూ వచ్చాడనుకోండి. దానివల్ల తన వ్యాపారమే పెంచుకున్నాడు. కాని స్వామికి ఒరగబెట్టిందేముంది. నేతగుడ్డకి ధరలు పడిపోతాయని ముందుగానే తెలుసుకుని స్వామి వ్యాపారం ముగించుకుని దీపం వుండగా ఇల్లు చక్కబెట్టుకున్నాడు. రఘుపతి కా అవకాశం లేకపోయింది. పదివేలరూపాయల గుడ్డ అతని దగ్గిర మిగిలిపోయింది. దానిక్కూడా యిప్పుడు ధర పడిపోయిందనుకోండి. దాని కెవరేం చేస్తారు ?

ఇద్దరూ కలిసి అయిదారేళ్ళు వ్యాపారం చేశారు గదా, ఇప్పుడు తీరా వ్యాపారం అయిపోయినాక తనను ముంచాడని స్వామిని గురించి రఘుపతి ప్రచారం చెయ్యటం ఏమైనా బాగుందా ? అవును స్వామికి వ్యాపారం కలిసి వచ్చింది. రాహు మహాదశ ఆరంభంకాగానే అతనికి సిరి ఎత్తుకుంటుందని రాసిపెట్టివుంది. "తనతో సమంగా నేనూ పెట్టుబడిచేశాను. తన లాభాలలో నాకు దమ్మిడీ యివ్వలేదు ?" అంటాడు రఘుపతి. "రఘుపతి నా చేతికిచ్చిన ప్రతిదమ్మిడీకి

లెక్క నాదగ్గరనే వుంది. అంతకీ నేను గుడ్డ అందిస్తూనే వచ్చాను.” అంటాడు స్వామి.

రఘుపతి యింకా అసందర్భాలు చాలా చెబుతాడనుకోండి. నేతగుడ్డలో ముతకరకం వేలకువేల సరకు ఖద్దరుకింద బొంబాయికి స్వామి ఎగుమతి చేశాట్ట. దానిమీద చాలా లాభాలు తిన్నాట్ట. తనకు తెలియకుండా తనమీదపోటీకి చౌకగా మాజిల్లాలోనే యింకా యితరులకు స్వామి గుడ్డ అమ్మాట్ట. చేనేత వ్యాపారంమీద లాభాలతో స్వామి ఇంకా అనేక వ్యాపారాలు చేశాట్ట. స్వామి తన వ్యాపారం మానలేదని, ఇప్పుడు చేనేతగుడ్డ ఎగుమతికి ప్రయత్నాలు సాగిస్తున్నాడని తన బంధువు లందరిపేరా వ్యాపారం పంచి ఏవో తంత్రాలన్నీ పన్నుతున్నాడని, ఇదంతా తనను మోసగించటానికేనని కూడా రఘుపతి చెబుతున్నాడు. ఈమాట లన్నిటికీ ఎక్కడికి ? ఇందులో వ్యాపారపు కిటుకు లెన్నివుంటాయో నాబోటివానికేం తెలుస్తుంది ?

స్వామి పెద్దమనిషి. అతను రఘుపతి వ్యాపారం చెడిపోయినందుకు చాలా విచారిస్తున్నాడని నేను చెప్పగలను. చేసుకోవటం చేతరాక, పనికిమాలిన గుడ్డ యావత్తూ తన దగ్గర పేర బెట్టుకున్నాడని, అంతా అమ్ముకుని వుంటే రఘుపతి నష్టపడేవాడుకాడని ఆపత్సమయంలో అతను తననేమైనా అంటే అంతమాత్రంచేత తను ఏమీ అనుకోబోవటంలేదని, ఇప్పటికైనా అతను జారిపోకుండా నిలబడితే చక్కగా వ్యాపారంమాట చూచుకోవచ్చునని స్వామి నాతో అన్నాడు. స్వామికి గొప్ప గొప్ప వాళ్ళ దగ్గిర చాలా పలుకు

బడి ఉంది. అతని ఇంటిదగ్గిర రోజూ కవులూ, రాజకీయ వేత్తలూ, పండితులూ, ఇతరులూ చేరటం నేను కళ్లారా చూచాను అతను చేసే దానాలకి అంతే లేదనుకోండి. వెధవది ఏ కమ్యూనిస్టులో స్వామిని అనవలసిన మాటలు రఘుపతే అంటున్నాడం టే అతన్ని గురించి పెద్దమనుషు లేమనుకుంటారో నాకు బోధపడకుండా ఉంది !

ఎన్నయినా చెప్పండి. డబ్బు చాలా పాపిష్టిది. అది యుక్తాయుక్తాలు కూడా తెలియనివ్వదు.



# హోటలు పరిచయుడు

నేనూ, నాదెళ్లా, మద్దూరీ, పంచాంగమూ ఆ అరవ హోటల్లో భోంచేస్తూ ఉండేవాళ్లం. పంచాంగం మటుకు హోటల్లోనే గది తీసుకుని ఉండేవాడు. మా ఆదివారాలూ శెలవ రోజులూ అక్కడే గడిచిపోతూండేవి. కారణమేమంటే హోటలు కుర్రాణ్ని కేకేసినప్పుడల్లా కావలసిన కాఫీ పట్టుకొస్తూండేవాడు. వెళ్లేటప్పుడు తలా ఒక అణా బేడా వాడి చేతిలో పెట్టేవాళ్లం. కాఫీ ఖర్చు మటుకు పంచాంగం వాడి ఖాతాలో పడేది.

అదే ముఖ్యమైన విషయం. ఆ రోజుల్లో మేం ఆ విధంగా జీవించేవాళ్ళం—సాధ్యమైనంతవరకు మా ఖర్చు మరెవడి మీదనైనా వేస్తూ. అదే మామూలు మనుష్యులు చేస్తే అది నీచత్వం అనిపించుకోవచ్చు, మరేమన్నా అనిపించుకోవచ్చు. కాని మాకది ఒక జీవిత లక్ష్యం, ఒక పరమార్థం. ఆ విధంగా జీవించి డబ్బులు వెనకేసి కొంపలు కట్టదామని కాదు. అందులో నిజంగా పైకి కనిపించేటంత తప్పేమీ లేదు. అందరూ ఆ విధంగా జీవించడం మొదలుపెడితే లేని వాడిక్కూడా కలవాడితోపాటు జీవించే అవకాశం వొస్తుందని మాకో గట్టి విశ్వాసం. అట్లా జీవించటంవల్ల మనుషుల

మధ్య సాంఘిక సంపర్కం జాస్తి అవుతుందని మాకో నమ్మకం కూడా ఉండేది... ఒకవేళ అటువంటి ప్రవర్తనలో ఏ మాత్రం తప్పుగాని ఉంటే, అప్రయత్నంగా అందరూ చెయ్యటానికి ప్రయత్నించే పనే గనక, అటువంటివి ప్రయత్నపూర్వకంగా సిద్ధాంతరీత్యా చెయ్యటం వల్ల దానికి కొంత సంస్కారం ఆపాదించుకుంటుందని మా ఆశ.

నిజానికి జీవితంలో గాని మనుష్యుల్లోగాని మంచి అంటూ అట్టే ఉందనే నమ్మకం మాలో ఎవరికీ లేదు. పెళ్లిళ్ళలో అల్లుళ్ళు అలగటంలోనూ, ఆడబిడ్డలు అన్నదమ్ముల దగ్గర్నుంచి వస్తు వాహనాలు రాబట్టుకోవటంలోనూ, అక్కరలయినప్పుడు చుట్టపక్కాలొచ్చి పడి తినికొంచెం లోటొస్తే చెడ తిట్టిపోవటంలోనూ మాకేమీ సంస్కారం కనిపించ లేదు. కాని సంఘములో అటువంటివి ఉంటూనే ఉన్నై. మాలో మేం సినిమా కెళ్లాలనుకున్నా, కాఫీహోటలు కెళదామనుకున్నా ఎవడో ఒకడికి జరిమానా విధించటంలో అంతకన్న ఎక్కువ సంస్కార మేఉన్నట్టుకనిపించింది. లేనివాడి దగ్గర డబ్బు ఎట్లాగూ వసూలు చెయ్యలేం. ఇవాళ ఫైను చెల్లించుకున్న వాడు రేపు తనవంతు వచ్చినప్పుడు మరొకడిచేత చెల్లింపజేస్తాడు. కేవలమూ సాంస్కారికమైన ఒత్తిడేకాని సాంఘికమైన ఒత్తిడి కాదు. ఫైను వేసుకునే తాహతు ఉండి కూడా స్వార్థంకొద్దీ తప్పించుకోజూసినవాడు మా సాంగత్యానికి దూరమైపోతాడు ! వాడి కదే శిక్ష !

మమ్మల్ని చూసి చాలామంది భయపడేవాళ్లు. నాకు

రాంబందులనీ, తోడేళ్ళనీ, అప్పులవాళ్ళనీ, బాకీదార్లనీ ఇంగ్లీషులోనూ తెలుగులోనూ కూడా నామకరణం చేశారు. ఆ నామకరణాలన్నీ మేం బిరుదుల కింద స్వీకరించాం. మేం చాలా ఘనులమని అనుకునేవాళ్ళం.

ఈ సిద్ధాంతం మా తలకాయల్లో క్రమ క్రమంగా ఒక స్వరూపం దాల్చింది. దీనికి ఆ స్వరూపం ఇవ్వటానికి బుర్రతో విశేషంగా పనిచేసినవాణ్ణి నేనే. అయితే మిగిలిన ముగ్గురూ సంపూర్ణంగా ఆమోదించారు. ఆ విధంగా అది మా ఉమ్మడి సిద్ధాంతమయింది.

* * *

ఆ హోటలుకు ఒక కొత్త మనిషి రాసాగాడు. అతను తెలుగువాడని తెలుస్తూనే ఉంది. కాని, నలుగురం సాటి వాళ్ళం గట్టిగా మాతృభాషలో అరుస్తూ, వడ్డించేవాళ్ళకి తెలుగు నేర్పుతూ సందడిగా భోంచేస్తున్నా కూడా, అతను మాకేసి చూడనైనా లేదు. పొడి అరవం ముక్కల్తో పని కానిచ్చుకుని భోంచెయ్యసాగాడు.

అతను భోంచేసే వైఖరి చూస్తే మాకు చాలా "బూర్జువా"గా కనిపించింది. (ఆ రోజుల్లో మా సిద్ధాంతాలకు భిన్నంగా ఉన్నదల్లా మాకు బూర్జువాగా కనిపించేది.) అతను భోంచేస్తూ నెయ్యి వడ్డించేటప్పుడు చాలుననేవాడు. వడ్డించేవాడు వేసేదే రెండు గరిటెలు. ఎక్కువ కావలసినా ఎక్స్ట్రా ఇస్తే తప్ప ఒక్క చుక్కయినా రాల్చడు. అది అందరికీ తెలుసు. అటువంటప్పుడు చాలునని చెయ్యివిసిరి కష్టం పెట్ట

టం బూర్జువా కాదూ ? పైగా ఒకరోజూ, రెండు రోజులా ? రోజూ, రెండు పూట్లా ఇదే వరస. అతను అత్తవారింట అల్లుడు లాగా భోజనం చేస్తూంటే అతని "మర్యాద" చూసి మొదట మాకు వేళాకోళంగా ఉండేది. అది రాను రాను తృణీకార భావం కిందికి మారింది.

"వీడికి ఫైను వెయ్యాల్సిందేరా!" అన్నాడు మద్దూరి.

"ముందు వీడి పరిచయం చేసుకుందాం పట్టండి," అన్నాడు నాదెళ్ల.

ఓ రాత్రి భోజనానంతరం అతన్ని పలకరించి పంచాంగం వాడి గదికి తీసుకుపోయి అక్కడ అతని ఆరా కొంత తీశాం. అతని మాటల తీరులో కూడా ఆ మర్యాదా లోభత్వం కనిపించింది. మా అందరి దగ్గరా తలా కాస్త గౌరవం సంపాదించి చంకన పెట్టుకుపోదామని అతని ఉద్దేశం! ఫైను తప్పక వెయ్యాల్సిందే.

ఆ పూటకి అతనిచేత కిల్లీలూ సిగరెట్లూ కొనిపించి ఫైను వేశాం. తీరా చూస్తే అతను కిల్లీ వెయ్యడు, సిగిరెట్టు ముట్టడు, కాని ఫైను చెల్లించాడు— సంతోషంతోనే.

"మా పద్ధతులు మీకు కాస్త విపరీతంగా తోస్తా యేమో. కాని వాళ్ళకి ఫైను వెయ్యటం మేము తప్పుగా భావించం. మమ్మల్ని మీరుకూడా వెయ్యొచ్చు. ఉన్నవాడూ లేనివాడూ దాదాపు ఒకే విధంగా బతకటానికిది మంచి పద్ధతని మేం తేల్చుకున్నాం," అన్నాడు నాదెళ్ళ.

"మీరు మార్క్సు పుస్తకాలు చదివారా ఏం?" అన్నాడతను.

మా సంస్కారమంతా మంట గలిపి మమ్మల్ని క్రామేడులకింద జమకడుతున్నందుకు నాకు కోపం వచ్చింది.

"మే మటువంటి చెత్త చదవం, మీరు చదవకండి" అన్నాం.

"మీరొకవేళ సోషలిస్టులేమోఅనుకున్నాను"అన్నాడతను.

"ఎంతమాట! కావలిస్తే మాది కల్చరల్ కమ్యూనిజం అనండి" అన్నాం.

"మీ కల్చరల్ కమ్యూనిజం డబ్బుతోకూడా ఉన్నట్లు కనిపిస్తుంది?" అన్నాడతను.

"డబ్బుకు మేం తక్కువ స్థానం ఇస్తాం. సంస్కారం ముందొస్తుంది."

"అదా విషయం?..., సెలవు. మళ్ళీ కలుస్తాను."

* * *

ఆ రోజు లగాయతు అతనికి ఫైనులుతగిలిస్తూవచ్చాం. అతనెక్కడా వెనకాడలేదు. కాని అతను మాకు ఫైను వేసిన పాపాన పోలేదు. మా నలుగురిలో ఒకరికొకరు ఫైనులువేసుకోవటం చాలా తగ్గిపోయింది. అందరి దగ్గరా డబ్బు కనిపిస్తున్నది, ఏదో తారీఖు దాటిన తరువాత కూడా.

ఎప్పుడన్నా దారి తప్పి మాలో మేం ఏ సినిమా ప్రోగ్రాంగానీ పెట్టుకున్నప్పుడు మా కొత్తస్నేహితుణ్ణిపిలవాలనే ఆలోచన మాకు కలిగేది కాదు.

నా సిద్ధాంతానికి అపాయం కలుగుతున్నట్టు కనిపించి నేనే కొంచెం సణగసాగాను. అతన్నికూడా మావెంట పిలవటం సంస్కారరీత్యా అవసరంగా కనిపించింది.

"ఎందుకులేరా? పోనిస్తూ! వెధవ సినిమాకు అతను కావాలంటే పోలేడా? డబ్బున్నవాడల్లేనే ఉన్నాడులే. ఎందుకొచ్చినఖర్చు? సిగరెట్లన్నా తగలెయ్యొచ్చు," అన్నారు నాతోటి సహాధ్యాయులు. నాకుమండిపోయి "మనం సోషలిస్టులమా?" అని అడిగాను.

"ఎంతైనా మాత్రముకాము. అయితేమటుకు డబ్బు వృథాగా తగలెయ్యాలా ఏమిటి?" అన్నారు వాళ్ళు.

నేనారోజు వాళ్ళవెంట సినిమాకు వెళ్ళలేదు.

"మరోతొమ్మిదణాలు ఆదా!" అన్నారు వాళ్ళు నా మొహానే!

నేను చాటుగా మాహోటలు స్నేహితుడితో పరిచయం ప్రారంభించాను.

"మీరు మాకోసం డబ్బెందుకు ఖర్చుచేస్తున్నారు? మేం డబ్బుకోసం మీవెంటపడటంలేదని మీకెట్లా తెలుసు?" అన్నానొకసారి.

"డబ్బుకోసమే నావెంట పడుతున్నారు. కాదని నేనెప్పుడు అనుకోలేదే" అన్నాడతను.

నాకు కోపంవచ్చింది. కాని దాన్ని ప్రకటించేందుకు నాకర్హత ఉన్నట్లు కనిపించలేదు.

"అయితే మరెందుకు ఖర్చు చేస్తున్నారు?"

"డబ్బుకోసం వెంటపడుతున్నారు గనక డబ్బిస్తు న్నాను. డబ్బక్కర్లేని వాళ్ళకి డబ్బిచ్చి ఏంలాభం ?"

"డబ్బు అందరికీ యిస్తారా ? అంత డబ్బుందా మీ దగ్గర ?"

"లేదు, కాని ముందు డబ్బిచ్చి తరవాత సంస్కారం కూడా ఇద్దామనే !"

"మాకు సంస్కారం లేదా ?"

"అవసరమైన సంస్కారం లేదు."

"ఏమిటా సంస్కారం ?"

"సంస్కారంకన్న డబ్బే ప్రధానమయి పన జ్ఞానం. మీరు సంస్కారంకోసం దేవులాడుతూంటే మీచేతికి డబ్బే దొరుకుతున్నది. మీచేత డబ్బుకోసం దేవులాట ఆరంభింప చేసి సంస్కారం ఇప్పింతామని నాకు ఆలోచన కలిగింది"

నా కనుమానం వేసింది.

"మీరు మార్క్సు పుస్తకాలుగాని చదవలేదు గదా ?

"కొద్దిగా చదివాను"

"సోషలిస్టే?"

"కొంతవరకు"

హతాశుణ్ణయిపోయినాను.

"మాచేత ఏం చేయింతామని మీ ఉద్దేశం ?"

"పొలం దున్నింతామని"

"పొలం దున్నించటమే ? ఎక్కడ ?"

"భద్రాచలం దగ్గర నూరెకరాలు కొన్నాను. అక్కడి మనుష్యుల్ని పెట్టి అంతా నేనే చేయించగలను. కాని ఇక్కడ డబ్బుకోసం అగచాట్లుపడే చదువుకున్నవాళ్ళని పట్టుకెళ్ళి వాళ్ళు చేయగలిగినంత భూమి ఇచ్చేసి ఒక కాలనీ ఏర్పరచాలనుకున్నాను. హాయిగా తిన్నది అరిగేట్టు పని చేసుకోవచ్చు. కూలీలతో సరిసమానంగా జీవించవచ్చు. వాళ్ళకి సంస్కారం ఇవ్వొచ్చు. వాళ్ళుకూడా మనంత వాళ్ళుగా పరిణమిస్తుంటే ఆ పరిణామం చూసి ఆనందించవచ్చు. వాళ్ళని మనం దోచకుండా వుంటే వాళ్ళు మనకన్నా సంపాదనల్లో ఎంత ముందుకు పోతారో తెలుసుకోవచ్చు. ఇదంతా సంస్కారమూ, అనుభవమూ కాదా ?" అన్నాడతను.

"అంతదూరం వెళ్ళి కాయకష్టంపడేకన్న ఇక్కడే తేలిక ఉద్యోగాలు సంపాదించి హాయిగా పుస్తకాలు చదువుకుంటే——" అని ప్రారంభించాను.

"తేరగా డబ్బొస్తుంటే సంస్కారం రాదు, గమనించేవుంటారు. పుస్తకాలు ఎన్నటికీ అనుభవంకాదు... ఏమిటి, వస్తారా ? మీ స్నేహితులకూడా చెప్పండి, ఆహ్వానించానని. కానీ పెట్టుబడిలేదు చేసుకున్నంత భూమి యిస్తాను. వాళ్ళకి డబ్బుమీద ఇష్టంలేక నా ఆహ్వానం రుచించక పోవచ్చు. అయినా చెప్పి చూడండి" అన్నాడు.

"చెబుతానులెండి... నామటుకు నేను... ఇంకా కనీసం రెండేళ్ళవరకూ ఇంటిపట్టున ఉండి——ఏదీ?" అన్నాను.

"మీ యిష్టం" అన్నాడతను.

అంతే! మళ్ళా నాకా గొడవే జ్ఞాపకంలేదు. ఇప్పుడిదంతా ఎందుకు జ్ఞాపకం వచ్చిందంటే ఈ మధ్య నేను మద్దూరి వాడికి ఓ పాతిక పంపించరా అని రాస్తే లేదని సమాధానం రాసి, ఆ మర్నాడే కొత్తమేడకు పునాది తవ్వించటం మొదలుపెట్టాడు. నా షూటలు స్నేహితుడి కన్నా రాద్దామంటే అతని పేరే జ్ఞాపకంలేదు. కాకపోయినా ఈ యుద్ధం రోజుల్లో నాలుగెకరాలన్నా లేని నాబోటివాడికి మరీ ఇబ్బందిగా వుంది. రెండెకరాలున్న వాళ్ళుకూడా గొప్పవాళ్ళయి కూర్చున్నారు మరీనూ!

---

## ఆదర్శ ప్రభువు

దిబ్బరాజ్య పూర్వచరిత్ర గురించి నేను పరిశోధనలు చేస్తున్నట్టు తెలిసిన మిత్రులు కొందరు నన్ను ఒక పెద్దమనిషిని కలుసుకోమని సలహా ఇచ్చారు.ఆయనకు తెలిసిన దిబ్బ చరిత్ర ప్రపంచంలో మరెవరికీ తెలియదని విన్నాను. కాని ఆయన ఆ చరిత్రను ప్రపంచానికి ఎందుకు అందజేయలేదో నాకర్థం కాలేదు.

నేను వీలు చేసుకుని ఆ పెద్దమనిషి దగ్గిరికి వెళ్లాను. (ఈ మనిషి పేరు నేనిక్కడ బయటపెట్టక పోవటానికి కారణం ఆయన అలా కోరి వుండటమే). ఆయన చూడటానికే ఎనిమిదో శతాబ్దపు శాసనం రేకులాగా వున్నాడు. ఆయన ఇల్లు తాళపత్ర గ్రంథాల వాసన. దీనికి కారణం ఇంటినిండా తాళపత్ర గ్రంథాలే.

ఆయనకు నన్ను నేను ఎరుకపరుచుకున్న తరవాత "తమకు దిబ్బ చరిత్ర ఆమూలాగ్రం తెలుసునని విన్నాను. అది గ్రంథరూపంలో ఎందుకు ప్రచురించారుకాదు ?" అని నేనాయన నడిగాను.

గదినిండా తోక్కితే ఊరే తాళపత్రి గ్రంథాలు చూపి "ఇదంతా దిబ్బచరిత్రే. 67 తరాలుగా మావాళ్ళు తమకు తెలిసిన చరిత్ర యావత్తూ రాసిపెట్టారు. నేను ప్రభువు గారు కోరగా 'సంగ్రహ దిబ్బ చరిత్ర' అని 850 పేజీలు గల గ్రంథం ఒకటి రాశాను. 500 కాపీలు అచ్చు వేయించాను. 5 కాపీలు చెల్లాయి. మిగిలినవాటిని ద్వారిలో పెట్టి దిబ్బ కట్టించి అమ్మించాను" అన్నాడాయన.

"అంటే 13, 14 శతాబ్దాలుగా రాసిన తాళపత్రి గ్రంథాలన్నీ తమదగ్గిర ఇంకా వున్నాయా?" అన్నాను.

ఆయన నవ్వి "లేదు. మా ముత్తాతగారి తాతగారు అనేక పాతగ్రంథాలు శిథిలమైపోతూంటే వాటిని తిరగ రాశారు. ఈ తాళపత్రి గ్రంథాలలో 150 ఏళ్ళు మించిన వయసుగలది ఏదీలేదు. తిరగ రాసేటప్పుడు తొలి గ్రంథాలలో వుండిన భాషను కొన్ని కొన్నిచోట్ల మార్చవలసి వచ్చింది కూడా. క్రీస్తుశకం పన్నెండవ శతాబ్దందాకా 'దిబ్బ' అనేమాట వాడుకలోకి రాలేదు. తిప్పశబ్దమే వాడుక జరిగింది. తిప్పలు అనే నిత్య బహువచన ప్రయోగం తిప్ప శబ్దానుంచే వచ్చిందని మా తాతగారు చెప్పగా నా చిన్నతనంలో విన్నాను" అన్నాడాయన.

"చరిత్ర ప్రకారం దిబ్బరాజ్యం స్థాపించిన దెవరు?" అన్నాను.

"దాని విషయంలో ఎట్టిసందేమూ లేదు. శ్రీమన్మహారాజ వరాహ నారసింహ తిప్పలుంగారు దిబ్బరాజ్య

వ్యవస్థాపకులు. సాక్షాద్విష్ణ్వంశ సంభూతుడైన ఆయనను ఆయన తల్లి మూడు సంవత్సరాలు గర్భాన ధరించి కన్నది. అందుచేతనే ఆయన తండ్రి గతించిన రెండున్నర సంవత్సరాలకు జన్మించాడు. అణిమాది సిద్ధులుగల ఒక కోయరాజు అదృశ్యరూపంలో ఒకనాడు వరహా నరసింహదేవుడి తల్లి నిద్రించే మంచంమీద పడుకున్నాడట. మహాపతివ్రతా శిరోమణి అయిన ఆమెను అంటటం వాడితరం కాకపోయింది. అందుచేత మంచంమీద వాడికీ ఆమెకూ మధ్య ఒక అంగుళం మేర వాయుదేవుడు గోడగా స్తంభించి నిలబడ్డాడట. ఇంతలో ఆమె తండ్రి అక్కడికి వచ్చి; తన తపశ్శక్తిచేత అదృశ్యరూపంలోవున్న కోయరాజును చూసి శాపోదకం చేతబట్టేసరికి ఆ కోయరాజు ఆయన కాళ్ళపైబడి క్షమాపణ వేడి తన దారిన తాను వెళ్ళాడట. ఇది జరిగినట్టు తెలుసుకోగానే ఆ పతివ్రతా శిరోమణి తన గర్భస్థ శిశువును బయటికి రమ్మని ప్రార్థించిందట. అప్పటికే రెండు సంవత్సరాలకు పైగా గర్భనరకం అనుభవిస్తున్న శిశువు మూడేళ్ళు నిండగానే బయట పడ్డాడట" అన్నాడాయన.

"ఇది సమకాలికులు రాసిన విషయమే!" అన్నాను ఆశ్చర్యంతో.

"అవును. ఇది రాసిన మా పూర్వీకుడు వరాహ నారసింహ తిప్పకంటె రెండేళ్ళు పెద్దవాడు. మా తాత ముత్తాత గారు తిరగ రాసేటప్పుడు ఏళ్ళసంఖ్యల్లో ఏమన్నా పొరపాటు పడ్డారా అని అనుమానం తగిలింది నాకూడా"

"తిప్పగారిని తల్లి మూడేళ్లు మోయటం గురించేనా?"

"అది ఒక్కటే కాదు. ఇంకా ఇతర తభావతులు కొన్ని వున్నాయి. మొదటి తిప్పకు పెళ్లినాటికి నాలుగేళ్ళ వయసుండేట్టుగా సంవత్సరాల పేర్లివ్వబడ్డాయి. రక్తాక్షిలో ఆయన పుట్టాడు. ప్రభవలో ఆయనకు పెళ్లిఅయింది. పెళ్లి నాటికి ఆయనకు 64 ఏళ్ళనుకుందామా అంటే ఆయన అక్షయలో చనిపోయాడు. చనిపోయేటప్పటికి ఆయన వయసు 63 అనుకోవాలా?123 అనుకోవాలా?ఇవొక ధర్మసందేహం. మరొక ధర్మసందేహమేమంటే, పెళ్ళినాటికి ఆయన భార్య వయసు 28 ఏళ్ళులాగా కనిపిస్తుంది. నాలుగేళ్ళవాణ్ణి 28 ఏళ్ళదానికిచ్చారా ? 28 ఏళ్ళదాకా ఆవిడ కెందుకు పెళ్లి కాలేదు ? ఇలాటి సందేహాలున్నాయి. వీటన్నిటికన్న గొప్ప సందేహమేమంటే ఆమెకు వివాహమైన మూడేళ్ళకే శుక్లలో ఆమెకు తొలి సంతానం కలిగింది. అప్పటికి తిప్ప ఏడేళ్ళవాడై వుండాలి. లేదా 67 ఏళ్ళవాడై వుండాలి. 67 ఏళ్ళవాడనుకుందామంటే, తిప్ప భార్య 15 వ ఏట 18 వ కుమారుణ్ణి కన్నది. అప్పటికి తిప్ప 94 ఏళ్ళవాడై వుండాలి."

"ఆనాటివాళ్ళ జవసత్వాలు మనం ఇవాళ ఊహించలేం" అన్నాను.

"నేనూ అదే అనుకున్నాను. కాని ఆమె పోయాక తిప్ప పదహారేళ్ళదాన్ని చేసుకుని తాను చచ్చినదాకా పిల్లల్ని కంటూనేవున్నాడు. అంటే తిప్ప 123 ఏళ్ళు బతకటమేగాక చివరదాకా పిల్లల్ని కంటూనే వున్నాడన్నమాట."

"మీరన్నట్టు మీతాతగారి ముత్తాతగారు పొరబడి సంవత్సరాలు తప్పు రాశారేమో ?"

"ఆయన గొప్ప జ్యోతిష గ్రంథం రాయకపోతే ఆ మాట అనుకోనాలిసిందే. తాళపత్రంలో ఏదైనా తప్పు లుంటే అవి మొదటి పత్రంలోనే అయి ఉండాలి. తిరగరాసి నప్పుడు దొర్లినవని నాకు తోచదు."

"అదే అయి ఉండవచ్చు."

"కాని తొలి గ్రంథంలో ఈ సంవత్సరాల పేర్లు తప్పిస్తే అనుమానాస్పదంగా కనిపించేది మరేదీ కనబడదు. ఎందుచేతనంటే తిప్ప మహారాజు అవక్ర పరాక్రమ చరిత్ర యావత్తూ గ్రంథంలో అత్యద్భుతంగా వివరించి ఉన్నది."

"ఆ చరిత్ర నాకు సంగ్రహంగా సెలవివ్వగలరా ?" అన్నాను.

"తిప్పకు మొదటి సంతానం— కుమార్తె— కలిగిన మరుసటి ఏడే ఒక వింతకల వచ్చింది. ఆ కలలో ఆయనకు తండ్రి ప్రత్యక్షమై, 'నాయనా, నీవు తూర్పు దిక్కుకు ఒంటరిగా ప్రయాణమై వెళితే అరణ్యంలో పరమేశ్వరుడు నీకు క్షోయదొర రూపంలో ప్రత్యక్షమవుతాడు. అతని సహాయంతో నువ్వు సమస్త దేశాలు జయించి చక్రవర్తి వవుతావు,' అని చెప్పాడట. ఈ కలవచ్చే నాటికి తిప్ప ఎనిమిదేళ్ళవాడు కావాలి, లేదా 68 ఏళ్ళవాడు కావాలి. నిద్ర లేస్తూనే అతను తల్లి వద్దకు పోయి ఆమె కాళ్ళకు నమస్కరించి 'అమ్మా, చక్రవర్తి కమ్మని ఆశీర్వదించు!' అని అడిగాట్ట.

తల్లి అతన్ని ఎత్తి ముద్దాడి, అలాగే ఆశీర్వదించిదట. 68 ఏళ్ళ వాణ్ణి తల్లి ఎత్తి ముద్దాడటం దుసూహ్యం. అది పోనివ్వండి.

"ఇంతకూ ఆ కల నిజమయింది. కోయదొర తిప్పకు గొప్పగా స్వాగతమిచ్చి, అతను వచ్చిన పని తెలుసుకుని, 'నాయనా, నా కుమారుడి వంటి వాడవు. నీకు కావలసినంత రాజ్యం నేను గెలిచి పెడతాను' అన్నాడట. అడవిలో వుండే కోయలూ, బోయలూ, చెంచులూ, కిరాతులూ, కలిసి పశ్చిమ సముద్రంలాంటి సేనగా తయారై బయలుదేరి 20 యోజనాల నిడివిగల రాజ్యాన్ని సంపాదించి పెట్టారు. వారికి నాయకత్వం వహించిన కోయదొరను తిప్ప తన రాజ్యానికి సేనాపతిగా నియమించి మహా వైభవంగా పట్టాభిషేకం చేసుకున్నాడు.

"ఈ విజయయాత్ర మూడేళ్ళు పట్టింది. ఈ సమయంలోనే తిప్ప రెండవ సంతానమైన చిన్న తిప్ప పుట్టాడు. ఆయనకూడా తండ్రిలాగే బహుదీర్ఘకాలం—రెండేళ్ళు—మాతృగర్భంలో వున్నాడు. తిప్ప అనంతరం సింహాసనం ఎక్కినవాడుకూడా ఈయనే.

"ఒక్క ఏడు విరామం, మళ్ళీయుద్ధం. ఇది దక్షిణ దండయాత్ర. ఈ దండయాత్ర ఆరేళ్ళు పట్టింది. ఇది ముగిసే సరికి దిబ్బరాజ్యం అయిదింతలుగా విస్తరించింది. వింధ్యకు దక్షిణాన దిబ్బకు సాటిరాజ్యం లేకుండా పోయిందంటే అతిశయోక్తికాదు. దక్షిణ దండయాత్ర ముగిసేటప్పటికి నా అంచనా ప్రకారం తిప్పకు 18 ఏళ్ళు.

"తిప్పుకు 19 నిండక పూర్వమే ఒక విషాద సంఘటన జరిగింది. తిప్పు తన సేనానాయకుడైన కోయదొరను తన మిద్దెమీదికి పిలిపించి నౌకర్ల చేత దారుణంగా హత్య చేయించాడు. కోయదొర నిజానికి తిప్పుకు రాజ్యం సంపాదించి పెట్టినవాడు. ఆ అహంకారంతో అతని కళ్ళు నెత్తికి వచ్చి స్వామిద్రోహం చెయ్య తలపెట్టాడేమో తెలియదు. తిప్పు తల్లీ, కోయదొరా కలిసి ఏదో కుట్ర చేసినట్టు తిప్పుకు తెలిసిందని ఒక వదంతి పుట్టింది. కోయ ప్రజల పరిపాలన విషయంలో తిప్పుకూ సేనానాయకుడికీ అభిప్రాయ భేదాలు వచ్చాయని మరొక వదంతి పుట్టింది.

"ఏమైనా కోయదొర హత్యమట్టుకు కొంత అల్లకల్లోలానికి దారితీసింది. తిప్పు సైన్యంలోగల కోయలు తిరుగుబాటు చేశారు. వారందరికీ తిప్పు విందుచేసి విషంపెట్టి చంపాడు. అది మొదలుకుని తిప్పు అరణ్యాలు, తిప్పు డొక్కలో శూలాలుగా పరిణమించాయి. వాళ్ళ శాధ పడలేక తిప్పు తన రాజధానికి పది యోజనాల మేరలో ఎక్కడా అరణ్యమన్నది లేకుండా చేశాడు. ఎన్నో కార్చిచ్చులు కృత్రిమంగా అంటించబడ్డాయి.

"తిప్పు అవలంబించిన రాజ్యాంగ నీతి అతి విచిత్రమైనది. ఆయన పరిపాలనకు ఒక్క చిల్లిగవ్వ నెచ్చించలేదు. దివాణంలో ఎవరికీ ఎన్నడూ జీతాలులేవు. పదవులుమాత్రమే ఉండేవి. ఎవరి హోదాకు తగినట్టు వారు సంపాదించుకోవలసినదే. ఎవడన్నా తన హోదాకు తగినట్టు జీవించటం

లేదని తెలిస్తే అసమర్థుడని వాణ్ణి పదవిలోనుంచి తొలగించే వాడు. ఈ అద్భుతమైన ఏర్పాటువల్ల రాజ్యాంగం కమాను బండిలాగ ఒడిదుడుకులు లేకుండా నడిచింది.

"తిప్పు తన సూక్ష్మబుద్ధిని మరొక విధంగా కూడా ప్రదర్శించాడు. 'పరధర్మో భయావహః' అని పెద్దలు చెప్పి నప్పటికీ, సాధారణంగా మనుషులకు తమ ధర్మంమీదకన్నా పరమధర్మంమీదనే ఆసక్తి హెచ్చని సిద్ధాంతీకరించాడు. మనుషులు స్వధర్మం ఆలోచించేటప్పుడు దాని లోతు పాతులు ఆలోచిస్తారు. పరధర్మం ఆచరించేటప్పుడు స్వబుద్ధి ఉపయోగించరు. అందుచేత తిప్పు తన ప్రధానామాత్యుడుగా ఒక వణిక్పుత్రుణ్ణి పెట్టుకున్నాడు. సామంతులను ఎవరి ప్రదేశంలో వారిని ఉండనివ్వలేదు. వేరు భాషలూ, వేరు జాతులూగల చోట సామంతులను ఏర్పాటు చేశాడు. ఇలా చేయటంవల్ల దూరప్రాంతాల పరిపాలన సమర్థంగా సాగింది. ఎందుకంటే పాలకులకు ప్రజలపట్ల సానుభూతు లుండేవికావు. వేరు వేరు ప్రాంతాల రక్షక భటులను ఏర్పాటు చేసేటప్పుడు వారిని ఇతర ప్రాంతాలనుంచి తెచ్చి వేయించాడు.

"నాకు అష్టోత్తరశత రక్షణాలున్నాయి,' అని తిప్పు ఒకానొక సందర్భంలో ఒక అరబ్బీ యాత్రికుడితో అన్నాడని ప్రతీతి. ఇలాటివే ఆ రక్షణాలు.

"తిప్పు సామ్రాజ్య విస్తరణ ఒక విస్మయగాథ. తన 29వ ఏడు మొదలుకుని 41వ సంవత్సరందాకా ఆయన వెర్రిగా యుద్ధాలు చేశాడు. ఈ పన్నెండేళ్ళ కాలంలో

ఆయన నూటయాభై రాజ్యాలను తక్కువలేకుండ తన రాజ్యంలో కలుపుకున్నాడు. ఈ యుద్ధాలలో తిప్పమీద ఓడిపోయిన ఒక రాజు 'ఈ తిప్పకు యుద్ధశాస్త్రం ఏమీ తెలీదనుకోవాలో, లేక పూర్వం యుద్ధశాస్త్రాలు రచించిన వారందరికన్నా ఇతను బుద్ధిశాలి అనుకోవాలో నాకు తెలియటంలేదు,' అన్నాడు—ఈనాటికీ ఈసందేహం సందేహంగానే ఉన్నది.

"ఎందుకంటే, తిప్ప వెయ్యిమంది సైనికులను పదివేలమంది సైనికులమీదికి ఉసిగొలిపి గెలిచిన సమయాలున్నాయి ముగ్గురు సైనికులను పంపి ఒక కోట పట్టుకున్న నిదర్శనం ఉన్నది. అచ్చగా ఆడ సైనికుల దళాన్ని ఉపయోగించి పెద్ద పెద్ద రాజ్యాలు గెలిచిన తరుణాలున్నాయి. మామూలుగా దిగ్విజయాలుసాగించిన వారెవ్వరూ ఎన్నడూ చేయని పనులు తిప్ప కొల్లలుగా చేశాడు. క్రియకు చెప్పుకో వలసిందేమిటంటే తిప్ప ఏ యుద్ధంలోనూ ఓడిపోలేదు. కనీసం అటువంటి పుకారుమాత్రం బాగా వ్యాపించింది. నా మటుకు నేను తిప్ప చాలాచోట్ల పరాజితుడైనాడనుకుంటాను. కానీ అతను చేసినది యుద్ధమే కానప్పుడు ఓటమి జరిగిందో లేదో ఎవరు చెప్పగలరు? పదిమంది సైనికులు ఒక కోట పట్టుకోవటానికి పోతారు. వారు ముట్టుకుంటే విజయం, పట్టుకోలేకపోతే మటుకు పరాజయంకాదు. తిప్పకు పరాజయం లేదనేది శత్రువులకొక మూఢవిశ్వాసమైపోయి ఎన్నోచోట్ల వాళ్లు యుద్ధం చెయ్యకుండానే లొంగిపోయారు.

"ఈ యుద్ధాలలో తిప్ప గెలవదగినంత దేశం గెలిచి అకస్మాత్తుగా బౌద్ధమతం పుచ్చుకున్నాడు. బౌద్ధసన్యాసులు వందలూ, వేలూ వచ్చి దిబ్బరాజ్యంమీద వాలారు. ప్రతి గ్రామంలోనూ వీళ్ళకోసం మఠాలూ, పాఠశాలలూ కట్టించ బడ్డాయి? అహింసాతత్వం ఉద్ధరించబడింది. తన సామ్రా జ్యానికి భంగం రాకుండా ఉండటానికి ఈ పని చేశానని తిప్ప తన అవసానకాలంలో ఒప్పుకున్నాడు.

"బౌద్ధమతావలంబనతో యుద్ధాలు ముగిశాయి. కాని సామ్రాజ్య విస్తరణ ముగియలేదు. తిప్ప బుద్ధిసూక్ష్మ తకు ఇంతకంటె మంచి ఉదాహరణ కనబడదు. ఆయన తన కింద లేని చిన్న చిన్న రాజులవద్దకు రాయబారులను పంపి, 'మీరు స్వతంత్రంగా ఉండగోరుతారా? లేక నారాజ్యంలో సామంతులుగా ఉండి రెండింతల ప్రాంతాన్ని ఏలగోరు తారా?' అని అడిగించాడు. పది గ్రామాలకు స్వతంత్ర రాజుగా ఉండటం మంచిదా, గ్రామాలమీద పెత్తనం చేయటం మంచిదా? ఎంతోమంది రాజులు సామంతులుగా ఉండటానికి ఒప్పుకున్నారు. అటువంటి వారికోసం పాత సామంతుల నెందరినో తిప్ప పదవీభ్రష్టులను చేశాడు. ఎవ డైనా రాజు మొండికేసి తనకు సామంతుడు కావటానికి నిరాకరిస్తే వాడి రాజ్యంచుట్టూ ఉన్నవారికి పెద్ద ఆశలు పెట్టి వారిని తన సామంతులను చేసుకున్నాడు. ఇలాటి చక్రవ్యూహంలో చిక్కుకుపోయినవాడు కాలక్రమాన తను రాజ్యాలను తిప్ప పరం చెయ్యక తప్పిందికాదు."

తిప్పనుగురించి వింటున్నకొద్దీ నాకు ఆశ్చర్యం కలిగింది. "ఈనాటి సామ్రాజ్యవాదులూ, పారిశ్రామికులూ, భూతవైద్యులూ, కరణాలూ చేసేయుక్తులన్నీ ఆనాడే తిప్ప అమలుచేశాడన్నమాట !" అన్నాను.

"నిజంగా ఆశ్చర్యపడవలసినది ఇదేదీ కాదు, వేరే ఉంది," అన్నాడాయన.

"ఏమిటిది ?" అన్నాను.

ఆయన, ఎవరన్నా వినిపోతారేమో నన్నట్టు, అటూ ఇటూ చూసి, రహస్యంగా, "తిప్ప ఆఖరురోజుల్లో పిచ్చితో చచ్చిపోయాడు," అన్నాడు.

"అందులో వింత ఏమిటి ?" అన్నాను.

"మా పూర్వీకుడి మేనత్త కొడుకు రాజవైద్యుడు, తిప్ప మొదటినుంచీ పిచ్చివాడేనని ఆయన మా పూర్వీకుడితో చెప్పాట్ట. ఆ విషయం మా తాళపత్ర గ్రంథంలో స్పష్టంగా రాసివుంది" అన్నాడాయన.

పాతకోటకూ కొత్తకోటకూ మధ్య రెండుమైళ్ళ సూటిరోడ్డున్నది. ఇది తూర్పు పడమరలుగా ఉన్నది. పాత కోటనుంచి పడమరగావస్తుంటే, కొత్తకోట మూడుఫర్లాంగు లుందనగా, గెస్టుహౌసునుంచి మ్యూజియంవెళ్లే ఉత్తర దక్షిణాల అడ్డరోడ్డు తగులుతుంది. ఈరెండురోడ్లు కలిసేచోట పది అడుగుల ఎత్తుగల రాతిబొమ్మమీద ఉండే అయిదడుగుల కంచుపోత విగ్రహం దీనశరాంధవకోటిరాయలది.

అమెరికాను రాక్‌ఫెల్లర్ ఎటువంటివాడో, ఇండియాకు జంషెడ్జీ టాటా యెటువంటివాడో, దిబ్బకు కోటిరాయలు అటువంటివాడు. దిబ్బరాజ్యంలో పారిశ్రామిక యుగానికి ఈయనే శంకుస్థాపన చేశాడు. 1876 లో ఈయన దిబ్బ నగరంలో మొట్టమొదటి ఫాక్టరీ కట్టాడు. క్రమంగా ఈయన చేతిమీదుగా 12 రకాల పరిశ్రమలు ఏర్పడ్డాయి. ఈయన దిబ్బకు చేసిన సేవను గుర్తించి, గతించిన మహారాజావారు ఈయనకు దీనబాంధవ బిరుదునిచ్చారు.

కోటిరాయలు దివాణంలో ఒక చిన్న ఉద్యోగి కొడుకు ఆట్టే చదువున్నవాడుకాదు. ఒక మిషనరీ దొరతో కలిగిన పరిచయంద్వారా ఆయనకు పరిశ్రమల ప్రాముఖ్యం తెలిసి వచ్చింది. వెంటనే ఇంగ్లండు వెళ్ళి కొన్ని ఫాక్టరీలో కూలి చేసి పనితనం సంపాదించాడు. తరువాత స్వదేశానికి తిరిగి వచ్చి, దిబ్బలో ఒక ఫాక్టరీ నిర్మించటానికి మహాజావారి అనుమతి వేడాడు. మహారాజావారు నిరాకరించారు.

"మన ఆర్య నాగరికతకూ ఫాక్టరీలకూ పొత్తు కుదరదు. నా బొందెలో ఊపిరుండగా దిబ్బలో యంత్రాల మోత వినిపించటానికి వీలులేదు, అన్నారు మహారాజా వారు.

"యంత్రాలు ఆర్య నాగరికతకు వ్యతిరేకమైనవి కావు. పూర్వకాలంలో మనకు యంత్రాలుండేవి. మనం మన పరిశ్రమలను ఆర్యధర్మం ప్రకారం తప్పకుండా నడుపుదాం," అన్నాడు కోటిరాయలు.

రోజులు తరబడి చర్చించుకున్నారు. చివరకు ఎంతో

విచారంతో, అయిష్టంగా మహారాజా ఫాక్టరీకి అనుమతి యిచ్చాడు.

మొదటి ఫాక్టరీ తయారయింది. అందులో పని చెయ్యటానికి దిబ్బవారు ఒక్కడూ రాలేదు. ఎందుకు రావాలి? ఆనాటి దిబ్బల్లో అందరికీ ఇళ్ళున్నాయి. పని ఉన్నది. డబ్బులేదు, నిజమే. కాని డబ్బుతో ఎవరికీ నిమిత్తం కూడా లేదు. జనసామాన్యం కష్టపడి పనులు చేసుకునేవారు. వారి అత్యవసరాలు తీరేవి. కోటిరాయలు కట్టించిన రాతి గోడల ఫాక్టరీలో కూచుని పనిచేయవలసిన అవసరమేముందీ?

ఈ ఫాక్టరీకి దిబ్బ ప్రజలు 'జైలు' అని పేరుపెట్టారు. ఆపేరు క్రొచ్చెమలా పాకి, కాలక్రమాన ఖాయమైపోయింది. ఇవాళకూడా, "జైలు ఎక్కడ?" అంటే ఎవరన్నా ఈ ఫాక్టరీనే చూపిస్తారు!

కోటిరాయలు బ్రిటిష్ ప్రాంతంనుంచి కూలీలను తెచ్చి ఫాక్టరీ నడిపాడు. వాళ్ళు అడుక్కు తినేవాళ్ళు. అలగాజనం. కూలీలుండటానికి కోటిరాయలు ఇళ్లు కట్టించాడు. వాళ్ళ కోసం స్టోరు పెట్టించాడు. వాళ్ళకు కూలీకింద ఇచ్చినదంతా అద్దెకిందా, స్టోరుద్వారా తిరిగి రాబట్టాడు.

కోటిరాయలు చాలా డబ్బు చేస్తున్నాడనే వార్త పాకింది. దివాన్జీ ఆయనను పిలిపించి, "ఫాక్టరీ పనికి గడువూ, గంటలూ లేవని విన్నాను. నాగరిక దేశాలలో లాగ పనిగంటలు నియమం ఎందుకు పాటించకూడదూ?" అన్నాడు.

"దివాన్జీ, మీకు తెలియని దేముంది? ప్రతిపనీ తన కాల ప్రమాణాన్ని తానే నిర్ణయించుకుంటుంది, పనికి గంటలు నిర్ణయించటం ఆర్యధర్మంకాదు. శేరు బియ్యం పిండి విసరటానికి ఇంతకాలం పడుతుందనే లెక్క ఉంటుంది. వేళ అయిపోయిందని, మధ్యలో తిరగలి వదిపోయిన ఇల్లాలికి ఆ పనిమీద విముఖత్వం రాదా? మీరు చెప్పే నాగరిక దేశాలలో ఇలాటి విముఖత్వం పుట్టినాకనే కార్మికసంఘాలూ సమ్మెలూ వచ్చాయి. నేను బర్మింగ్‌హాంలో ఉండగా..."

కోటిరాయలు చెప్పినదంతా విని, దివాన్జీ, "సరే, ప్రస్తుతానికి ఇలాగే కానివ్వండి. కాని ఈవిషయంలో నేను పూర్తిగా మీతో ఏకీభవించినట్టు తలచవద్దు," అన్నాడు.

ఆ నెలలోనే దివాన్జీ కుమార్తె వివాహం జరిగినప్పుడు కోటిరాయలుగారు పెళ్ళికూతురు కిచ్చిన కానుక, రత్నాల హారం, మిగిలిన అన్ని కానుకలకంటె విలువైనదని చెప్పుకున్నారు. దివాన్జీని కొనేసుకున్నానని కోటిరాయలు అనుకుంటే చాలా పొరపాటుపడ్డాడు.

మరికొంత కాలానికి దివాన్జీ మహారాజావారితో, "మనం పరిశ్రమల రాబడి పన్ను అంటూ ఏదో ఒకటి విధించాలి," అన్నాడు.

"ఏ లెక్కన విధిస్తే బాగుంటుంది?" అన్నాడు మహారాజా.

"నూటకి మూడువంతున వేద్దామనుకుంటున్నాను."

"కోటిరాయలుగారితో మాట్లాడి చూడండి!"

దివాన్జీ కోటిరాయలును పిలిపించి మాట్లాడాడు. కోటిరాయలు మహారాజా దగ్గిరికి వెళ్ళి, "మహారాజా, ఏమిటీ అన్యాయం ?" అని అడిగాడు.

"పరిశ్రమల మీాద పన్నుండటం, రివాజు కాదా ?" అన్నాడు మహారాజా.

"అభివృద్ధిమీాద పన్నా ? నాగరికతమీాద పన్నా ?" అన్నాడు కోటిరాయలు ఆశ్చర్యంగా.

ఆఖరుకు నూరింట ఒకటి వంతున కోటిరాయలు లాభాలమీాద పన్ను విధించారు. ఈపన్ను తప్పించుకునేంటందుకు కోటిరాయలు ఇతర ఫాక్టరీలు కట్టసాగాడు.

అయితే ఆయన అభ్యుదయానికి మరొక పెద్ద అవాంతరం వచ్చింది. ఆయన ఫాక్టరీలో పనిచేసే కూలీలు, ఈ చాకిరీయే స్వంతాన చేసుకుని ఇంతకన్న స్వేచ్ఛగా బతకవచ్చునని కనిపెట్టారు. ఎక్కడబడితే అక్కడ తాటిచెట్లున్నాయి. కొట్టుకుంటే అడిగేవాడు లేడు. ఊరంతటా ఖాళీ స్థలాలున్నాయి. ఇల్లువేసుకుంటే అడిగేవాడులేడు. ఫాక్టరీలో పనిచేసే మగవాళ్ళకన్న పిల్ళువిసిరీ, ధాన్యందంచీ,ఎవరి ఇళ్ళలోనైనా చాకిరీచేసి డబ్బు సంపాదించే ఆడవాళ్ళపని బాగున్నది. సగం కూలికి ఫాక్టరీలో పనిచేసే పిల్లకాయలు అనారోగ్యంగా, ఎదగకుండా ఉన్నారు. ఊళ్లోగాలికి తిరిగే పిల్లలు ఉక్కుముక్కల్లాగా వున్నారు.

కార్మికులలో కొత్తఆలోచనలు బయలుదేరాయి.

వాళ్లు "జైలు" ఖాళీచేసి బయట ఇళ్ళు వేసుకుని బతక సాగారు.

కోటిరాయలు మహారాజా దర్శనం చేసుకున్నాడు.

"దివాణానికి బోలెడంత సొమ్ము పన్నురూపంలో చెల్లిస్తున్నాను. కాని దివాణంవారు నాపట్ల వహించిన వైఖరి చూస్తే నేనీపరిశ్రమలు దేశం బాగుకోసం కాక, నా బాగు కోసం నడుపుతున్నా ననుకుంటున్నట్టున్నది. "మహారాజా, నేను ధనంతో పుట్టలేదు. పొయ్యేటప్పుడు చిల్లిగవ్వకూడా వెంట తీసుకుపోను. నాజీవితం ధారపోసి నడిపే ఈ పరిశ్రమలను రక్షించి కాపాడవలసిందని ప్రార్థించే హక్కు నాకు లేదా?" అని అడిగాడు కోటిరాయలు కళ్ళనీళ్ళ పర్యంతమై.

"మీకు ఏవిధమైన రక్షణ కావాలి?" అని అడిగాడు మహారాజా.

"పారిశ్రామిక వ్యవస్థ అభివృద్ధి చెందాలంటే కొన్ని అభివృద్ధికరమైన శాసనాలు జరగాలి. నేను దివాణం అధికారిని కాను. కాని నన్ను దివానునుచేస్తే, ప్రజలు ఎవరి అనుమతీ లేకుండా ఎక్కడబడితేఅక్కడ ఇళ్ళు వేసుకునేటందుకు అనుమతించను. అది ఆర్థిక వ్యవస్థలో అరాచకాన్ని సూచిస్తుంది," అన్నాడు.

"దివాన్జీతో మాట్లాడి చూడండి!" అన్నాడు మహారాజా.

కోటిరాయలు చెప్పిన శాసనానికి దివాన్జీ ససేమిరా సమ్మతించలేదు.

"అలాటి శాసనం చేస్తే నాకు మతిలేదనుకుంటారు ఊరంతటా మైదానాలున్నాయి. జనం వాళ్ళ కాయకష్టంతో ఇళ్ళుకట్టుకుని నివసిస్తారు తప్పేమిటి?" అన్నాడాయన. కోటిరాయలు విచారంగా తలఊపి వెళ్ళిపోయాడు.

తరవాత కొద్దికాలానికి దిబ్బనగరంలో అనేకచోట్ల పేదవాళ్ళ గుడిసెలు పరసురామప్రీతి అయాయి. మరిమూడు నెలలకు మరొక తడవ అనేక ఇళ్ళు కాలిపోయాయి.

ఇదంతా ఎవడో చేస్తున్నాడని పుకారు పుట్టింది.

ఎవడో పొడుగాటివాడుట, తలవెనక్కు తిరిగి ఉంటుందిట. ఇళ్ళు అంటించి మరుక్షణం మాయమవుతాట్ట. వాణ్ణి నలుగురైదుగురు కళ్ళారా చూశామన్నారు. అందులో ఒకడు ఈ వింతవ్యక్తి కాకిగా మారి ఎగిరిపోగా కూడా చూశాట్ట !

ఎన్ని కట్టుదిట్టాలు ఏర్పాటు చేసినా కొంపలు కాలటం ఆగలేదు. కొన్ని ఇళ్ళలో జనం కూడా చచ్చారు.

కొద్దికాలానికి దివాన్జీయే చచ్చాడు. ఆయనకు వచ్చినది పెద్ద జబ్బని ఎవరూ అనుకోలేదు. కాని ఆయన వైద్యుడు మాత్రం మొదటినుంచీ ప్రాణాపాయం అంటూనే వచ్చాడు. చికిత్స చేసినకొద్దీ రోగం విషమించింది.

దివాన్జీ పదవి కోటిరాయలుకు సంక్రమించింది.

కోటిరాయలు దివాన్జీ కాబోతాడన్న వార్త పొక్కగానే కొందరు మిత్రులు అభినందించారు. "మరలు తిప్పేవానికి నాకు రాజకీయాలెందుకు ?" అన్నాడాయన.

కోటిరాయలు దివాన్జీ అయాక దిబ్బరాజ్యంలో కలిగిన అభివృద్ధి అత్యాశ్చర్యకరమైనది. దిబ్బకు మొదటిసారిగా స్టేట్ రైల్వే ఏర్పడింది. విద్యుచ్ఛక్తి కేంద్రం ఏర్పడింది. సాయుధపోలీసులుఏర్పడ్డారు. ఇళ్ళుకట్టటానికి అనుమతులిచ్చే పద్ధతి ఏర్పడింది. మొట్టమొదటిసారిగా వీధుల్లో అడుక్కుతినేవాళ్లూ, ప్రొలిటేరియన్లని పిలవబడే అలగాజనమూ, ఫాక్టరీ ఉత్పత్తిచేసిన వికలాంగులూ కనిపించారు.

కోటిరాయలు పరిశ్రమలు వ్యాప్తిచెందాయి. కాని ఆయన ఫాక్టరీలలో గంటలు లేవు. కోటిరాయలకు రాబడి పన్ను లేదు. ఆయనపై పోటీగా పరిశ్రమలు స్థాపించటానికి కొందరు మార్వాడీలూ, గుజరాతీలూ యత్నించారు. కాని వారికి అనుమతి లభించలేదు.

కొందరు మొండివాళ్ళు దిబ్బ పొలిమేర అవతల ఫాక్టరీలు కట్టి పరిశ్రమలు నడిపి సరుకులు దిబ్బలో పోటీధరలతో అమ్మాలని ప్రయత్నించారు. ఈ ప్రయత్నాలను భగ్నం చెయ్యటానికి కోటిరాయలు దివాణం సొమ్మునుంచి నీళ్ళలాగా ఖర్చుచేశాడు.

పారిశ్రామికుడుగా కోటిరాయలు ఏపాటి దక్షత గలవాడన్న విషయంలో అభిప్రాయభేదాలు లేకపోలేదు. ఆయన దిబ్బ పారిశ్రామిక యుగకర్త అన్నది గుర్తించి తీరాలనీ, పాశ్చాత్య దేశాలలో తొలి పారిశ్రామికులు సాధించిన విజయాలకు ఆయన విజయాలు ఏమాత్రం తీసిపోవనీ కొందరు చరిత్రకారు లంటారు. తనకు పోటీయే లేని తరుణంలో,

ఫాక్టరీ చట్టమన్నది లేని పరిస్థితుల్లో, కార్మికుల ఐక్యప్రతిఘటన అన్నది మచ్చుకైనా లేనప్పుడు, గోపిడీలూ, హత్యలూ, మొదలుగా గల అవాచ్యాలన్నీ చేసికూడా, పొలిమేర అవతల గల పరిశ్రమలతో పోటీ చెయ్యలేకపోయినాడు; ఆయన కూడా ఒక పారిశ్రామికుడేనా అని కొందరంటారు. ఈ రెండు విరుద్ధాభిప్రాయాల మధ్యా నిజం తేల్చటం కష్టం.

రాజకీయంగా కోటిరాయలు నికరమైన దేశభక్తుడవటానికి సందేహంలేదు. భారత స్వాతంత్ర్య పోరాటం జరిగిన కాలంలో, కాంగ్రెసు నాయకులు దిబ్బకు రావటం తటస్థించినట్టయితే వారిని వెంటనే అరెస్టుచేయించి బ్రిటిష్ పోలీసుల వశపరచి, స్వాతంత్ర్యోద్యమం అవిచ్ఛిన్నంగా సాగటానికి తోడ్పడ్డాడు. దిబ్బలో చెదురుగా సత్యాగ్రహాలుజరిగినప్పుడు సత్యాగ్రహులనూ, వారిదగ్గిర బంధువులనూ కూడా ఖైదు చేయించి, బ్రిటిష్ పెత్తందార్ల ద్వారా సంస్థాన శాంతికి భంగం కలగకుండా చూశాడు. దిబ్బలో తొలిరాష్ట్రీయ స్వయంసేవాదళం ఏర్పాటయినప్పుడు, 94 ఏళ్ళ వయస్సులో కూడా ఆయన స్వయంసేవకులవిన్యాసాలు సందర్శించి, 'దేశం యొక్క భవిష్యత్తు మీపైనేఉన్నది,' అని ఆశీర్వదించాడు.

కోటిరాయలు మరణం దిబ్బకు పెద్దదెబ్బ. దిబ్బ పరిశ్రమలను గురించి ఈనాడు చెప్పుకునేవాడు లేడు. కార్మిక సంఘాలూ ఆందోళనా హెచ్చుగాఉంది. నానాటికి దిబ్బ రాబడి పడిపోతోంది. ఫాక్టరీ ఆక్టు దిబ్బలోకూడా అమలులోకి వచ్చింది. కోటిరాయలు వేటిని నిరోధించటానికి తన యావచ్ఛక్తులూ ధారపోశాడో అవన్నీ ఈనాడువచ్చేశాయి.

ఇటీవల దిబ్బకు వచ్చిన పాశ్చాత్య ఆర్థిక నిపుణుల బృందంతో ఒకదిబ్బ విలేఖరి మాట్లాడగా, ఒక నిపుణుడు, "మీ కోటిరాయలుకు ఆర్థిక పరిజ్ఞానం సున్నా! దిబ్బ అభివృద్ధికావటానికి ఒకటే ఉపాయం. వీధులన్నీ దున్ని పంటలు పండించండి. అంతకన్న దిబ్బకు-ఆమాటకువస్తే ఆగ్నేయాసియాకు భవిష్యత్తులేదు." అన్నాడుట.

FRONT
Excellent

# దిబ్బరాజ్యంలో స్వాతంత్ర్యం

నా అపూర్వ మిత్రులునూ, పూర్వ మిత్రులునూ అయిన దిబ్బరాజుగారిని ఒకసారి దర్శించాలని అభిలాష కలిగి దిబ్బరాజ్యం వెళ్ళాను.

దిబ్బరాజుగారు నన్ను చూసి చాలా సంతోషించారు.

"మీరు పత్రికల్లో నన్ను చూసి రాసింది విన్నాను," అన్నారు దిబ్బరాజుగారు. "చాలారోజులుగా మీ రాక కెదురుచూస్తూ, ఏం రాశారో అడుగుదామనుకుంటున్నాను"

పారవశ్యంలో నాకేమనాలో తెలీలేదు.

దిబ్బరాజ్యానికి స్వాతంత్ర్యం వచ్చాక నేనురావటం ఇదే మొదటిసారి. తమరాజ్యంలో ఏమేం మార్పులు జరిగాయో చూడాలని చాలా కుతూహలంగా ఉంది," అన్నాను.

"మార్పన్న మార్పా? మీరిప్పుడు గుర్తించలేరు. భాంతయూనియను ప్రాంతాలకీ దీనికీ తేడాకనిపెట్టలేరిప్పుడు! నేను శ్రీలు వొదిలేసుకున్నాను. పత్రికల్లో చూశారు కాదూ?" అన్నాడు దిబ్బరాజుగారు.

"మీరు మీ హక్కుల్ని నిశ్చితంగా ప్రజలపరం

చేసెయ్యటంగురించి చరిత్రకారులు ఎంతైనా శ్లాఘిస్తారు" అన్నాను.

"అట్లా అనరాదు. ఈరాజ్యం వాళ్ళదికాదూ? శ్రీకృష్ణుడు అర్జునుడితో చెప్పినట్లు నేను నిమిత్తమాత్రుణ్ణి. ఎప్పుడూ నాదేశంలో ప్రజలే జాస్తిగా ఉంటున్నారు," అన్నారు దిబ్బరాజుగారు.

రాజకీయంగా ఏమేంమార్పులు జరిగాయని అడిగాను.

"రాజ్యాంగమంతా మారిపోయింది. మా దర్బారు శాసనసభగా మారిపోయింది. నన్ను దానికి అధ్యక్షుడుగా ఉండమని ఏకగ్రీవంగా కోరారు. జమీందారు లందరికీ తలా ఒక శాఖా ఇచ్చేశాను."

"రాజ్యాంగం ఏర్పాటుచేశారా ఏమిటి?"

"ఆహా! శాసనసభే రాజ్యాంగం తయారుచేసేసింది. సర్వాధికారాలూమంత్రులవే. అధ్యక్షుణ్ణికనక ప్రతిచట్టానికీ నా సంతకం పుచ్చుకుంటారు. నా సంతకం పడేవరకూ ఏ చట్టమూ అమలు జరుగరాదని ఒకక్లాజు చేర్చారు."

"ఎన్నికలతోనే శాసనసభ ఏర్పాటయిందా ఏమిటి?"

"దానికొక చిక్కొచ్చింది. మనరాజ్యానికి సరిఅయిన జనాభా లెక్కల్లేవు. జాబితాలు తయారుచెయ్యమని ఒక సంఘాన్ని నియమించాం. వారు 3,965 మందిని ఎన్యూమరేటుచేసి ఈలోపుగా గడువు అయిపోవటంవల్లా జాబితాల తయారీకి మంజూరుచేసిన డబ్బు అయిపోవటంవల్లా పని ఆగిపోయింది. పది పన్నెండు రూపాయల సొమ్ముకి లెక్కకూడా

తేలలేదు. ఈ సందర్భంలో ఇద్దరు ఎన్యూమరేటర్లను విచారణకూడా చేస్తున్నాం."

"మొత్తం జనసంఖ్య ఎంతఉండేది దివాణంలో లెక్కలులేవా?"

"ఉన్నాయి, క్షౌరశాఖ జాబితానుబట్టి 35 వేల 959 మందీ, చాకలిశాఖను బట్టి 35 వేల 842 మంది తేలుతున్నారు. ఏదని నమ్మటం?... ఈ కారణాలవల్ల మా పాత దర్బారు సభ్యులనే శాసనసభ్యులుగా భావించి రాజ్యాంగం సాగించాం."

"మీ రాజ్యంలో పార్టీ ప్రభుత్వమా ఏకపార్టీ ప్రభుత్వమా?"

"నాకైతే ప్రజాస్వామిక సూత్రాలమీద అమిత మోజున్నది. కాని రెండోపక్షం కనిపించదు. అప్పటికి మా శాసనసభలో ఇద్దరు ప్రభుత్వ విద్రోహులు తయారయినారు. రాజ్యాంగం తయారు చేసేటప్పుడు వారు అడుగడుగునా అడ్డొచ్చారు. కాని వోటింగులో వారికి బలంలేదు. ఆ కారణంచేత వారిలో ఒకడు రెండోవాడి పాతచెప్పులు తీసి సభాధ్యక్షుడిపై విసిరారు. ఇద్దరినీ ఖైదుచేశారు. ఇప్పుడు వాళ్ళు జైలులోఉన్నారు. ఇంకా విచారణ జరగలేదు. మరినాలుగైదు సంవత్సరాలాదాకా మా న్యాయస్థానానికి వాళ్ళను విచారించే వ్యవధిఉంది."

"కొత్తరాజ్యాంగం కింద ఏమేమి కొత్తచట్టాలు ఏర్పరిచారు?"

"జమిందారీల రద్దుశాసనం చేశాం."

"ఏమిటీ! చెప్పరేం? ఇప్పుడు జమిందారీలు లేరన్న మాట దిబ్బరాజ్యంలో"

"లేవు కాని ఒక్కటేచింత. జమిందార్లకి నష్టపరిహారం రొక్కరూపంగా యివ్వలేకపోయాం. అందుచేత జమిందారీ రద్దుబిల్లు తోంభైతొమ్మిదేళ్ళు వాయిదా వెయ్యమని నేను ప్రతిపాదించాను. కాని ప్రజాతంత్రాభిలాషులైన మా శాసనసభా సభ్యులు దానికి ఒప్పుకోలేదు. చివరకు జమిందార్ల పరిహారంకింద వారివారికింద ఉన్న భూమి వారికే ఇచ్చేసి, మిగిలినదానికింద ప్రజలు—అంటే రైతులు—నాలుగేళ్ళపాటు పొలాలు ప్రతిఫలం లేకుండా సాగుచేసేట్టు నిర్ణయించాం. నేనుకూడా రాజ్యాధిపత్యం వొదిలేసుకున్నందుకు నాకు శాసనసభవారు నష్టపరిహారంకింద ఏటా మరోలక్ష ఇప్పిస్తున్నారు."

"అంటే క్రియకు రాజ్యాంగవ్యవస్థలో చెప్పకోదగిన మార్పేమీ జరగలేదన్నమాట... ఆగండి: నేను విమర్శించటంలేదు. నేనలా విమర్శిస్తానా? ఇప్పుడు నేను స్వతంత్ర భారతీయుణ్ణండోయ్! ప్రభుత్వాన్ని విమర్శించటం గిమర్శించటం జాన్తానై! నేను చెప్పవచ్చిందేమిటంటే, దీనినిబట్టి అదివరకే దిబ్బరాజ్యంలో ఆదర్శవంతమైన ప్రజాస్వామికం అమలుజరుగుతూ ఉండిందని తేటతెల్లమౌతున్నట్టు భావించటానికి ఎటువంటి అభ్యంతరమూ ఉండదని మనకు తెలుస్తోంది. ఏమంటారు?"

దిబ్బరాజుగారు విశాలంగా నవ్వి కాఫీటోస్టు తెప్పించారు.

"దిబ్బరాజ్యంలో కమ్యూనిస్టు రాక్షసులున్నారని నానోటిమీదిగా అనటం చాలా కష్టంగానేఉందిగాని, ఉండకుండా ఉంటారా అని నా సందేహం. వారిని గురించి ఏమి చర్య తీసుకుంటున్నారు ?"

కమ్యూనిస్టునని చెప్పుకుంటున్న వాడెవడూ కనిపించడు. కాని మన రాజ్యంలో కమ్యూనిస్టులు లేరని అనటం మనకి చాలా అవమానం. అందుచేత ఒక తెలివైన శాసనం చేశాం; ఎవడైనా ప్రజాహక్కులనిగాని, వాక్స్వాతంత్ర్యమనిగాని, సాంఘిక న్యాయమనిగాని, సంఘంలో దోపిడీ జరుగుతోందనిగాని అంటే వాణ్ని వెంటనే అరెస్టు చేసేస్తాం" దిబ్బరాజుగారు వొంగి రహస్యంగా నా చెవిలో, "మీకు రాజకీయాలనుగురించి తెలియనిదేమిటుంటుందిగనకా? మనం యదార్థ దృష్టితో నడుచుకుంటూ ఉంటాం. కాని ఈ కమ్యూనిస్టులుందే! ఆదర్శప్రాయమైన మంచిమాటలుచెబుతూ వుంటారు. అవన్నీ జరిగేవుస్తాయా? అందుచేత కాస్త మంచి మాటలు చెప్పినవాణ్నల్లా అరెస్టుచేసి పారేస్తున్నాం" అన్నారు

"కాని కమ్యూనిస్టులు సులభంగా దొరకరేమో" అన్నా.

"అమ్మా! మా పోలీసులకి దిబ్బదేశం మొత్తంమీద చీమ చిటుక్కుమన్నా తెలిసిపోతుంది. దేశంలో ఎంతమంది

నరప్రాణులైతే ఉన్నారో అందరూ నా పోలీసు చిట్టాలో ఉన్నారనుకోండి. ఈ క్షణంలో ఒక బిడ్డ పుడితే మరో అయిదు నిమిషాల్లో ఆ సంగతి పోలీసు చిట్టాలో చేరిపో తుంది," అన్నారు దిబ్బరాజుగారు సగర్వంగా.

దిబ్బ పోలీసుల ఆకుంఠిత ప్రజ్ఞకి నా సంతోషం వెలి బుచ్చి, "రాజ్యంలో ఆర్థికస్థితి ఎట్లా ఉంది?" అని పృచ్ఛిం చాను.

నా పృచ్ఛ నా పెదవి దాటకమునుపే రాజుగారి మొహాన మచ్చేసింది. ఆయన నిట్టూర్చి, ఏమీ బాగాలేదు, ఏమి బాగాలేదు" అన్నారు.

ఇంక వివరాలడిగాను.

"నలుగురితో పాటు మనకీ ఇంత ఇన్ఫ్లేషన్ ఉంది. అదో లెక్కలోనిది కాదు. దాని విషయం తగు బందోబస్తులే చేశాం. కాని—"

బందోబస్తు వివరాలడిగాను.

"వ్యాపారాదాయాల మీదా, అధిక లాభాల మీదా ఒకటి రెండు అల్పసంఖ్యాక వర్గాలను ఓడించే పన్నులు తగ్గించి అధిక సంఖ్యాక వర్గాలు చెల్లించుకునే పనులన్నీ రెట్టింపు చేశాం. మిగులు బడ్జెటుమటుకు మీ దయవల్ల తయారుచేసేసుకున్నాం. అంచనా ప్రకారం రెండు మూడు వేలు మిగులున్నది. కాని క్రియకు ఇంకా ఉంటుంది. ఎందు చేతనంటే చాలామంది పన్ను లివ్వరు. వాళ్ళ ఆస్తులూ వ్యాపారాలూ వేలాని కొచ్చేస్తాయి. ఈ విధంగా చాలా భాగం పొలాలూ, పరిశ్రమలూ ప్రభుత్వ పరమవుతాయి.

సోషలిజం కూడా కొంత మనసులో పెట్టుకునే ఈ పని చేశామని నేను వేరే చెప్పను. పోతే, సరుకుల ఉత్పత్తి విరివిగా పెంచేటందుకు గాను కూలీల జీతాలు తగ్గించాం, లాభాల మీద పన్ను తీసేశాం కదా—"

"కంట్రోళ్ళు పెట్టకపోయారు ?

"నయం! కంట్రోళ్ళతోనే కొంప పోయింది. కంట్రోళ్లు పెట్టగానే సరుకులు మాయమయాయి. దొంగ వ్యాపారం పెరిగిపోయింది. ఎవరికీ కంట్రోలుధరకు వస్తువులు దొరకనప్పుడు కంట్రోళ్ళు దేనికి? అదో నవ్వులాటపని!"

"దొంగవ్యాపారస్తుల్ని పట్టుకోక పోయారా?"

"మనవశమా? వాళ్ళెవరో?! ఎక్కడుంటారో! సరుకు ఎక్కడ దాస్తారో! వాళ్ళని బ్రహ్మదేవుడు పట్టగలడా?"

"ఆమాట నిజమేలెండి."

"ఎంతమంది కూలీల ఇళ్లో సోదాచేశాం! అంటరాని వాళ్ళనికూడా అర్ధరాత్రిపూట దారులుకాసి వెతికాం!—"

"దొంగసొమ్ముమాత్రం దొరకలేదు?"

"దొరకక్కే దొరికింది? ఒకళ్ళదగ్గర గిద్దెడుబియ్యం ఒకడిదగ్గర అరడజను నిప్పెట్టెలూ, ఒకరిదగ్గర గజమున్నర గుడ్డా—ఈవిధంగా దొరికింది. వాళ్ళని జైళ్ళలోతోక్కాం. అయినా దొంగవ్యాపారం ఆపటం మాతరం కాలేదు."

"సరే పోనివ్వండి."

"దీనికి తగ్గట్టు ఇంకో అభ్యంతరంకూడా వచ్చింది. కంట్రోళ్ళకి."

"ఏమిటది?"

"ముడిసరుకుల ధరలు పెరిగాయనీ, లాభాలుచాలటం లేదని, అందుచేత కంట్రోళ్ళు ఎత్తివెయ్యకపోతే పరిశ్రమలు సాగించమన్నారు పారిశ్రామికులు. నిరుడీపడు ఎక్కడా ఇంత చాంతాడు ముక్కలేదు. చాంతాళ్ళ పరిశ్రమ మూసేశారు. బావుల్లోంచి నీళ్ళుతోడేటందుకు లేదు. ఇళ్ళలో అన్నాలు లేవు. స్నానాలులేవు. దాహానికి చచ్చారు ప్రజలు. బిందెల పరిశ్రమా, జాడీల పరిశ్రమా, బెల్లం పరిశ్రమా, చింతపండు పరిశ్రమా దిగనాసిల్లి పోయాయి. ఒక చింతపండు పారిశ్రామికుడు ఏకంగా వంద చింతలు పడగొట్టి బొగ్గు పరిశ్రమ సాగించి చచ్చే లాభాలు తీశాడు. మేం చింత బొగ్గుల మీద కంట్రోళ్ళు పెట్టేలోపుగా ఉన్నబొగ్గులన్నీ అమ్మేసుకున్నాడు. అందుచేత కంట్రోళ్ళు తీసేశాం."

ఎవరన్నా లాభాలు తక్కువగా ఉంటే ఎక్కువ సరుకమ్మకోటానికి చూస్తారు. దిబ్బ పారిశ్రామికులు ఇట్లా ఎందుకు చేస్తున్నారో నా కర్థంకాలేదు. దానికి ప్రభువుగారే సమాధానం చెప్పారు.

"మీరు చెప్పే ఆర్థిక సూత్రం చిన్న వ్యాపారస్తునికి వర్తిస్తుంది. పెద్ద పరిశ్రమలకి వర్తించదు. అదికాక మన పారిశ్రామికులు దేశభక్తులు. అందుచేత అట్లా చేశారు !"

"అయితే ప్రస్తుత పరిస్థితి బాగానే ఉందన్న మాట?" అన్నాను.

"అదే లేదు. ఇంతా శ్రమపడి పారిశ్రామికుల కింత ప్రోత్సాహమూ ఇచ్చి, కంట్రోళ్ళు తీసేస్తే ఉత్పత్తేమో

పెరిగింది గాని సరుకు అమ్ముడుపోక నిలబడిపుంది. ఛీ! ఛీ! ప్రజలుండే వొట్టి మూర్ఖులు. వాళ్ళ క్షేమం కోరి ఏది చెయ్యండీ, రాణించదు. సరుకులు లేనప్పుడు లేవో అని గోల పెట్టారు. చూపిస్తే కొనరు. పారిశ్రామికులంతా వొచ్చి మా ఆర్థిక మంత్రిమీద పడి, పాపం, లబ్బున ఏడిచారు. తమ సరుకులు ప్రభుత్వమన్నా కొనకపోతే ఎట్లాగన్నారు. మా ఆర్థిక మంత్రి కార్యదర్శులనూ సలహాదార్లనూ పిలిచి, అడిగాడు. ఈ పరిస్థితికి కారణమేమిటని, ఒకాయన తగుదునమ్మా అని చెబుతాడుగదా; వస్తువులూ వాటిని కొనవలసిన డబ్బూ ఒకళ్ళ దగ్గరే ఉండిపోయిందట. కమూనిస్టనే అనుమానం మీద అతగాణ్ణి వెంటనే మా ఆర్థికమంత్రి ఎరెస్టు చేశాడు. ఈ పుకారు ప్రజల్లో పడితే ఇంకేమన్నా ఉందా?"

"తరవాత ఏంచేశారు?"

"ఏమీ చెయ్యనక్కర్లేదని మరో సలహాదారు శాస్త్ర గ్రంథ ప్రమాణం చూపించాడు ఆయనెవరో రాశాట్ట, మంచి తెలివైనవాడుగా కనిపిస్తాడు. పారిశ్రామికోత్పత్తిలో అప్పుడప్పుడూ అధికోత్పత్తి పరిస్థితులు ఏర్పడి ఆర్థిక కాటకం వచ్చేస్తుందట. దానికి ప్రతిక్రియకూడా ఆయనే చెప్పేశాడు. అటువంటి పరిస్థితి ఏర్పడ్డప్పుడు ఉత్పత్తిఅయినసరుకు నాశనం చెయ్యాలట. ఇంకేం? సరుకులు నాశనం చెయ్యటానికి ఒక ఉపసంఘాన్ని నియమించి వెయ్యిరూపాయలు మంజూరు చేశాం, ఆపని సక్రమంగానేజరిగిపోయింది. చాలా మంచిపని చేశాం. ఇంకానయం. ఆ సరుకంతా ఖజాన డబ్బుపెట్టి కొన్నాంకాదు. లక్షరూపాయలు వృథాఅయి ఉండును.

ఇప్పుడు వెయ్యిరూపాయలతో పోయింది. అయితే నాశన మయినసరుకుకు పరిహారం ఇప్పించమంటున్నారు పారిశ్రామికులు. పరిహారమేమో ఇచ్చేదే! అయితే ఎంతా అనేదాని దగ్గిర పేచీగాఉంది!"

"పాపం తమకు చాలాగడ్డు సమస్యలే వచ్చిపడ్డాయి" అన్నాను.

"గడ్డా, గడ్డున్నరా? అందుకనే ఒక ఫర్మానా తయారుచేశాను, వింటారా?" అన్నాడు ప్రభువుగారు.

"అంతకంటేనా?" అన్నాను.

దిబ్బప్రభువుగారు కొద్దిసంగీత ధోరణిలో ఈ క్రింది ఫర్మానా చదివి వినిపించారు.

"దిబ్బపౌరులకు ప్రజాధ్యక్షుడు చేయు ప్రకటన: యుద్ధానంతరము ప్రజలలో ఐక్యభావమునశించి హేయమైన సంకుచితభావములు రేకెత్తినట్టు నాకు తోచుచున్నది. ఇప్పటి ప్రభుత్వము తమదేనని ప్రజలు మరువరాదు. వారు పారిశ్రామికులు మొదలైన అల్పసంఖ్యాక వర్గములవారితో సహకరించి దేశమునఉత్పత్తి పెరిగి దేశమునకుబలము చేకూరునట్లు చేయవలెను. వారు ప్రతిక్షణమున్నూ ప్రభుత్వమును బలపర్చవలెను. వారు ఇంకనూ త్యాగములు చేసినగాని దేశమునకు బలముచేకూరదు, తమతిండీ, గుడ్డా, ఇల్లూ, వాకిలీ, చదువూ, ఉద్యోగమూ—వీనికొరకే తాపత్రయపడు ప్రజలు స్వాతంత్ర్యార్హులు కాజాలరు. దేశములోని ప్రజలందరును స్వార్థత్యాగము, ప్రాణత్యాగము జేయ సమకట్టువరకును

దేశమునకు బలము చేకూరదు. కనీసము పది సంవత్సరముల పాటు ప్రజలు అన్నవస్త్రములను, రాజకీయ పౌరహక్కులను అడుగకుండ త్యాగము చేసినచో ఆపైన దేశము ఎట్టి సమస్యలనైనను ఎదుర్కొనజాలియుండును. ప్రజలు సంకుచిత బుద్ధినీ, ధనికవర్గమును చూచి ఓర్వలేనితనమును విడనాడి దేశక్షేమముకొరకు బలియగుదురు గాక!"



# కాలప్రవాహపు పాయలు

"వెధవ ఉక్క! వెధవ పక్క" అని తిట్టుకున్నాడు పురుషోత్తం. అతనికి అనిద్ర పట్టుకుంది. రోజూ ఇదే వరస. కొంతకాలంగా అతని శరీరానికి ఎంత చల్లదనమూ చాలటం లేదు. మంచుమీద పడి దొర్లితేనేగాని తపన చల్లారదనిపిస్తుంది. పక్క వేడి భరింప శక్యం కాకుండా వుంటుంది. డాక్టరు నడిగితే "నువ్వు నిద్రలేమితో బాధపడుతున్నావు. మందు రాసిస్తాను. రోజూ పడుకోబోయేముందు సేవించు" అని సలహా ఇచ్చాడు. పురుషోత్తం మందు కొన్నాడు కూడానూ. అయితే దాన్ని వేసుకోబుద్ధి పుట్టలేదు. ఈ మందులన్నీ కాలక్రమాన శరీరాన్ని చెడగొట్టేవే.

అసలే శరీరం చెడివుంది. ఒకప్పుడు కసరత్ చేసిన శరీరం పొట్టొ ఊదవొళ్ళయి ఊరుకుంది. ఏమవుతుంది? తిండి జాస్తి అయింది. కారులో తిరగటంమూలంగా రోజుకు ఫర్లాంగు నడకకూడా ఉండటంలేదు. ఆ రోజుల్లో శరీరం సర్కస్‌వాడి శరీరంలాగా ఉంచుకోవటం అదొక సరదాగా వుండేది. వారాని కొకసారి ఛాతీ నడుమూ కొలుచుకోవటం, దేంటికీ కేడా హెచ్చుతుంటే సంతోషించటం, తగ్గ

తూంటే కంగారుపడి మరింత కసరత్తు చెయ్యటం. ఏమిటో చాదస్తం. తనేం మాటలు మొయ్యాలా, పలుగుతీసుకు తవ్వాలా? తనకెందుకు సర్కసువాడి శరీరం? వ్యాపారంలో పుష్కలంగా డబ్బొస్తోంది. ఇంకా వస్తుందికూడానూ. ఇంక మూడుతరాలవరకూ తన కుటుంబానికి ఢోకా లేదు. రాష్ట్ర మంత్రుల్లో తనతో భాయి భాయీగా ఉండేవాళ్ళు ముగ్గురున్నారు తన పలుకుబడికేం లోపం లేదు. మనిషి కోరదగినవన్నీ తనకున్నాయి. పౌరోహిత్యాలు చేసుకున్న తన తాతా, హైయర్ ట్రెయినింగు అయి స్కూలు మేష్టరుపనిలో జీవితమంతా గడిపిన తన తండ్రీ ఈ క్షణాన తనను చూస్తే ఎంతో గర్విస్తారు. సందేహం లేదు. తన బావమరిది ప్రభుత్వ యింజనీరు. తన మామగారు పోలీసు సూపర్నెంటు చేసి రిటైరైనవాడు. తన అల్లుడు అమెరికాలో ప్రత్యేక వ్యవసాయ శిక్షణ పొందుతున్నాడు. తన కొడుకు నేత్ర వైద్యంలో ప్రత్యేకత సంపాదించటానికి ఇంగ్లండు వెళ్లాడు. ఇంగ్లండులో చక్కగా మంచు పడుతుంది. ఆ మంచుమీది నుంచి వచ్చేగాలికి శరీరం ఎట్లా అవుతుందో పురుషోత్తం ఊహించుకోగలిగాడు... తాను ఏ దారో అయి పుట్టవలసింది—ఈ దిక్కుమాలిన ఉక్కతో బాధపడకుండా !

ఎట్లాగూ నిద్ర రానేరాదు. పురుషోత్తం తన విజయ పరంపరను సింహావలోకం చేసుకోసాగాడు. తనకు ఇరవై నాలుగు వెళ్ళేదాకా జీవితం తడుముకోవటమే అయింది. ఆ తరవాత అది హైరోడ్డు పట్టింది. ఈ పాతికేళ్ళనుంచీ ఆ జీవితంలో చెప్పుకోదగిన పొల్లు రాలేదు. ఇరవై అయిదోయేడు

ప్రవేశించింది లగాయతు తాను తన గమ్యస్థానాన్ని స్పష్టంగా, నిశ్చలంగా చూడగలిగాడు. తప్పుడు ఆశయాలనూ, తనకు పనికిరాని భావాలనూ, వ్యక్తులనూ, అలవాట్లనూ, విశ్వాసాలనూ దూరంగా ఉంచగలిగాడు. ఈ పాతికేళ్ళ తపస్సుకూ ఒక్క విఘ్నమైనా కలగలేదు. ఈ తపస్సు నిర్విఘ్నంగా సాగటానికి తాను చాలామంది స్నేహితులను పోగొట్టుకోవలసి వచ్చింది. చాలామంది మిత్రుల సలహాలను తృణీకరించవలసి వచ్చింది. ఒకొక్కసారి తన అంతరాత్మనే కఠినంగా శాసించవలసి వచ్చింది. ఏమయితేనేం? తానుమాత్రం గీసుకున్న గీతమీద సూటిగా నడిచాడు. అశిధారావ్రతం ఫలించింది.

పురుషోత్తం తన మొదటి అయోమయ జీవితం తలుచుకుని నవ్వుకున్నాడు. ఆ రోజుల్లో తన మనస్తత్వాన్ని తలుచుకుంటే తనకే ఆశ్చర్యం వేస్తుంది. ఆ రోజుల్లో కొంత కాలం తాను సంఘాన్ని మరమ్మత్తు చెయ్యటం గురించి ఆలోచించాడు. తానొక గొప్ప రాతగాడు కావాలనికూడా ఆశించాడు. రాతగాళ్ళు సంఘానికేదో చేశారన్న భ్రమ తన కప్పట్లో వుండేది. వీరేశలింగం, గురజాడ అప్పారావు మొదలైనవాళ్ళ రచనలలో గల గొప్పతనం గురించి తాను కూడా ఆ రోజుల్లో చర్చించాడు. ఏవేవో ఆదర్శాలు పెట్టుకుని తాను కొన్ని రచనలు చేశాడు కూడానూ. చిత్రమేమిటంటే వాటిని మెచ్చుకున్న వాళ్ళున్నారు — తనకన్న మూఢులు!...ఆ రోజుల్లో తనకు "ప్రేమ" ఒక పెద్ద జీవిత సమస్యగా వుండేది. అందాకా యెందుకూ? తానప్పట్లో ఒకతెను ప్రేమించి, ఆమెకోసం తపించాడు కూడాను

ఆమెను పెళ్ళిచేసుకోకపోతే తన జీవితమంతా వ్యర్ధమవు తుందని కూడా అనిపించింది! ఎంత దుర్భ్రమ! ఏదీ? తానా మెను పెళ్ళాడలేదు. అయినా తన జీవితం మూడు పూలూ, ఆరు కాయలుగా వుందే...అప్పట్లో తనకింకొక జాడ్యం కూడా దాదాపు అంటుకుంది—సోషలిజం. కొంత మార్క్సు సాహిత్యం, లెనిన్ పుస్తకాలూ సంపాదించాడు కూడానూ. కాని వాటి మాయలో పడకముందే తన జీవితంలో పరి వర్తన కలిగింది. యింకా నయం—

పురుషోత్తం ఆలోచన మానేసి ఆలకించాడు. తల వాకిలి తలుపెవరో తట్టినట్టయింది. భ్రమపడ్డాననుకున్నాడు. కాని తలుపు తెరిచిన చప్పుడుకూడా అయింది. తన యింటికీ రాత్రివేళ ఎవరొస్తారు?

హాలులో శ్రీరాములు గొంతు వినిపించింది.

"అయ్యగారు నిద్రపోతున్నారు...ఉఁ హుఁ లేపటా నికి వీల్లేదు. మీ భోజనాలయాయా? అయితే ఈ హాలులో మంచాలు వేయిస్తాను పడుకోండి."

ఎవరో మెయిలులో దిగిఉంటారు. ఎవరిబాపతు చుట్టాలో. పోనీ, తన కేంమను పీడ? రేపు తెల్లారినాకే కన పడి కుశల ప్రశ్న చెయ్యవచ్చు.

## 2

ఒక అరగంట గడిచింది. అతిధుల సంభాషణా, నవ్వులూ హాలులోనుంచి వినిపిస్తున్నాయి. వచ్చినవారి సంఖ్య మొదట సరిగా తెలియలేదు. తరవాత యిద్దరున్నట్లు

తెలిసింది. అందులో వొకడు పురుషుడు, రెండవది స్త్రీ. యెవరా స్త్రీ పురుషులు? భార్యా భర్తలా? వాళ్ళు అతిథులల్లే ప్రవర్తించటంలేదు. స్వేచ్ఛగా, స్వగృహంలో వున్నట్టే మాట్లాడుతున్నారు. మగగొంతు తానెన్నడూ విన్నది కాదు; ఆడగొంతు విన్నట్టుంటమే గాక, అది చెవిని పడితే వొళ్ళు గగుర్పొడుస్తున్నది. తనకు జ్ఞాపకం వున్నంతలో ఏ ఆడదాని గొంతూ తనలో యిటువంటి వికారం కలిగించలేదు. ఈ యాభయ్యోపట ఆడదాని గొంతు వింటేనే వొళ్ళు జలదరించట మేమిటి?

వాళ్ళు భార్యా భర్తలే అయివుండాలి. ఎందుకంటే వాళ్ళు వొకరితో వొకరు యెంతో చనువుగా వుండికూడా వుద్రేకం లేకుండా మాట్లాడుకుంటున్నారు. భార్యా భర్తలు కాకపోతే యింత చనువు వెంట యింకెంతో వుద్రేకం వుండి తీరుతుంది.

"ఇక్కడ మంచినీళ్ళున్నాయేమో?" అన్నది స్త్రీ.

"ఆ బీరువాపక్కన కూజా వుంటుంది తాగు."

అన్నాడు పురుషుడు. అతనికి ఇల్లంతా తెలిసినట్టే కనబడింది. ఇంట్లో నౌకర్ల పేర్లన్నీ తెలిసినట్టుగా మాట్లాడాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే ఆమె అతిథిలాగే ప్రవర్తించింది గాని, అతను ఆతిథ్యం యిచ్చేవాడిలాగా ప్రవర్తించాడు. ఇంట్లో యెంతమంది పేర్లు వుచ్చరించినా తనపేరు మాత్రం యిద్దరిలో వొకరూ ఉచ్చరించలేదు.

తన ఇల్లు తమదిగానే వ్యవహరిస్తున్న ఈ జోడు ఎవరయిందీకూడా ఊహించలేక పోయినందుకు పురుషోత్తానికి

మండిపోయింది. లేచి హాలులోకి వెళ్ళి వాళ్ళ ఎదట పడదా మనుకున్నాడు. కాని భయం వేసింది. వాళ్ళను తాను పోల్చుకోలేకపోతే? కిందటేడు యిట్లాగే తన చెల్లెలి మొగుణ్ణి గుర్తించలేక పెద్ద "గ్రేడ్" తిన్నాడు. వద్దు, వద్దు. వాళ్ళు పడుకున్నాక వెళ్ళిచూస్తే సరి.

వాళ్ళు పడుకునే యత్నంలో ఉన్నారు కూడానూ.

"రెండుగంటలు కావస్తోంది. ఇంక పడుకుందామా? అసలే బడలివున్నావు" అన్నాడు పురుషుడు.

"మళ్ళీ పెందలాడే లేవాలి. చాలా పనివుంది. ఇంకో రెండుగంటలు మేలుకుంటే అదే తెల్లవారిపోతుందని చూస్తున్నా" అన్నది స్త్రీ.

"బెజవాడలో మీటింగులు చాలాచక్కగా జరిగాయి కదూ? ఆరోజు కారోజు ప్రజలలో ఎంత చైతన్యం వస్తున్నదీ చూస్తున్నావా?"

"ఎందుకు రాదూ? ఎవరి జీవితాలు వాళ్ళు అర్థం చేసుకుంటున్నకొద్దీ ఆ జీవితాలను మార్చుకునే చైతన్యం దానంతట అదే వస్తుంది. వాళ్లు జీవితాన్ని అర్థం చేసుకునే టట్టు చెయ్యటమే మన ధర్మం."

"రేపు మైదానంలో జరిగే మీటింగు చూడు ఎట్లా వుంటుందో. పదిహేను వేలకు తక్కువ రారు."

"ఎందుకు రారూ? మీ స్వక్షేత్రమైనప్పుడూ? కిందటేడు క్లబ్బులో మీటింగు పెడితే రోడ్లనిండా జనం పూరాగలా?"

కాసేపు ఇద్దరూ మౌనంగా వున్నారు.

పురుషోత్తం ఆశ్చర్యపడ్డాడు. ఎవర్ని "లెక్చర్లిచ్చే పండితుడు?" కింద టేడు క్లబ్బులో మీటింగేమిటి? తనకు మీటింగూ జ్ఞాపకంలేదు; అందులో మాట్లాడినవాడూ జ్ఞాపకంలేదు. వీళ్ళెవరో లోకోద్ధారకుల్లాగా మాట్లాడుతున్నారు. అటువంటివాళ్ళెవరూ తన బంధుమిత్రుల్లో—కనీసం తన ఇంటికి చొరవగా వచ్చేవారిలో లేరే!

"మన బెజవాడ మీటింగునుగురించి ఈపూట మెయిల్లో బాగా రాశారు చూశావా?"

"ఒక్కొక్కసారి మెయిల్లో కాంగ్రెసు వ్యతిరేక వార్తలు బాగానే యిస్తారు. మీరు పార్లమెంటు ఎన్నికల్లో గెలిచినప్పుడు మిమ్మల్ని గురించి పదిలైన్లు రాశారు."

"దానికేమిట్లే?"

వీడెవడో పార్లమెంటు మెంబరుకూడానా? ఆలోచిస్తున్నకొద్దీ పురుషోత్తానికి మతిపోతోంది, వీళ్ళిద్దరూ తనను వంచించటానికి కోతలు కోస్తున్నారేమో నని సందేహించాడు. కాని తాను వింటున్నట్టు వాళ్ళకేం తెలుసూ?

అకస్మాత్తుగా పురుషోత్తానికి జ్ఞాపకం వచ్చింది. ఇవాళ్టి "మెయిల్" తన తల గడాకిందే వుంది. పురుషోత్తం చప్పుడు చెయ్యకుండా దాన్నితీసి బాత్‌రూమ్‌లోకి వెళ్ళి లైటువేసి గబగబా బెజవాడ మీటింగు వార్తకోసం చూశాడు. ఎక్కడా అటువంటి మీటింగేలేదు. పేపరుమీది తేదీ చూశాడు. ఇవాళ్టిదే.

యింక సందేహమెందుకూ? వీళ్ళిద్దరూ ఏ వెర్రాసు

పత్రినుంచో పారిపోయి వచ్చిన బాపతై వుంటారు. ఒక్కొక్క రకం వెర్రెని పట్టుకోవటం కష్టం. వీళ్లు అటువంటి బాపతే అయివుంటారు. అందుకే ఎంత ఆలోచించినా వీళ్లెవరయిందీ తనకు తెలియటంలేదు. వీళ్ళను యిప్పుడే శ్రీరాములుచేత బయటికి గెంటించటం మంచిది.

బాత్‌రూమ్ లైటు ఆర్పేసి పురుషోత్తం బెడ్‌రూమ్ లోకి వచ్చాడు.

అవతల హాలులో నిశ్శబ్దంగా వుంది. 'అతిథులు' నిద్రపోతున్నారేమో.

చప్పుడు చెయ్యకుండా బెడ్‌రూమ్ తలుపు తెరిచి పురుషోత్తం హాలులోకి అడుగుపెట్టాడు.

## 3

హాలులో లైటు వేసిన మరుక్షణం పురుషోత్తం ఠొయ్యబారిపోయినాడు. వాకిలి కెదురుగా మంచంమీద పడుకున్న స్త్రీ తను వూహించినట్టు యేపాటిక, ముప్పైయేళ్ళదీ కాదు. దాదాపు నలభై అయిదేళ్ళది. ఆమెను తాను చూసి రెండు పుష్కరాలు దాటినా యింకా ఆ మొహం నిన్న చూసినట్టే వుంది. యెందుకుండకూడదూ? ఒకప్పుడామె కోసం తాను తపించలేదా? ఆ తపనముందు యేవుక్క ఆగుతుంది? యే పక్కవేడి ఆగుతుంది?

మనిషి యిప్పటికీ యెంత అందంగా వుంది! ఆమె కేసి చూస్తున్నకొద్దీ కాలచక్రం వెనక్కు తిరిగి తాను నుళ్ళ

ఇరవైమూడేళ్ళ యువకుడైనట్టనిపించింది. తాను మొట్ట మొదటిసారి ఆమె చెయ్యి పట్టుకోవటం జ్ఞాపకంవచ్చి శరీరం వేడెక్కినట్టయింది—నీళ్ళకుండలాగా వుండే తన శరీరం! తన తండ్రిని ధిక్కరించి ఈమెను పెళ్ళిచేసుకోవటానికికూడా నిర్ణయించాడు. ఆవిధంగా ఈమెకు తాను ఉత్తరం రాశాడు కూడానూ. అదే తన జన్మలో రాసిన నిజమైన ప్రణయలేఖ. కాని ఆ లేఖ పోస్టుడబ్బాలో పడలేదు. చినిగి ముక్కలై పాకీ డబ్బాలో పడిపోయింది. భూమిలోనూ, వాయువులోనూ, నీటిలోనూ వుండే రసాయనికాలు తన ప్రణయసందేశాన్ని అర్థంచేసుకోకుండానే జీర్ణించుకున్నాయి. ఆ లేఖను చించెయ్యటమే తనజీవితంలో ప్రధానమైన పరివర్తన. అంతవరకూ కాలిబాటల వంపులలో పడి తిరుగుతున్న తన జీవితం ఆ క్షణంనుంచీ హైరోడ్డు పట్టింది.

చిత్రం. ఆమెకేసి చూస్తుంటే ఆమే తన నిజమైన భార్య అయినట్టూ, అవతల బెడ్‌రూమ్‌లో పడుకునివున్న గుర్రం మొహం మనిషి ఎవరో పరాయిదయినట్టూ అనిపిస్తోంది.

ఇంతకీ ఈమె ఇక్కడికెందుకు వచ్చినట్టు? ఆ మగవాడు—తాను నిలబడిన చోటికి అతని తలమాత్రమే కనిపిస్తోంది—ఆమె భర్త అయివుంటాడు. వీళ్ళిద్దరూ ఈ రాత్రివేళ తన ఇంటికెందుకు వచ్చారు. ఈ పాతికేళ్ళనుంచీ ఈమె జాడే తెలీదు తనకు. అటువంటిది తనజాడ ఎట్లా కనిపెట్టింది. తెల్లవారగానే ఈమెను చూసి తనభార్య అల్లరిపెడుతుందేమో, ఆమెను పెళ్ళాడకముందు మరొక స్త్రీని పెళ్ళాడి

నంతపనీ చేశానని తాను భార్యతో ఎన్నడూ చెప్పలేదు కూడాను. తాను భార్యకు తెలియకుండా దాచిన జీవిత రహస్యం ఇదొక్కటే.

నిద్రపోతున్న ఆ పాత ప్రియురాలిని చూస్తుంటే అనేకమైన భావాలు ఒకేసారి పురుషోత్తంలో కలిగాయి. దగ్గరికి పోయి ఆమెను ముట్టుకుందామనిపించింది. శ్రీరాముల్ని పిలిచి యిప్పుడే వీళ్ళను వెళ్ళగొట్టింతామనిపించింది. ఆమెను లేపి మాట్లాడాలనిపించింది. ఆమె లేవకమునుపే కారులో ఎక్కి దూరంగా ఏ వూరైనా పోదామనిపించింది.

ఈ భావసంఘర్షణలోనే అతను రెండడుగులు ముందుకువేసి ఆమెను సమీపించాడు. అతని గుండెనెవరో పట్కార్లుపెట్టి లాగుతున్నట్టుంది. ఈమెను తానెందుకు పెళ్ళాడలేదు? దేనికోసమై తా నీమెను త్యాగంచేశాడు? ఈమెకన్న విలువైనది తాను జీవితంలో ఏం సాధించాడు? ప్రేమ అనేది వట్టి శుష్కపదమని తాను నమ్మినమాట నిజమే కాని, ఈ నమ్మకం ఈమె దూరంగా వుండగా కుదిరినంతగా ఈమె కనిపిస్తుంటే కుదరటం లేదేం? "ఈమెను పెళ్ళాడక పోతే అన్యాయం చేసినవాణ్ణవుతానేమో!" అన్న సందేహం ఆనాడు తనకు కలిగినప్పుడు, "ఆఁ. సింగినాదంకాదూ! నాకన్న మంచిమొగుణ్ణే సంపాదించుకుంటుందిలే! ఏమిటి నా ఆధిక్యత?" అని తన మనస్సును సమాధాన పరుచుకున్నాడు. ఆమె పెళ్లాడినవాడు తనకంటె అధికుడో కాడో తెలుసుకునే అవకాశం తనకిప్పుడు లభించింది.

పురుషోత్తం రెండో పక్కకేసి తిరిగి నివ్వెరపోయి

నాడు. ఆ పురుషుడు ఎప్పుడు మేలుకున్నాడోగాని పక్క మీద లేచి కూచుని తనకేసి చిరునవ్వు నవ్వుతున్నాడు.

అతనికీ తనలాగే ఏ యాభయ్యో వుంటాయి. అయినా శరీరం ధృఢంగావుంది. యౌవనపు లక్షణాలింకా చాలా మిగిలివున్నాయి. జుట్టు తనకు నెరిసినంతగా నెరవలేదు. తన జుట్టుకన్న వొత్తుగాకూడా వుంది. చిత్రమేమిటంటే బాగా చూచిన మొహంలాగాకూడా వుంది. అయినా జ్ఞాపకం రావటంలేదు.

అతనికీ తనకూ మధ్య మౌనంకన్న కూడా అతని వెటకారపు చిరునవ్వు భరించటం తనకు కష్టమనిపించింది.

"ఎక్కడ చూశానో జ్ఞాపకం రావటంలేదు" అన్నాడు పురుషోత్తం.

"నన్ను నువు ఎక్కడా చూడలేదు—అద్దంలో తప్ప. నా పేరు పురుషోత్తం. పేరడుగుల పురుషోత్తం" అన్నాడా మనిషి.

## 4

తనతో మాట్లాడుతున్నదీ, తనను చూసి వెటకారంగా నవ్వుతున్నదీ తన భూతమేనని అర్థం చేసుకోవటానికి పురుషోత్తం బుర్రకు చాలా శ్రమ అయింది. ఇది అచ్చగా భూతంకూడాకాదు. ఈ భూతం వర్తమానానికి చేరుకుంది. సామాన్యంగా భూతాలు ఈపని చెయ్యలేవు. వెనక తన తల్లి సోదిలోకి వచ్చి అంతకుపూర్వం పదిహేనేళ్ళక్రితం తనకుండిన కోరికలన్నీ ఏకరువు పెట్టింది. సోదిల్లోకి వచ్చింది

తన తల్లే అని అనుకోవటానికి ఎన్నో బలమైన దాఖలాలు దొరికాయిగాని ఆ చనిపోయిన ఆవిడ పదిహేనేళ్ళ కాలంలో కొంచెమైనా మారకపోవటం అతనికి చాలా వింతగా తోచింది.

ఈ భూతం అట్లాకాదు. దీనికి తనకున్నంత వయసూ వుంది. ఇది కాలప్రవాహపు మరొకపాయలో కొట్టుకుపోయి మరొక పరిణామానికి గురిఅయింది. మిగిలిన విషయా లెట్లా వున్నా పై చూపులకు తనకన్న ఇతనే బాగున్నాడు. నడుము సన్నగా వుంది. మనిషి ఇంకా వ్యాయామం చేస్తున్నవాడ ల్లేనే ఉన్నాడు. మొహం కళగా వుంది. మూతి బిగువుగా వుంది. వయస్సు తనలో తెలిసినంతగా తెలియటంలేదు.

తన ఈ ప్రతిబింబాన్ని చూసి ఏమనుకోవాలో కూడా పురుషోత్తానికి తెలియటంలేదు. కాకపోయినా బతికున్న వాళ్ళకి భూతాలుండటమేమిటి? ఈ భూతం తన సజీవత్వాన్ని అవమానిస్తోంది. ఇటువంటి అవమానాన్ని సహించటం పురుషోత్తానికి దుర్భరమనిపించింది. ఒక్కొక్క అద్దంలో చూసుకుంటే వున్న శరీరచ్ఛాయకంటె యెక్కువ కనిపించి నట్టు ఈ భూతం తనకన్న ఒక్కపిసరు యెక్కువే సజీవంగా వుంది.

ఇంతలోనే పురుషోత్తానికింకొక ఆలోచన వచ్చింది. ఆ మనిషి తనకు భూతమైతే. అతనికి తనూ భూతమేగా? తనను చూసి అతను ఏమనుకోవాలి? అయినా మరుక్షణమే పురుషోత్తానికి అతన్నిగురించి విచారం పోయింది. అతను దయ్యమై తన వెంట పడ్డాడుగాని, తాను అతని వెంటపడ లేదే! అతన్ని గురించి తను యెందు కాలోచించాలి?

మొట్టమొదటగా అతనే మాట్లాడాడు;

"ఆనాడు మనం ఈవిడకు ఉత్తరం రాశాం చూశావా? ఆ మరుక్షణంనుంచీ నీదారీ నాదారీ వేరయింది. ఆ ఉత్తరం నువ్వు చించేశాననుకున్నావు. నేను దాన్ని పోస్టుచేశాను. తరవాత ఒక వారానికి మేమిద్దరం పెళ్ళాడాం. ప్రపంచంలో ఆదర్శప్రాయమైన పెళ్ళి కోటికి వొకటి జరుగుతుంది మాది అటువంటిపెళ్ళి. జీవితంలో యింకేది లేకపోయినా ఒక్కమనిషి నీపక్క వున్నదన్న తృప్తి నీకు కలిగిన తరవాత ఆ మనిషికోసం యేది త్యాగం చెయ్య కూడదు, చెప్పు!"

అతను ఆగాడు. పురుషోత్తానికి ఏదో అరమవుతున్నట్టుగా వుంది. అవును, ఈ రెండో పురుషోత్తమే తన అయోమయత్వం. ఆరాత్రి వీడు తనను వదిలి ఎడంగా పోయినాడేమో తన మనస్సు తేరుకుని నిర్మలమైనట్టుగా అయింది. అందుకే ఆ క్షణంనుంచీ తన కర్తవ్యాన్ని కళ్ళ యెదుట చూసినట్టు తెలుసుకుని దాన్ని ఆచరించగలిగాడు.

"నేనీ పనిచేయటం ధర్మంకూడా అయింది. ఎందుచేతనంటే మా పెళ్ళినాటికే ఈవిడకు నెల తప్పింది."

పురుషోత్తం ఉలిక్కిపడి, "నిజమా?" అన్నాడు. ఆయన ఆ పక్క నుంచంమీద నిద్రపోతున్న స్త్రీకేసి చూసి ఏదో జ్ఞాపకం వచ్చినవాడల్లే నిట్టూర్చాడు. నిప్పుసెగకు వెన్నకరిగినట్టు అతని మనస్సులో యే మూలో కొంచెం కరిగి కెలకబారింది.

"మా పెళ్ళిఅయిన యెనిమిది నెలలకు మగపిల్లవాడు కలిగాడు."

"వాడి పేరేమిటి? ఎక్కడున్నాడు? ఎట్లావుంటాడూ?" అన్నాడు పురుషోత్తం ఆదుర్దాగా.

"వాడు మహావీరులు జీవించేటట్టు జీవించే వీరుడల్లేనే మరణించాడు—తెలంగాణాలో!"

పురుషోత్తానికి వికారం కలిగినట్టయింది. తన కొడుకు కమ్యూనిస్టులతో చేరి తుపాకీతో చావటమా? ఈ సంగతి పొక్కితే తననుగురించి తన మిత్రులంతా ఏమనుకుంటారు? తన యెదురుగా వున్న తన ప్రతిబింబానికి ఈ కొడుకుతో ఎక్కువ సంబంధం ఉండివుంటుందనీ, వాణ్ణి అటువంటి మార్గాన పెట్టినవాడు ఇతనే అయివుంటాడనీ పురుషోత్తానికి ఆ క్షణంలో తట్టలేదు.

"నా ఇన్నాళ్ళ జీవితం టూకీగా చెప్పేస్తాను. నేనూ నా భార్యా గొప్ప దారిద్ర్యం అనుభవించాం. ఆరోజుల్లో నేను అడ్డమైన విషయంగురించీ పత్రికలకు రాస్తూవుండే వాణ్ణి. అన్నింటినిగురించీ రాశానుగాని దారిద్ర్యం గురించి రాయలేను ఎందుకు రాయలేదో నువ్వర్థం చేసుకోగలవు-ఇతర దరిద్రులుకూడా నాతరగతేనన్నది గుర్తించటం ఇష్టంలేక; నా దారిద్ర్యం నా వొక్కడిదే నని నన్ను నేనే వంచన నుండి బయటపడటానికి నా భార్య చాలా తోడ్పడింది. ఇద్దరం కలిసి సోషలిస్టు సాహిత్యం చాలా చదివాం. దాని వల్ల ఒక మేలు కలిగింది. జీవితానికి వొక తాత్కాలిక

వ్యాఖ్యానం దొరికింది. జీవిత సంఘటనలు పరస్పర సంబంధం గలవన్న విశ్వాసం కుదిరింది.

"భుక్తికోసం ప్రెస్‌లో పనికి కుదిరాను. అది పెద్ద ప్రెస్. ప్రెస్ వర్కర్ల యూనియన్ పెట్టాం. దానికి నాయకుణ్ణయినాను——"

"సమ్మెలు జరిపించావా?"

"మహారాజుగా! సమ్మెలంటే ఏమిటి? నీకు రాజకీయాలు, పనివాళ్ళకి జీవితం! చావుబతుకుల సమస్య! సమ్మెను గురించి కుడిచి కూచున్న ధోరణిలో మాట్లాడకు."

"నువు కమ్యూనిస్టులతో చేరావా?"

"ఇంకెవరితో చేరమంటావు? నాకు రాజకీయాలంటే మొదటినుంచీ ఏవగింపుగానే వుండేది. మనం రాజకీయాల కృత్రిమ ముఖమే చూశాం. జీవితానికీ రాజకీయాలకూ అవినాభావ సంబంధం గల చోట నేను మనస్ఫూర్తిగా రాజకీయాలలో ప్రవేశించాను... నా జీవితంలో వొక్క రోజు వ్యర్థంకాలేదు. శ్రీశ్రీ చెప్పినట్టు అసంఖ్యాకులైన "దగాపడిన తమ్ము"లకు జీవితంలో వొక ఆశా, వొక కార్యక్రమం ఇవ్వటంకంటె నీ జన్మకు సార్థకత యేముంది? రేపటి ప్రపంచం ఈ దగాపడిన తమ్ములది. అది రాసిపెట్టివుంది. వీళ్ళు రేపు ఏడవటం మానేస్తారు. తాము దగాపడ్డ సంగతి కూడా మరిచిపోతారు. యెత్తు పెరుగుతారు అజాత శత్రువులౌతారు. జీవితాన్ని నిర్విఘ్నంగా నిర్మించుకుపోతారు. న్యాయం, ప్రేమా, సత్యం అన్న పదాలకు సార్థకత

చేకూరుస్తారు. ఈ పరిణామానికి అనుకూలంగా నిలబడ తావా? లేక దీనికి ప్రతికూలంగా నిలబడి మరింత రక్తపాతానికీ, మరింత దురన్యాయానికీ, మరింత హేయ చరిత్రకూ కారకుడ వౌతావా? నా ధర్మం నేను ఏనాడో నిర్ణయించాను."

"నువ్వు కమ్యూనిస్టువు. ఏమీ సందేహం లేదు. ఇందులో ఏదో కుట్ర ఉంది. నువ్వు నా ప్రతిబింబానివి కావు. నా పేరు పెట్టుకుని నా యింట్లో ప్రవేశించావు." అన్నాడు పురుషోత్తం

"నన్ను గురించి ఆలోచించినకొద్దీ రొంపిలో ఇరుక్కుంటావు. నీ సంగతి ఆలోచించు. 'సత్యం' గురించి ఎవరో వెటకారంగా పద్యాలు రాస్తే ఎన్నోసార్లు చదివి స్నేహితులతో ఆనందించావు. నువ్వూ నీ స్నేహితులూ శాంతినిగురించి వేళాకోళంగా మాట్లాడుకున్నారు. నీ సంస్కారం ఏమిటి? నీ మానవత్వానికి కొలబద్ద ఏమిటి? నీ విశ్వాసాలకు పునాది ఏముంది? రేపు పోలీసుల చేతుల్లో తుపాకులు కమ్యూనిస్టు తుపాకులవుతే కమ్యూనిజంలో ఎంతో మంచి చూస్తావు నువ్వు. కమ్యూనిజంలో ఆవగింజంత అనుమానాస్పదంగా కనిపిస్తే నేను దాన్ని గురించి తెలిసినవాళ్ళతో చర్చిస్తాను. ఇరవైనాలుగేళ్ళనుంచీ ఈ కమ్యూనిజం గురించి తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్న నాకంటె, నీకు దాని లోతుపాతులు తెలుసునంటే నేను ఒప్పుకోను."

"మీ కమ్యూనిస్టులు నడిచే జీవితాన్ని ఒక ధోరణిలో యెందుకు నడవనీరు? ప్రపంచమంతా తల్లకిందులు చేస్తామనే మిమ్మల్ని యెవరు సహిస్తారు?"

"ప్రపంచం మారకుండా నువు చేస్తానని మాటఇయ్యి. కమ్యూనిస్టుల నందర్నీ నేను విరమింపజేస్తాను. నువు ఎవరి ప్రతినిధివో నాకు తెలీదుగాని లోకాన్ని కమ్యూనిజంనుంచి రక్షించటానికి కంకణం కట్టుకున్న పెద్ద తరగతి పెట్టుబడి దార్లు ప్రపంచం మారకుండా చెయ్యాలని చేసే ప్రయత్నం ఒక్కటీ కనిపించటంలేదు. వారు తెచ్చిపెట్టే ప్రతి సమస్యకూ కమ్యూనిజం పరిష్కారమార్గం చూపిస్తుంది. ఓపికగా కూర్చుని సరిఅయిన విషయాలు సంవాదించు. ఇవాళ పెట్టుబడిదారీకి ప్రపంచ యుద్ధాలు తెచ్చి పెట్టటమూ, మానవజాతిలో పైశాచికశక్తులను లేవదీయటమూ, మారణ సాధనాలు సృష్టించటమూ తప్ప ఇంకేమీ చాతగాదని నేనంటున్నాను. చాతనయితే నేనన్నది తప్పని రుజువు చెయ్యి."

"నువు చేసే అర్థంలేని సిద్ధాంతాలన్నీ తప్పని రుజువు చెయ్యటంతప్ప నాకింకేమీ పనిలేదనుకున్నావా?"

"అయితే అభిప్రాయాలు ప్రకటించకు. నీ అజ్ఞానం నాకు శాసనమైతే యెంత హాస్యాస్పదంగా ఉంటుందో చూడు. నామటుకు నేనూ నీ అంతవాణ్ణేకద!"

ఈ మాట వినగానే పురుషోత్తానికి అతనిమీద ఏదో అభిమానం కలిగింది. ఆ మనిషి తనను అన్నా, తమ్ముడూ

కన్న యెక్కువైనవాడు—సాక్షాత్తూ తనే. అతని వాదన ఎంత వెగటుగా వున్నా, యింకో పరిస్థితులలో తానుకూడా అటువంటి వాదన చేసి ఉండేవాడన్న మాటేగా? ఎందు కితనిలో ఘర్షణ పడటం?

"నీకు నావల్ల ఆర్థికంగా యేదైనా సహాయం కావాలంటే చేస్తాను. పైకి ఎంత ప్రగల్భాలు పలుకుతున్నా లోపల నీ జీవితాన్ని నువ్వు ద్వేషిస్తూనే ఉండాలి. తానున్న పరిస్థితుల్ని సమర్థించుకునే దౌర్బల్యం ప్రతి వ్యక్తికీ ఉంటుంది. అందుకే యిట్లా మాట్లాడుతున్నావు. కావలిస్తే నా వ్యాపారంలో భాగం ఇస్తాను. లేదా పెట్టుబడి ఇస్తాను. నీ యిష్టంవచ్చిన వ్యాపారం చేసుకో. నీ సొంత కొడుకును పోలీసులు కాల్చి చంపినందుకు గర్విస్తున్నావంటే నీ అంతరాత్మ యెంత హీనస్థితికి వచ్చిందీ తెలుస్తోంది. నీ కింకెవరన్నా పిల్లలున్నారా?"

"లేరు. నాకు నీ సహాయం అవసరంలేదు. నేను పైకి రాలేదని నువ్వు విచారించకు. గడిచిన ఎన్నికల్లో పార్లమెంటు సీటుకు ఎన్నికైనాను. నన్ను ప్రజలు తమ నాయకుల్లో ఒకడుగా గుర్తించారు. యివాళ మా క్లబ్బులో మీటింగు. నాకూ ప్రజలకూ గల సన్నిహిత సంబంధం యెటువంటిదో నువ్వే చూద్దువుగాని."

పురుషోత్తానికి మండిపోయింది.

పచ్చి అబద్ధాలు! నన్ను మోసం చెయ్యకు. నాకు తెలీకుండా మా క్లబ్బులో మీటింగెవరు పెట్టారు. నిన్న

బెజవాడలో మీటిం గయిందన్నావు. పత్రికల్లో ఆ వార్త లేదు. ఇట్లా నన్ను మోసం చేస్తావా ?"

"నువ్వింకో ప్రపంచంలో ఉన్నావు. నా మాటలు నీకు అబద్ధంగానే కనబడతాయి."

బెడ్‌రూమ్‌లో అలికిడి అయింది. పురుషోత్తం భార్య కేక పెట్టింది. పురుషోత్తం గబగబా లోపలికి వెళ్ళాడు.

"ఏమిటో చదువుతున్నట్టున్నారు. నింపాదిగా చదువుదుకూ ! తల పగిలిపోతోంది !" అన్నదామె.

పురుషోత్తం మాట్లాడలేదు.

"ఈ అపరాత్రివేళ ఎందుకొచ్చిన చదువు ? పడుకుని నిద్రపోరాదూ ?"

పురుషోత్తం మూగు మాట్లాడకుండా పక్కమీద పడుకున్నాడు. అతనికి నిద్ర పట్టివుండాలి. అతను మళ్లీ కళ్ళు తెరిచేసరికి ఏడుగంటలు దాటింది.

లేస్తూనే అతను తన అతిథులకోసం వెతికాడు. వారి జాడ లేదు....

ఆ రోజల్లా అతనికి కలలాగేవుంది. క్లబ్బుకు వెళ్లాడు. మీటింగూలేదు యేమీలేదు. ఉండదని అతనికి తెలుసు. అందుచేత ఆశ్చర్యం కలగలేదు. కాని యేదో జనం కలకల వినిపిస్తున్నట్టే వుంది. ఏదో ఉపన్యాసం అస్పష్టంగా వినిపిస్తున్నట్టే వుంది. మధ్య మధ్య ప్రేక్షకుల కోలాహలం కూడా ఒకటి రెండుసార్లు వినిపించిం దనిపించింది.

స్నేహితు లెవరో "ఎందుకట్లా ఉన్నావ్?" అంటే, రాత్రిల్లా నిద్రలేదనీ వంట్లో బాగాలేదనీ చెప్పాడు. ఆ సాయంకాలం ఏ స్నేహితుడి ఇంటికో వెళ్ళి చిత్తుగా తాగి కారులో యింటికి వెళ్ళి పడుకున్నాడు.

## 5

వారం రోజుల అనంతరం పురుషోత్తం యత్నాలు ఫలించి అతను ఒకప్పుడు పెళ్ళాడదామనుకున్న స్త్రీ వార్త తెలిసింది. ఆమె తన పెళ్ళి అయిన కొద్ది రోజులకే ఆకస్మికంగా మరణించిందట. కారణం తెలియలేదు. ఆసమయానికి ఆమె గర్భిణిగా వున్నదీ లేనిదీ తెలియరాలేదు.

## X జాంబవంతుడి కల

జాంబవంతుడు మహాబలశాలి. దీక్షాపరుడు. స్వామి కార్య తత్పరుడు. ఆదర్శప్రియుడు. స్వాతంత్ర్యవాది. సుగ్రీవుడు వాలి పీడ వదలించుకుని రాజ్యానికి వచ్చినప్పుడు కిష్కింధ ప్రజలు ఓ బలశాలి అయిన నియంతను వదిలించుకుని స్వాతంత్ర్యం సంపాదించారు. అందుచేతనే జాంబవంతుడు సుగ్రీవుడి పక్షమైనాడు. వాలి తిరిగి వచ్చినాక సుగ్రీవుడితోబాటు జాంబవంతుడుకూడా ఇల్లూ వాకిలి వదిలి ఋష్యమూకంమీద ఆకులూ, అలములూ మేస్తూ అజ్ఞాతంలో గడిపాడు.

శ్రీరామచంద్రుడు ఋష్యమూకానికి వచ్చేవరకూ కిష్కింధ రాజకీయాలకు విముక్తి లేకపోయింది. శ్రీరాముడు వాలిని చంపటానికి ఒప్పుకున్నాడనేకాదు. ఆ అవతార పురుషుడు రావణుడిమీదకూడా ధ్వజమెత్తాడు. ఇది చాలా ప్రధానమైన విషయం. ఎందుచేతనంటే కిష్కింధ ప్రజలింకా స్వాతంత్ర్యార్హులు కారు. వారికి కావలసింది వాలివంటి నియంతే. కిష్కింధలో గట్టి ప్రభుత్వం ఉంటేనే

గాని రావణుడు కిష్కింధను మింగేస్తాడని ప్రజల భయం. ఈ భయంతో వాళ్ళు వాలి దుండగాలన్నీ సహించారు. వాలి రావణుణ్ణి పట్టుకుని మూడు చెరువుల నీళ్ళు తాగించిన సంఘటన వాళ్ళు ఎన్నడూ మరవలేదు. రావణుడు కిష్కింధను ఎన్నడూ జయించగోరలేదు. కాని ఆ సంగతి ప్రజలకెట్లా తెలుస్తుంది?

వాలిలేని కాలంలో సుగ్రీవుడి పరిపాలనను ప్రజలు సాగనివ్వలేదు అడుగడుగునా సుగ్రీవుణ్ణి వారు ముప్పతిప్పలు పెడుతూవచ్చారు. అంగదుడూ, నీలుడూ, నలుడూ, జాంబవంతుడూ, హనుమంతుడూ అండలేకపోతే సుగ్రీవుడు ఏనాడో పారిపోవలసినవాడు. వాలి వచ్చిన మరుక్షణం సుగ్రీవుణ్ణి వీళ్ళుకూడా రక్షించలేకపోయినారు. అందరూ కలిసి ప్రాణాలు దక్కించుకోవలసి వచ్చింది.

శ్రీరామచంద్రుడు అన్న రెండుమాటలూ నిలబెట్టుకున్నాడు. వాలి చచ్చాడు. రావణుడూ చచ్చాడు. కిష్కింధలోనూ లంకలోనూ కూడా ప్రజాప్రభుత్వాలేర్పడ్డాయి. అయోధ్యలో—చెప్పనేఅక్కర్లేదు—రామరాజ్యం ఆరంభమయింది.

కాని జీవితంలో—రాజకీయ సాంఘిక జీవితంలో—జాంబవంతు డాశించిన మార్పు రాలేదు. మొదటిసంగతి, కిష్కింధలో రాక్షసగణం సంఖ్య హెచ్చింది. లంకకూ కిష్కింధకూ ఏర్పడిన కొత్త సంబంధాలను పురస్కరించుకుని ఇది తప్పనిసరేమో అనుకున్నాడు జాంబవంతుడు. కాని ఈ రాక్షసులు కిష్కింధలో అనుభవించే హక్కులు

మామూలు ప్రజలకు కూడా లేకుండా ఉన్నాయి. ఇదెం దుకో జాంబవంతుడు ఊహించలేక పోయినాడు. వీరిని గురించి ఆరాతీయగా వీరిలో చాలమంది విభీషణపక్షంవారు కారనీ, కేవలం రావణపక్షీయులనీ, యుద్ధకాలంలో అనేక లక్షల కిష్కింధా పౌరులను హతమార్చిన వారనీ జాంబ వంతుడికి తెలిసివచ్చింది. కాని అడిగేవారెవరు? కావ టానికి జాంబవంతుడు కూడా ఒక మంత్రే అయినా, అతని కిప్పుడు సుగ్రీవుడి దర్శనమే లభించదు. ఈ రాక్షసుల కందరికి రాముడి అధికార్లు రాసి యిచ్చిన యోగ్యతాపత్రా లున్నాయి. వారు కిష్కింధయొక్క విదేశ వ్యాపారాన్ని గుత్తకు తీసుకోవటమేకాక, కిష్కింధ నామ రూపాలు లేకుండాపోయే ఒడంబడికలు తయారుచేసి వాటిమీద సుగ్రీవుడిచేత సంతకాలు పెట్టిస్తున్నారు.

ప్రజల స్థితి చూడబోతే అధ్వాన్నం చతుర్మధ్యంగా ఉంది. ప్రజా స్వాతంత్ర్యసమరంలో వీరోచితంగా ప్రాణా లర్పించినవారి కుటుంబాలకు ఆలనా, పాలనాలేదు. గెలిచి వచ్చిన వారిగతి కూడా విచారించేవారు లేరు. సైన్యంలోకి కొత్త అధికార్లు వచ్చారు. అందులో చాలామంది వాలికి నమ్మిన బంట్లు. మరికొందరు యుద్ధకాలంలో రావణుడి సొత్తుసంపాదించుకున్న దేశద్రోహులు. కొందరు సాక్షాత్తూ రావణుడి యుద్ధ నిపుణులే.

కిష్కింధలో ఒకవంక విందులూ, తాగుళ్లూ, మేజు వాణీలు, నృత్యాలూ, రాక్షస స్త్రీలతో విహారాలూ,

మరొకవంక దారిద్ర్యమూ, ప్రజల బాధలూ, అమూకీదార కని రాక్షస చర్యలూనూ, మంచి మంచి తినుబండారాలూ, తాగుళ్లూ, ఇళ్ళూ, ఉద్యోగాలూ ప్రజలకు అందుబాటులో లేవు. కిష్కింధ బజార్లలో రాక్షస భాషా, రాక్షస సంప్రదాయాలూ కనిపిస్తున్నాయి. రావణ కుంభకర్ణులను కీర్తించుతూ పుస్తకాలు వెలువడుతున్నాయి.

కుర్రకారు విప్లవకారులు రహస్యకూటాలు ఏర్పరుస్తున్నట్టు వినికిడి జాస్తి అయింది. రోజూ అరెస్టులూ, ఖైదు శిక్షలూ జరుగుతున్నాయి. ఋష్యమూకం గుహలలో కొందరు విప్లవవాదులు చేరినట్టు వార్త వచ్చింది. ఆ ప్రాంతంలోకి షికారుకూ, పిక్నికుకూ వెళ్ళిన రాక్షస శ్రేష్ఠులూ వారి స్త్రీలూ కొందరు మాయమైనారు. రాక్షస నాయకత్వంకింద సుగ్రీవుడి సాయుధసైనికులు ఆ ప్రాంతాల దాడి చేసి ఆటవికులను కొందరిని చంపి, వారి చర్మాలు వొలిచి తెచ్చారు. కానిఋష్యమూకం ప్రమాదప్రాంతం కాసాగింది. యెన్నడూ ఏ రాజకీయాలూ ఎరగని కిష్కింధ పౌరులు "విప్లవం వర్ధిల్లాలి" అనే నినాదాన్ని చెవులురిక్కించి వింటున్నారు.

జాంబవంతుడికీ పరిస్థితులు బాధ కలిగించాయి. హనుమంతుడితో మాట్లాడాడు. కాని హనుమంతుడికి కిష్కింధ రాజకీయాలు పట్టలేదు. అతడిప్పుడు సంవత్సరానికి

తొమ్మిది నెలలు అయోధ్యలో ఉంటాడు. అతడి అల వాట్లూ భాషాకూడా మారాయి.

"నువ్వు సంకుచితదృష్టి విడిచిపెట్టాలి. ఇప్పుడు మనం అంతర్జాతీయదృష్టి అవలంబించాలి. ఈనాటి మన ఆదర్శం స్వరాజ్యంకాదు, రామరాజ్యం. ఆర్యులూ, వానరులూ, రాక్షసులూ, అందరూ ఇందులో పాల్గొనాలి. రామ రామ రామ సీతా! రామ రామ రామ సీతా!" అని పాడుతూ వెళ్ళాడు హనుమంతుడు.

ఇది జరిగిన మర్నాడే సుగ్రీవుడు తన మంత్రులను పిలిపించి వారి కీ విధంగా రాజకీయోపన్యాసం చేశాడు!

"జైరాం! మనం కష్టపడి రామ రాజ్యానికి పునాది వేశాం. ఈ పునాదిని మనం రక్షించాలి. లేకపోతే మనం పతనమైపోతాం. ఇది లోతైన పునాది. దీనిమీద కుటీరం నిర్మిస్తామా? నిర్మించం. దివ్య హర్మ్యం నిర్మిస్తాం. పరిస్థితులు మారాయి. పరిస్థితులతోపాటు మనమూ మారాలి. మనలో కొందరం యింకా కిష్కింధా కుటీరాన్ని గురించే కలలు కంటున్నాం. ఇది మానాలి. నిన్నటి మన శత్రువులు నేడు మన మిత్రులయారు. ఇదే రామరాజ్యానికి ప్రథమసోపానం. ఈ సంధి సమయంలో మనం కొన్ని అవాంతరాలను ఎదు ర్కొనవలిసి వస్తుంది. అందరమూ కలిసి యెదుర్కొంటే ఈ అవాంతరాలు పటాపంచ లైపోతాయి. రాక్షసులువచ్చి ఇక్కడ అధికారాలు చలాయిస్తున్నారని చాలామంది వాపో

తున్నారు. ఇది పొరపాటు. అక్కడ లంకలోకూడా అనేకులు ఇటువంటి దుష్ప్రచారమే చేస్తూ విభీషణుడు శ్రీరామచంద్ర మూర్తి తొత్తు అనీ, అక్కడ ఆర్యులు రాజ్యం చేస్తున్నారనీ ప్రచారం సాగుతున్నది. రామరాజ్యాన్ని ప్రతిఘటించే పాపులే ఇట్టి ప్రచారాలు సాగిస్తున్నారు. రాక్షసులు మనకు శత్రువులే అనుకున్నా ఆ విషయాలను మనం ఎంత త్వరగా విస్మరించితే అంత త్వరగా బయటపడతాం. వాళ్ళదగ్గర నుంచి మనం నేర్చుకోవలిసింది చాలా ఉన్నది. రాక్షసుల మీద దుష్ప్రచారం సాగించేవాళ్ళే ఆర్యులపట్లకూడా దుష్ప్రచారం సాగిస్తున్నారు. ఆర్యులు మనకు ఆప్తులు. వాళ్ళని దూషించే పాపాత్ములే రాక్షసులనుకూడా దూషిస్తున్నారంటే వారి ఆశయాలు మనం సులభంగా గ్రహించవచ్చు. నన్నుగురించి అయోధ్యలో ఒక ప్రసిద్ధ పత్రిక వ్రాసిన సంపాదకీయం చదివి ముగిస్తాను" అన్నాడు సుగ్రీవుడు.

ఆ సంపాదకీయం ఇట్లా వున్నది :

"కిష్కింధలో జరిగే అల్లరులను గురించి ఎప్పటికప్పుడు వార్తలు వస్తున్నవి. కాని రామరాజ్య వ్యతిరేకులను సుగ్రీవుడు దక్షతతో నిగ్రహించుతూ పరిపాలిస్తున్నందుకు అభినందనీయుడు. సుగ్రీవుడు వొక్కవిషయం గ్రహించినట్లయితే అతని పని సుగమంకాగలదు. అతని చుట్టూ ఉన్నవారిలో కొందరు పాతకాలపు వారున్నారు. వీరి దేశభక్తిని గాని, స్వామిభక్తినిగాని శంకించము గాని

వీరు అధికంగా ఇతర పరిస్థితులలో ఉన్నత పదవులకువచ్చిన వారు, యుద్ధరంగంలో నైపుణి ప్రదర్శించినవారు. వీరిలో చాలామంది నూతన పరిస్థితులను అవగాహన చేసుకో లేకుండా ఉన్నారు ... ఆర్యులతోనూ, రాక్షసులతోనూ కూడా సుగ్రీవుడు రాజకీయ పరిజ్ఞానం కలవాడై చేసుకున్న సంబంధాలు రామరాజ్య వ్యాప్తికి ఎంతో దూరం తోడ్పడ గల వనటానికి సందేహంలేదు."

దురదృష్టవశాత్తూ జాంబవంతుడు ఈ సుగ్రీవ ప్రసం గంలో చాలావరకు వినలేదు. పెద్దవాడవుతూండటంవల్లా, స్తంభం చాటున ఉండటంవల్లా అతడు ఆసనంలో చేరగిల బడి ఒక కునుకు తీశాడు. ఆ కునుకులో అతని కొక కల కూడా వచ్చింది...

తానుఋష్యమూకం మీాద నిలబడి ఉన్నాడు. అంత దూరాన ఒక బ్రహ్మాండమైన సభ జరుగుతున్నది. కొన్ని వేల మంది వానరులు అక్కడ గుమికూడారు. ఒకళ్ళ తర వాత ఒకరు ఉపన్యాసాలిస్తున్నారు. వాళ్ళు చెప్పేదేమిటో జాంబవంతుడికి వినిపించలేదు. కాని అన్ని వేలమంది వాన రులు ఆ ఉపన్యాసం అంత శ్రద్ధగా ఆలకించటమే అతడికి ఆశ్చర్యం వేసింది. ఒక్క సుగ్రీవుడుతప్ప కిష్కింధలో ఇంత మందిని పోగుచెయ్యగలవాడు లేడు. సుగ్రీవుడుకూడా ఇంత మందిలో ఈ చైతన్యం తీసుకురాలేదు.

"వాళ్ళే నిజమైన కిష్కింధ! నే నెరిగిన కిష్కింధ!" అనుకున్నాడు జాంబవంతుడు.

దృశ్యం మారిపోయింది. కిష్కింధ వీథులన్నీ ప్రజామయం. ఇళ్ళల్లోనుంచి మంచి దుస్తులు వేసుకున్నవాళ్ళనీ, రాక్షసుల్నీ బయటికి లాగుతున్నారు. కోలాహలం వినిపిస్తున్నది.

దృశ్యం మళ్ళీ మారింది. అది కిష్కింధేకాదు. లంక. అక్కడా ఇదే జనం. ఇదే అల్లరి. ఇళ్ళల్లోనుంచి మంచి దుస్తులు ధరించిన ఆర్యులను లాగేస్తున్నారు.

మళ్ళీ దృశ్యం మారింది. అది అయోధ్య. అక్కడా ప్రజలే. ఎవరో కేకపెట్టారు. 'విప్లవం వర్థిల్లాలి!"

అకస్మాత్తుగా నిశ్శబ్దం. జాంబవంతుడు ఉలిక్కిపడి లేచాడు.

"విప్లవం వర్థిల్లాలి!" అని పెడబొబ్బ పెట్టాడు.

ప్రసంగం పూర్తిచేసి కూర్చోబోతున్న సుగ్రీవుడు బాణందెబ్బ తిన్నవాడల్లే అయినాడు.

మర్నాడు జాంబవంతుణ్ణి మంత్రి వర్గంలోనుంచి తీసేశారు.

ఈవార్త తెలియగానే జాంబవంతుడు నవ్వసాగాడు.

"ఏమిటి, నాన్నా నవ్వుతున్నావు?" అన్నది జాంబవతి.

"ప్రజలు స్వాతంత్ర్యం సంపాదించటం నేను కళ్లారా చూశాను. సుగ్రీవుడు నన్ను ఉద్యోగంలోనుంచి తీసేశాడు. ఆ ప్రజలని ఉద్యోగంనుంచి తియ్యలేదు పాపం!" అన్నాడు జాంబవంతుడు.

# బ్లాక్ మార్కెట్

శర్మ అమిత బిడియస్తుడు. ఉన్నఊళ్లోనే ఫస్టుగ్రేడు కాలేజి ఉంది గనక బియ్యే పాసయినా, అతనెన్నడూ ఇల్లు దాటీ, ఊరుదాటీ బయటికి వచ్చినవాడుకాడు. కొత్తమొహాలను సమీపించడమూ, పరిచయం చేసుకోవడమూ అతనికి రానివిద్య. ఇప్పుడు లేదుగాని, చిన్నతనంలో ఎవరైనా తనతో గొంతెత్తి మాట్లాడినా ఏడిచేవాడు. అందుచేత అతనికున్న కొద్దిమంది స్నేహితులూ, ఉపాధ్యాయులూ కూడా అతని విషయంలో ఎంతో జాగ్రత్తగా ఉండేవాళ్లు.

శర్మతండ్రి ఇటీవల చాలాడబ్బు గడించాడు. అసలే కొడుకంటే యెంతో గారాబం. దానికితగ్గట్టు బోలెడంత డబ్బుకూడా వుంది. అబ్బాయి ఇంతకాలానికి ఇల్లువదిలి, లా చదవటానికి పట్నం వెళుతున్నాడంటే తండ్రి బోలెడంత డబ్బు ఇచ్చి పంపాడు. శర్మ కాలేజీలో ప్రవేశించిన రోజునే బాంకులో అయిదువందలు వుంచుకుని, మొదటినెల ఖర్చుకింద రెండువందలు దగ్గిర ఉంచుకున్నాడు.

శర్మదగ్గిర డబ్బున్నట్టు పసిపట్టి అతని సహాధ్యాయులు ఒకరిద్దరు అతనిదగ్గిర చేరారు. పట్నంవచ్చి అతను

సంపాదించిన మొదటి స్నేహితులు వాళ్ళే. శర్మ వెంటనే ఉంటూ, కాఫీహోటళ్ళకూ, సినిమాలకూ తిప్పి దగ్గరఉన్న డబ్బంతా పదిరోజుల్లో ఖర్చుచేయించారు.

పిరికివాడి లక్షణమేమిటంటే, అలవాటులేని పని ఏదీ ధైర్యంగా చెయ్యలేడు. శర్మ రోజుకు ఇరవై రూపాయల చొప్పున ఎన్నడూ ఖర్చుపెట్టి ఎరగడు. నెలకు రెండువందలు ఖర్చుపెట్టినా జాస్తిఖర్చే. అయినప్పటికీ ఆ ప్రకారం డబ్బు పంపిస్తూ వుంటానని తండ్రి అన్నాడు. బాంకులో అయిదు వందలున్నమాటకూడా నిజమే. కాని అది అవసరానికి— రోజువారీ ఖర్చుకు కాదు. ఈ ప్రకారం ఖర్చుచేస్తూ పోతే పైనెల డబ్బు వచ్చేలోపుగా బాంకులో ఉన్నదంతా ఊడ్చి పెట్టుకుపోతుంది. ఏం చెయ్యాలో శర్మకు తోచలేదు. తన స్నేహితుల్ని వదిలించుకుంటే తనకీ బెడద వదులుతుందని శర్మకు తట్టకపోలేదు. కాని యెట్లా వదిలించుకోవటం ?

గత్యంతరంలేక శర్మ బాంకులో నుంచి ఒక వంద తీశాడు. మళ్ళీ వారం తిరిగివచ్చే లోపుగా యెగిరిపోయింది. ఇది యింతేననుకున్నాడు శర్మ. ఒక మనిషిని దోచి మరొక మనిషి ఎట్లా తింటాడో అతనికి అర్థంకాలేదు. తన వెంట వచ్చి తనచేత ఖర్చుపెట్టించటానికి వాళ్ళకి సిగ్గు ఎట్లాలేదో అని ఆశ్చర్యపడ్డాడు. వాళ్ళకి తను ఏవిధంగా అచ్చిఉన్నట్టు? ప్రతాపనికన్నా, ఒక్కసారికూడా వాళ్లు హోటలుబిల్లు లివ్వరే! సినిమా టిక్కెట్లు కొనరే ! తనచేత ఇంతడబ్బా ఖర్చుపెట్టిస్తూకూడా "వెధవహోటలు! వెధవ సినిమా!" అని వ్యాఖ్యానం చేస్తారు. లంచి తీసుకుంటే కానిమేరాలో

తీసుకోవాలిట. వాళ్ళెంతవాళ్లు నిత్యమూ కానిమేరాకు వెళ్లేటట్టు! తనకు చిలుము వదులుతూనే ఉంది. వాళ్ళకు సంతృప్తి లేనేలేదు. వాళ్ళను సంతృప్తి పరచవలిసిన అవసరం తనకేమిటో? ఇంటి అల్లుళ్ళుకూడ యింత అన్యాయంగా ప్రవర్తించరు. అనుకున్నాడు శర్మ. వాళ్లని వదిలించుకోలేనందుకు అతనికి తనమీద ఎంతో అసహ్యం వేసింది.

యిటువంటి మనస్థితిలో ఉండగా శర్మకు పద్మనాభశాస్త్రి పరిచయం కలిగింది. అదికూడా చిత్రంగానే జరిగింది. పద్మనాభశాస్త్రిమారుపేరుతో పత్రికలకి కథలూ, వ్యాసాలూ పంపుతూ వుండేవాడు. కథలమాట ఏదైనా పద్యాలు చాలా చురుకుగానూ, రసవంతంగానూ వుండేవి. వాటిల్లో భావకవిత్వపు మార్దవమూ, లాలిత్యమూ లేకపోయినా, ఒక విధమైన బరువూ, వేగమూ, తీవ్రతా, గురీ కలిగి ఎంతో సజీవంగా వున్నట్టుండేవి. అందుచేత శర్మ శాస్త్రి కవిత్వం ఏ పత్రికలో కనిపించినా తప్పక చదివేవాడు. కొన్ని పంక్తులు కంఠస్థంకూడా చేశాడు. కాని ఆ కవి తన సహాధ్యాయి అయిన పద్మనాభశాస్త్రేనని శర్మ ఎరగడు.

ఒకనాడు లాకాలేజీలో మీటింగు. ఎవరో ప్రఖ్యాత కవులు వచ్చి వుపన్యసిస్తారు. శర్మ పెందలాడే వెళ్ళి గాలరీలో కూర్చున్నాడు. అతని పక్కనే పద్మనాభశాస్త్రి, అతనితో తిరిగే ఒక రిద్దరు స్నేహితులూ కూచున్నారు. శర్మ ఎవరినీ అంటించుకునే బాపతుకాదు. గనక వాళ్ళను

పలకరించలేదు. కాని వాళ్ళు మాట్లాడుకునే మాటలు వింటూనే వున్నాడు. పాతకవుల్ని, వారి పోకడలనూ చాలా తేలికగా విమర్శిస్తున్నారువాళ్ళు. రాయప్రోలూ, దేవులపల్లీ, నాయనీ, వేదులా మొదలైన వాళ్ళలో వేడి ఏనాడో చల్లారిందన్నాడు ఒకడు. వారిలో వేడి చల్లారిందనటంకన్న, జీవితమే వేడెక్కటంవల్ల వారి వేడి యిప్పుడు మనకు ఆనటంలేదన్నాడు మరొకడు. పద్మనాభశాస్త్రి మరొక వింత సిద్ధాంతం లేవదీశాడు. ప్రతేక కవుల ప్రతిభను గాని, వాటిని సృష్టించే కవిత్వానికిగాని హెచ్చు విలువ లేదుట, అంతకన్న ఒక వుద్యమానికి, ఒక పోకడకూ ఎక్కువ విలువవుందిట. ఒకేసారి పదిమంది ప్రతిభావంతులైన కవులు దేశంలోవుండి కవిత్వం రాసినా వారి వుమ్మడి సాహిత్యంలో ఒక ఆశయము ఒక ధోరణి లేక తలా ఒకదారీ అయిన దానివల్ల ఏమీ ప్రయోజనంఉండదు. ఒక సాహిత్య వుద్యమం వున్నచోట ఒక గొప్ప కవికూడా లేకపోయినా ఆ ఉద్యమంలో తయారయిన సాహిత్యం సాంఘిక ప్రయోజనం కలిగిందిట. ఈ సాహిత్య సిద్ధాంతం విని ఊరుకోలేక శర్మ, "షేక్స్పియరు ఏ సాహిత్యోద్యమం వాడు? కాళిదాసు మాటేమిటి?" అని పద్మనాభశాస్త్రి నడిగాడు. ఆకాలంలో సంఘం సాహిత్యంమీద ఇంతగా ఆధారపడి వుండలేదు" అన్నాడు శాస్త్రి. "మన పూర్వులు సంఘం ప్రయోజనం చూచి కావ్యాలు వ్రాయలేదా" అన్నాడు శర్మ. "తాటాకు పుస్తకాల కాలంలో ఒక్క ఉద్గ్రంథమే ఒక వుద్యమంగా వుండేద"న్నాడు శాస్త్రి.

అన్నిటికీ అన్నీ చెప్పటానికి శాస్త్రి తయారవుతున్నట్టు కన పడింది శర్మకి. అతను వాదం కట్టిపెట్టేసి, "కాలేజీ విద్యార్థులుసాహితీపరులయ్యేసరికి సాహిత్యం అధోగతికిపోతోంది" అన్నాడు శర్మ. పద్మనాభశాస్త్రి వెంటవున్న యిద్దరు ముగ్గురూ ఒకసారి నవ్వి, "శాస్త్రి మంచిదెబ్బతిన్నాడు... ఏమంటావు, శాస్త్రీ? చెప్పుకో సంజాయిషీ!" అన్నారు. వాళ్ళెందుకు నవ్వారో శర్మకు అర్థంకాలేదు. కాని మరి కాస్సేపట్లోనే శాస్త్రి తన అభిమాన కవి అని శర్మ తెలుసుకున్నాడు. కవిత్వం గురించి గురువల్లే తనకు చెప్పదగిన మనిషితో వాదించినందుకు శర్మకు కష్టంవేసి శాస్త్రికి క్షమాపణయిచ్చి, అతని కవిత్వంమీద తనకున్న అభిమానం బయటపెట్టాడు. "నా విశ్వాసాలమీద అభిమానం వుండి, వాటిని బలపరచటానికి పదిమంది కవులు ముందుకు వస్తే ఏదన్నా ప్రయోజనం వుంటుంది. లేని పక్షంలో నాది అరణ్యరోదనమే," అన్నాడు శాస్త్రి.

ఈవిధంగా శర్మ శాస్త్రిస్నేహితులలో ఒకడైనాడు. యిదివరకు శర్మ తను చదివే పుస్తకాలలో వుండే భావాలకు సాంఘిక ప్రయోజనం వుండనే జ్ఞానం అట్టే లేకుండా వుండేవాడు. రచనలద్వారా రచయితల పరిచయం చేసుకునేవాడేతప్ప ప్రపంచంతో పరిచయం చేసుకునేవాడుకాడు. శాస్త్రికవిత్వంనిండా స్వాతంత్ర్యకాంక్షా, దారిద్ర్యంగురించీ, అజ్ఞానంగురించీ ఆవేదనా, కష్టజీవులనుగురించి బాధా మొదలైనవాటిని శర్మ రససాధనాలుగా పరిగ్రహించేవాడే గాని, అవి యదార్థమైనవనీ, జీవితంలో వాటికి వేరు

వేరు అర్థాలున్నాయనీ ఎన్నడూ బుద్ధితో గ్రహించి వుండలేదు.

శాస్త్రి స్నేహం శర్మకు అనేకవిధాల లాభించింది. నిప్పుసెగ తగలగానే నెయ్యి కరినట్టు తన పాతస్నేహితులు విచ్చిపోయినారు. శాస్త్రి వాసనగాని, అతని అనుచరుల వాసనగాని వాళ్ళకి ఏమాత్రమూ సరిపడలేదు. ఆ మాటకు వస్తే శర్మకూ-డా వాళ్ళ వాతావరణం కొత్తగానే వుండేది. అతనిమాదిరిగా శాస్త్రి లోకాన్ని వున్న దున్నట్టు ఆమోదించినవాడు కాడు. సంఘ వ్యవస్థలో కొన్ని లోపాలున్నాయనీ, సంఘ వ్యవస్థను వివిధంగా మార్పుచేసే శక్తులు కూడా వున్నాయనీ, కొన్ని శక్తులను బలపరిస్తే సంఘం మరింత అధోగతికి పోతుందనీ, ఏమీ చెయ్యకుండా ఆమోదించి ఊరుకున్నవాడుకూడా ఒక తరగతి సంఘద్రోహేననీ శాస్త్రిమతం. శాస్త్రి అనుచరులలో ఈ మతం పుచ్చుకోనివారు లేరు. శర్మకీ దృష్టి వెనక ఎప్పుడూ లేదు. ప్రపంచంలో ఏయే సాంఘిక నియమా లున్నాయో వాటినల్లా పాటించటమే మంచివాడి లక్షణమని అతను నమ్మివున్నాడు. అందుచేత శాస్త్రి ఒకవిధమైన విప్లవకారిగా అతని దృష్టికి తోచాడు. బాంబులు వెయ్యకపోతేనేం? సంఘంలో చలామణీ అవుతున్న అనేక సిద్ధాంతాలనీ, విశ్వాసాలనీ శాస్త్రి ప్రతిఘటిస్తున్నాడు. అందుచేత శర్మకు శాస్త్రిమీద గౌరవంతోపాటు అంతో యింతో భయంకూడా వుండేది.

శాస్త్రి మగవాడు, అతనిలో యిటువంటి ఆవేశం వుండటం అంత వింతకాదు. శాస్త్రి చెల్లెలు వనజాక్షికూడా

యిదే ధోరణి. తను చెప్పినదంతా అవునంటుందేమో నను కున్నాడు శర్మ మొదట్లో. కాని చూసినకొద్దీ వనజాక్షితో పోలిస్తే శాస్త్రి యింకా సౌమ్యుడుగా కనిపించాడు.

వనజాక్షి యింటరు మొదటి సంవత్సరం చదువు తున్నది. కాని, యిప్పటికే అనేక పుస్తకాలు చదివింది. ఎంతో అందంగానే దుస్తులూ అవీ ధరించేది. అయినా మగవాళ్ళ నాకర్షించటానికి ప్రయత్నిస్తున్న మనిషిలాగా కనిపించేదికాదు. ఆడపిల్లలు సహజంగా మాట్లాడే విష యాలను గురించి సంభాషించేదికాదు. ఎప్పుడూ మగవాళ్ళ మధ్యనే వుండటంవల్ల వనజాక్షి అట్లా తయారయి వుండ వచ్చు. అచ్చగా ఆడపిల్లలమధ్య ఒక గంట గడపవలసివస్తే ఆమె ఏంచేస్తుందో శర్మ ఊహించలేకపోయినాడు.

శర్మకు వనజాక్షిమీద గౌరవంతోపాటు అనురాగం కూడా ఏర్పడసాగింది. మొదట్లో ఈ అనురాగం విస్ప ష్టంగా లేదు. అటువంటి ఆడవాళ్ళు చాలా అరుదనీ, వన జాక్షి ఎవరిని పెళ్ళాడుతుంతోగాని వాడు ఎంతో పెట్టిపుట్టిన వాడయి వుండాలనీ అనుకున్నాడు. బీచికి షికారువెళ్ళినా వెంట వనజాక్షి వుంటే ఒక ప్రత్యేకమైన ఆనందం వుండేది. "నేను వనజాక్షిని ఎరుగుదును," అని అందరితోటీ చెప్పుకోవా లనిపించేది. తన కేదైనా పుస్తకంగాని సినీమా గాని నచ్చితే వెంటనే ఆ అనుభవం వనజాక్షికూడా పంచు కోవాలని ఉబలాట పడేవాడు శర్మ. వనజాక్షి తన అభి రుచిని బలపరచకపోతే చాలా కష్టపడేవాడు. కాని వనజాక్షి విమర్శ శ్రద్ధగా వినేవాడు. వనజాక్షితో చర్చించి తన అభి

రుచులు చాలా విషయాల్లో మార్చుకున్నాడు. కాని అతని కట్లా చెయ్యటంవల్ల ఆత్మవిశ్వాసం తగ్గలేదు. అతని వ్యక్తిత్వానికి భంగంకూడా రాలేదు.

మరో కారణంచేతకూడా వనజాక్షి శర్మకి దగ్గర మనిషి అయింది. శాస్త్రి తన రచనలను గురించి దీర్ఘ చర్చలు ప్రోత్సహించేవాడు కాడు. కాని వనజాక్షి అటు వంటి చర్చలు గంటల తరబడి చెయ్యనిచ్చేది. శాస్త్రికున్న అనేక స్నేహితులకన్న శర్మ వనజాక్షికి దగ్గర స్నేహితుడుగా పరిణమించాడు. వనజాక్షి అతనిదగ్గర చనువు చాలా తీసుకునేది, అతనికి చనువు ఇచ్చేదికూడాను. ఎక్కడికైనా బయల్దేరి పోయేటప్పుడు శర్మ ఆఖరుక్షణాన వనజాక్షిని చీరె మార్చుకోమనేవాడు. వనజాక్షి మార్చుకునేది. శర్మకు తనమీద సర్వహక్కులూ వున్నట్టు నటించడం వనజాక్షికి సరదా.

ఆమె తన జీవితంలో— ప్రత్యేకించి తన మానసిక జీవితంలో—ఎంత స్థానం ఆక్రమించుకుందో ఆలోచిస్తే శర్మకు భయం కలగసాగింది. ఎల్లకాలమూ యిట్లా వెళ్ళదు. లా చదువయిపోతుంది. తను స్వగ్రామం వెళ్ళి మళ్ళీ మామూలు జీవితంలో పడిపోతాడు. తనకు పెళ్ళవుతుంది. వనజాక్షికి పెళ్ళవుతుంది. అప్పుడు వనజాక్షి ఆక్రమించుకున్న స్థానం ఖాళీ అయితే తన మనస్సేమైపొయ్యేటట్టు? ఆ జాగాలో యింకేమీ పెట్టటానికి వుండదు.

సాహసించి మైమరచి, తాను వనజాక్షిని పెళ్ళాడతాననవచ్చును. కాని ఆమె యెందుకు ఒప్పుకుంటుంది? అసం

భవం! తన తల్లిదండ్రులకుగాని, యితర బంధువులకుగాని అర్థమయే మనిషికాదు వనజాక్షి. వనజాక్షిని పెళ్ళాడటానికి గాని, ఆమెను తన ఇంట్లో కాపరం పెట్టటానికిగాని తన కేవిధమైన హక్కూ లేదు. ఆమెకు తగ్గ భర్తగా తయారై, తనకోసం ఇంటిదగ్గర యెదురుచూసే కుళ్ళు జీవితాన్ని తృణీకరించి తోసివేసే శక్తి అంతకన్నా లేదు. వనజాక్షి తనకి దక్కదు—మున్ముందెటికీ దక్కదు. ఆ విషయంలో శర్మకు యెటువంటి సందేహమూ అవసరంలేదు! అయినప్పుడు, ఈ స్నేహం ఏమయేటట్లు?

ఈ సమస్య శర్మను చాలా బాధిస్తూ వుండేది. వనజాక్షి తనను దూరంగా వుంచితే బాగుండును, అనుకునే వాడతను. కనీసం పద్మనాభశాస్త్రి అయినా తమ స్నేహం పట్ల అనుమానమూ, అసూయా ప్రకటించితే బాగుండును అనుకునేవాడు.

శర్మ సమస్య తలవని తలంపుగా, అకస్మాత్తుగా పరిష్కార మయింది.

ఒకనాడు శాస్త్రి నలుగురు స్నేహితుల యెదటా తాను రాసిన కొత్తగేయం వినిపించాడు. దానిపేరు "చీకటి బజారు" అది విస్పష్టమైన రచనకాదు. ఒకేసారి రెండు మూడు విషయాలు ధ్వనించే టట్టుగా, వ్యంగ్యంగానూ, నిగూఢంగానూ రాశాడు శాస్త్రి. అందులో జారత్వమూ, చోరత్వమూ, దొంగవ్యాపారమూ ఒకేసారి వర్ణించబడ్డాయి. ఒక్కోచోట అన్వయం అస్పష్టంగా వున్నా అంతటా ధ్వని అత్యద్భుతంగా వుంది.

శాస్త్రి చేత ఆ గేయం అరడజనుసార్లయినా చదివించుకున్నారు స్నేహితులు. శర్మకుమాత్రం మొదటినుంచీ కూడా ఆ గేయం తన ఆస్వాదనకు పనికివచ్చేది కాదన్నట్టు అనిపించింది. అన్నిసార్లు విన్నప్పటికీ అది తనలో ఏవిధమైన ఆనందమూ రేకెత్తించలేదు. పైపెచ్చు తనకీ ఆ గేయానికీ మధ్య ఏదో ఒక గోడ అడ్డం వున్నట్టుకూడా కనిపించింది.

గేయం చదవటం అయినాక కంట్రోళ్ళను గురించీ, దొంగమార్కెట్టుగురించీ, ఆకలి చావులనుగురించీ నలుగురు మాట్లాడసాగారు. ఆ చర్చలో తన కేమీ భాగంలేనట్టుగా కూర్చున్నాడు శర్మ. అతని మౌనం అర్థంచేసుకున్నట్టుగా మిగిలినవాళ్లు తమలోతాము చర్చించుకో సాగేవారేగాని అతన్ని పలకరించలేదు. నలుగురు చేరినచోట ఒకర్ని వొదిలేసి మిగతావాళ్ళు మాట్లాడుకుంటుంటే, సంభాషణలో చేరని మనిషికి యెంతో కష్టంగా వుంటుంది. ఆ మనిషికి దగ్గరవాడైతే మరీ కష్టంగా వుంటుంది. శర్మకు చాలా కష్టం వేసింది. యితరులేంచేసినా అతనికి బాధలేదు. వనజాక్షి కూడా తనను విస్మరించటం అతన్ని మరీ బాధించింది.

దొంగవ్యాపారం చేసేవాళ్ళని అందరికన్నా వుత్సాహంగా తిట్టుతున్న మనిషి వనజాక్షే. మిగిలినవాళ్ళూ తిడుతున్నారు. కాని వాళ్ళేమంటున్నారో శర్మకు పట్టలేదు. వనజాక్షి తిట్టటమే అతనికి వినిపిస్తోంది. ఆమె అయినా దొంగ వ్యాపారస్తుల నందర్నీ తిడుతున్నట్టులేదు; తననే తిడుతున్నట్టున్నది. తనని సహించటానికే ఈ సంభాషణ యావత్తూ జరుగుతున్నట్టుంది. వనజాక్షి పనిపెట్టుకుని తన

అన్నచేత "చీకటిబజారు" గేయం రాయించిందనికూడా శర్మ అనుమానించాడు.

ఈ క్షణాన వనజాక్షిని చూస్తే శర్మకు హత్యచెయ్య బుద్ధిపుట్టింది. మనం ఇతరులను క్షమించినంత సులభంగా ప్రేమించినవారిని క్షమించలేం. శర్మ వనజాక్షిని క్షమించ లేకపోయినాడు. అతను అకస్మాత్తుగా సంభాషణలో జొర బడి, "శ్రీరంగ నీతు లెన్నయినా చెప్పవచ్చు! అవకాశం దొరికితే దొంగమార్కెట్లో డబ్బు చేసుకోనివా ళ్ళెవరూ వుండరు!" అన్నాడు గట్టిగా.

అందరూ ఆశ్చర్యంతో అతనికేసి చూశారు. ఒక నిమిషంపాటు ఎవరినోటా మాటలేదు. ఆ నిశ్శబ్దం అసలే భరించలేకపోయినాడు.

"మా నాన్న వేలకువేలు సంపాదించాడు. నా దగ్గిర మీలో ఎవరైనా ఒక చుక్క కాఫీ తాగిఉంటే అది నల్ల బజారులోనుంచే వచ్చింది. ఆ పాపం పొయ్యేటందుకు మీరంతా ఏదైనా పుచ్చుకోండి!" అన్నాడు శర్మ హిస్టీరి యాతో.

అతని మాటలకు యెవరూ చలించలేదు. కాని వనజాక్షి మొహం జేవురించింది. ఆమె కోపంతో వాణికి పోవటం శర్మ స్పష్టంగా చూడగలిగాడు.

"మీరు తక్షణం వెళ్ళిపొండి! యిక యిక్కడి

కెన్నడూ రావద్దు తెలిసిందా? యెన్నడూ రావద్దు" అని కేక వేసింది.

శర్మ మారు మాట్లాడలేదు. లేచి వెళ్ళిపోయాడు. యెవ్వరూ మాట్లాడలేదు. శాస్త్రి చాలా చిన్న గొంతుతో యిట్లా చెప్పాడు:

"మనం ఏ దొంగ వ్యాపారినిగురించీ మాట్లాడు కోవటంలేదు. దొంగ వ్యాపారంగురించి మాట్లాడు కుంటున్నాం. రేపీ కంట్రోళ్ళు రద్దయితే బహిరంగంగానే ధరలు పెంచి వ్యాపారాలు సాగిస్తారు. శర్మగాని వనజాక్షి గాని వ్యక్తిగతమైన నిందలకు దిగవలసిన అవసరం లేదు." అన్నాడు.

వనజాక్షి సమాధానం చెప్పలేదు. ఆమె శర్మ ప్రవర్తనను ఏమాత్రమూ సహించలేకపోయింది. అతను క్షమాపణ చెప్పుకోకపోతే అతన్ని గురించి తన అభిప్రాయం అణుమాత్రంకూడా మార్చుకోదలచలేదు. అతని తండ్రి ఏపాడుపని చేసినప్పటికీ శర్మ తండ్రిని వెనక వేసుకొనివచ్చి ఉండనవసరం లేదనుకున్నదామె.

శర్మ ఆగోజల్లా తనకు పెద్ద అవమానం జరిగినట్టే భావించాడు. తన తొందరపాటును రకరకాల సమర్థించుకున్నాడు. కాని ఒకటి రెండు రోజులు గడిచిన తరవాత అతని చెవిలో వనజాక్షి అన్న ఆఖరుమాటలు మారు మోగటం మానేసి అంతనుపూర్వం ఆమె అన్నమాటలన్నీ ధ్వనించసాగాయి. ఆ వనజాక్షి ఏమయిందా అని ఆశ్చర్య

పడ్డాడు. ఆ వ్యక్తి తన కల్పనేనా? అసలు వనజాక్షి తనను వెళ్ళిపొమ్మన్నదేనా? అతనికి తెలియలేదు.

డిసెంబరు సెలవులకు శర్మ ఇంటికి వెళ్ళాడు. అతను యింటికి చేరిన మరి రెండు రోజులకు అతని మొదటి స్నేహితు లిద్దరు వచ్చారు. తన స్నేహితులల్లే నటించారు. శర్మ తండ్రినికూడా నమ్మించారు. శర్మకు వాళ్ళనుచూస్తే యెంతో రోతపుట్టింది. కాని అతని తండ్రిమాత్రం వారిని ఆత్రీగా స్వీకరించాడు. వాళ్ళమీద యెంతో డబ్బు ఖర్చు చేశాడు. వారం రోజులుండి వాళ్ళు వెళ్లిపోయినారు

"పట్నంలో నీ కిటువంటి స్నేహితు లున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. చాలా పెద్దమనుషులు!" అన్నాడు తండ్రి.

శాస్త్రినిగాని వనజాక్షినిగాని చూస్తే తన తండ్రి ఏమని ఉండునో అతని కర్థమయింది. తన తండ్రికి కావల సింది డబ్బుకు దొరికే పెద్దమనుషులు! ఆయన అనదగిన మాటలు తను అనేశాడు శాస్త్రి యింటిదగ్గిర. ఇంతకంటె విపరీతం ఉంటుందా?

శర్మ వెంటనే కూచుని వనజాక్షికి రెండు బంతుల ఉత్తరం రాశాడు.

"వనజాక్షి, మతిలేనివాడి క్షమాపణ కేమైనా అర్థం ఉంటే నా క్షమాపణ స్వీకరించు—శర్మ."

ఈ ఉత్తరానికి వవజాక్షి మరో రెండు బంతుల జవాబిచ్చింది:

"శర్మగారూ, నేను చాలా తెలివిగలదాన్నని చెప్పలేను. కపటం ఉన్నవాళ్ళెవరూ తమ ఉద్రేకాన్ని మీలాగ బయట పెట్టుకోరు. అది గ్రహించలేక పోయినాను—వనజాక్షి."



—♦ సమాప్తం ♦—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA117B155 |
| --- | --- |
| పుస్తకం పేరు | దీపావళి రాజకీయాలు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 193 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |